# భారతి

మాసపత్రిక

*

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938-1972)

*

సంపుటము : 66 జూన్ 1989 సంచిక : 6

విడిపత్రిక వెల ఐదురూపాయలు

---

## విషయానుక్రమణిక

జూన్ 1989

# స్వవిషయం

ఈ మాసం "భారతి"లో శ్రీ బి. ఎస్. శాస్త్రి అందిస్తున్న "దొండపాడు శిలాశాసనాలు" చారిత్రక పరిశోధకులకు ప్రీతిపాత్రంగా ఉండగలదు.

ఈ సంచికలో శ్రీ కాశూరి హనుమంతరావు కొన్ని శబ్దార్థాలకు వెలువరించిన విశేషాలు భాషా శాస్త్రజ్ఞులకు ఉపయోగపడగలవు.

అలాగే డా॥ ఎం. బుద్ధన్న గాలిబ్ కవిత్వంలో దర్శించిన జీవనరేఖలు సార్వజనీక సార్వకాలిక సత్యాలుగా ఎవరైనా గుర్తించగలరు. పోతే తుమ్మలవారి కవితాకళ గురించి డాక్టర్ సూర్యదేవర రవికుమార్ సమీక్షించిన తీరు కూడా ఎంతోమంది సాహితీసుగతులకు సంతృప్తిని కలిగించగలదు.

కాగా, శ్రీ చివుకుల వేంకట సుబ్బావధానులు వ్యక్తపరచిన కవిత్వపు లక్షణాలు చర్చలకు బాగా ఆస్కారమీయగలదని ఆశిస్తున్నాము. మరో ముఖ్యమైన విశేషమేమిటంటే ఈసారి అచ్యుతరాయ శతకంలో లభ్యమైన కొన్ని నీతిపద్యాల గురించి స్వర్గీయ కోదండరామయ్యగారి తరఫున శ్రీ కారుపల్లి విశ్వనాథంగారు ఒక వ్యాసాన్ని సేకరించి పంపారు. ఇది శతక ప్రియులకు బాగా రుచికరంగా ఉండగలదని మా నమ్మకం.

ఈ సంచికలో అందిస్తున్న "పులి" అనువాద కథ కొత్తదనం కోరుకునేవారిని అలరించగలదు. ఇకపోతే కవిత్వం గురించి ప్రత్యేకంగా చెప్పడం లేదు. మంచి కవిత్వం కావాలని కోరుకునే రసజ్ఞులందరికీ ఏకైక వేదిక "భారతి" మాత్రమే కావాలని మా ధ్యేయం. మా వంతు కృషి కూడా అందు కోసమే!

తెలుగువారి సంస్కృతిలోని వైవిధ్యమంతా "భారతి"లో ప్రతిస్పందించాలని మా కోరిక. అందుకు అందరి సహాయ, సహకారాలనూ కోరుకుంటున్నాము.

# తరళమాల

వెలుఁగు కానని మన్మనోగత వీధులందఱుదెంచి, వ్యా
కుల మహాగ్ని శిఖా సముజ్జ్వల కుండమందున నా వ్యథా
నలము సైచుచు నీవు పిండిన నాదు తీయని గుండియల్
విలయరీతి సుధారసాల స్రవించుచున్నవి నేటికిన్.

యుగయుగాలు గతించిపోయే మహోన్నతాశయ భావనా
గగనసీమల నుండి జారి, అఘాతముల్ తిని; ఆ ప్రభల్
మిగులవాయెను నేటికిన్: హృది మృణ్మయమ్మయెనంతటున్,
రగులు దైత్య విలాసకేళిని రట్టు సేసెను నీ స్మృతుల్.

మరల వచ్చెను నాదు జీవన మార్గమందు వసంతముల్;
తిరిగి కోయిల కూయసాగె మదీయ జీవన వాటికన్;
తరులు కూలి లతల్ కృశించిన తావులందు ప్రమోద ని
ర్ఝరులు పాఱెను, వీయసాగె ప్రశాంత మారుత వీచికల్.

అరుణకాంతుల రేఖలన్, గగనాంతరోజ్జ్వల తారలన్,
విరియు వెన్నెల శోభలన్, పికబృంద సౌరభ గీతులన్,
విరుల తేనియలన్ మధుస్వర వీణలన్నిటి మించు ఈ
తరల మాలను కూర్చినాను కృతజ్ఞతన్ గ్రహియింపుమా

శ్రీ గోనెళ్ళ సహారి

# చైతన్యస్తన్యం

మస్తిష్కంలో మరో సహారా
సల సల కాలుతుంది
మనోమూలాలలో మరో నయాగరా
నాట్యం చేస్తుంది
అడవులను అలంకరించే గుండె
పడమటి కొండను పిండి చేస్తుంది
అస్తమించని ఆలోచనా తరంగం
చైతన్య స్తన్యమై విస్తరిస్తుంది.

సి. బి. కృష్ణ

శ్రీ బి. ఎస్. శాస్త్రి

# దొండపాడు శిలాశాసనములు

నల్లగొండజిల్లా, మేళ్ళచెఱువు మండల పరిధిలోనున్న దొండపాడు గ్రామమున రెండు శిలాశాసనము లున్నవి. ఇందు మొదటి శాసనము కాకతి గణపతిదేవ చక్రవర్తి పాలించు కాలమున శకసంవత్సరము **1167**లోను, రెండవ శాసనము కాకతి ప్రతాపరుద్రదేవ మహారాజు పరిపాలనమున శకసంవత్సరము **1233**లోను వేయింపబడినవి.

దొండపాడు గ్రామపు రైతు శ్రీ అన్నపరెడ్డి వేంకటేశ్వర రెడ్డి తమ జవకోటివారి రేగడి పొలము దున్నుచుండ నాగటి కఱ్ఱుకుతట్టి పైకి లేచిన శిలాఫలకమును గాంచి, దానిపై అక్షరములు చెక్కియుండుట గమనించి, గ్రామమునకు తరలించి, ఊరిమధ్యనున్న బావిచెంత నిలిపినాడు. ఆ శాసనము 12 పంక్తులలో చెక్కబడియున్నది. శకసంవత్సరము 1167 నాటిది. శాసనశిల ఎత్తు 3'-8" వెడల్పు 1'-2".

దొండపాడు గ్రామమున గల శివాలయము ఆవరణములో నున్న పెద్ద నాపరాతి ఫలకముపై శకసంవత్సరము 1233నాటి శాసనము 21 పంక్తులలో చెక్కబడియున్నది. ఇచటి శివాలయము శిథిలము కాగా కాకతీయ సిమెంట్సు అధినేత శ్రీ వేంకటేశ్వర్లు గారు నూతనముగ శివాలయమును, ముఖమండపమును ప్రహరీ గోడలను నిర్మించినారు. శివ ప్రతిష్ఠ ఇంకను జరుగలేదు. దొండపాడులోని చెంచమల్లినాథాలయ శిథిలములింకను కనిపించు చున్నవి. భిన్నమైయున్న శివలింగము పానవట్టము, నంది విగ్రహము పరుపుబండలు ఆలయ ఆవరణమందు పడియున్నవి. కాకతి రుద్రమదేవుడు శ్రీపర్వత శిరోమణి శ్రీమత్ కుమారగిరి త్రిపురాంతకదేవర అంగరంగ భోగాలకు, కొండపల్లి నాటిలోని కృష్ణానదీతీర సమీపగ్రామమైన రేపూరును సకలాయ సహితముగా ధారపూర్వకముగా దాన మొసంగుచు వేయించిన శాసనమున రేపూరు గ్రామ సరిహద్దులు తెలుపునపుడు దొండపాడు ప్రశంసింప బడినది.[1]

1. శకసంవత్సరము 1167నాటి శాసనము :

ఈ శాసనము తెలుగుభాషలో **12** పంక్తులలో చెక్కబడి యున్నది. శ్రీ అనంత పద్మనాభస్వామి హారిబలి, నైవేద్యాల నిమిత్తము బొంటు పోత్రెడ్డి తన ప్రభువుకు పుణ్యముగునట్లు రాజులపుట్ట ప్రాంతమున పుట్టిచేను దానమొసంగుచు ఈ శాసనమును వేయించెను. శాసనాంతమున స్వదత్తం పరదత్తంవా శ్లోక మున్నది. శాసనశిలపై సూర్యచంద్రుల ప్రతిమలు, పానవట్టముతో గూడిన శివలింగమును చెక్కబడినవి.

శాసనము శకవర్షము **1167** సర్వధారి వైశాఖ శుద్ధ పౌర్ణమి సోమవారమునాటిది. కావున శాసనకాలము క్రీ.శ. **1245**.

2. శకసంవత్సరము 1233నాటి శాసనము :

శివాలయ ఆవరణమందున్న శిలాఫలకముపై **21** పంక్తులలో చెక్కబడియున్న శాసనము కాకతి ప్రతాపరుద్రదేవుని కాలమునాటిది. ఈ శాసనశిల పొడవు 7'-9"; వెడల్పు 2'-9"లు. శాసనఫలకము భూమిలోనికి నాటబడినది. ఈ శిలాఫలకము పైనుండి క్రిందికి ఏటవాలుగా ఎడమవైపు పగిలియున్నది. శాసనాక్షరములు కొన్ని చెదరిపోయినను తక్కినవి చదువుట కనువుగానుండి శాసనార్థము తెలియుచున్నది.

శాసనారంభమున సూర్యచంద్రుల ప్రతిమలు, సానవట్టముతో గూడిన శివలింగము చెక్కబడియున్నవి. శాసనాక్షరములు కాకతి శాసనాక్షరములను పోలియున్నవి. ముఖ్యముగా మేళ్ళ చెఱువు[2], నడిగుండెం (తాడువాయి)[3], నాగులపాడు[4] పానుగల్లు[5] శాసనాక్షరములను పోలియున్నవి.

---

1. త్రిపురాంతక దేవాలయ శాసనములు. పుటలు. 51-53.
2. నల్లగొండ మండల సర్వస్వము పుటలు 811-812
3. శాసన సంపుటి పుటలు 258-264
4. నల్లగొండ మండల సర్వస్వము పుటలు 774, 806, 823
5. " " " పుటలు 808

కాకతి ప్రతాపరుద్రదేవ మహారాజు పృధ్వీ రాజ్యమేలుచున్న కాలమున చెఱకునాగిరెడ్డి బొల్లయరెడ్డివారి అధికారాం బొమిరాజు ఎఱ్ఱయప్రెగ్గడవారి నాయంకరమందు గల దొండపాడు గ్రామమున గల వెలమ వేగురును, సమస్త ప్రజలును, శ్రీ చెన్నమల్లినాధదేవర రంగభోగమునకు, బ్రాహ్మణవృత్తులు, వరిచేలు, రాచపొలము, రేగడ, వెలిపొలములు, పుట్టి ఒక్కింటికి చిన్నము చొప్పున నిచ్చునట్లును, ఈ దానమాచంద్రార్కముగ నిలుచునట్లును శాసనము వేయించిరి. ధర్మప్రతిపాలకుల పితరులు 21 కులములవారు ఈశ్వర రూపులగుదురనియు, ధర్మమును విఘ్నపరచినవారి పితరులు పాపము బడయుదురనియు వ్యాస గీతాశ్లోకము ముందు చెప్పబడినది.

ఈ శాసనము శకసంవత్సరము 1233 విరోధికృత్సంవత్సర కార్తీకశుద్ధ పాడ్యమీ గురువారమునాటిది. శాసనకాలము క్రీ.శ. 1311.

మేళ్ళచెఱువు గ్రామము వెలుపలనున్న శంభులింగస్వామి ఆలయ ఆవరణములో శకసంవత్సరము 1233 విరోధికృతు, మాఘశుద్ధ పాడ్యమి సోమవారమునాడు వేయించిన శాసనమున్నది. దొండపాడు శాసనము వేయింపబడిన రెండున్నర నెలల పిదప అదేరీతిలో మేళ్ళచెఱువు శాసనము వేయింపబడినది. మేళ్ళచెఱువు ప్రాంతము, బొమిరాజు ఎఱ్ఱయప్రెగ్గడ నాయంకరములోను, నాగిరెడ్డి బొల్లయరెడ్డివారి అధికారమందును ఉన్నట్టిది.

చెఱకురెడ్డి వంశీయులకు సంబంధించిన శాసనములు, నల్లగొండ, మహబూబు నగరము, కర్నూలు జిల్లాలలో లభించినవి. ఈ వంశీయులు కాకతి రెండవ బేతరాజు కాలమునుండి రెండవ ప్రతాపరుద్రుని పాలనాంతమువరకు కాకతి ప్రభువుల దండనాయకులుగను, మహాసామంతాధిపతులుగను వ్యవహరించినారు. నల్లగొండ మండలమునందు ఈ వంశీయులకు సంబంధించిన శాసనములు, జలాల్పురము, మేళ్ళచెఱువు, దొండపాడు, ఇదమపల్లి కూరేళ్ళ ప్రాంతములందున్నవి.

చెఱకురెడ్డి వంశమునకు సంబంధించిన మహాసామంత రాజ్యములు 1) జమ్మలూరు 2) అమరాబాదు 3) వేలూరు ప్రాంతములందుండెను.

## చెఱకురెడ్డి వంశవృక్షము



## 1. దొండపాడు శిలాశాసనము

### శాసనము_మూలము

1. స్వస్తిశ్రీ శుభశక
2. వషఁాంబులు ౧౧౬౭
3. సవ్వఁధారి సంవత్సర వై
4. శాఖ శుద్ధ ౧౩ సోమవా
5. రాన బొంటు ప్రోల్రెడ్డి దన్నె
6. లిన రాజ.... ద్రిథిలి రా
7. జ్యంబు రా॥ శ్రీమనంత(ప)
8. ద్మనాతునికి హావిబలిచోన
9. ల కిచ్చిన చేను పుట్టిరాజుల పుట్ట
10. స్వదత్తం పరదత్తం వా మో
11. హరేతి వసుంధరా షష్టింవషఁ సహ
12. స్రాణి విష్టాయాం జాయతే క్రిమిః

## దొండపాడు శిలాశాసనము

### శాసనము-మూలము

1. ఓం శ్రీ చెంన మల్నాథ దేవాయనమః।
2. స్వస్తిశ్రీ శకవరుషంబు ౧౨౩౩ గునేంటి వి
3. రోధి కృతు సంవత్సర కాత్తిఁక శు౧ గు॥వారాన
4. స్వస్తిశ్రీ మన్మహామండలేశ్వర కాకతియ్య
5. ప్రతాపరుద్రదేవ మహారాజులు ప్రిధ్వీరాజ్య
6. ము సేయుచుండగా బొమిరాజు ఎఱ్ఱయప్రెగడ
7. వారి నాయంకరమందు నాగిరెడ్డి బొల్లయరడ్డివా
8. రి అధికారాన దొండపాటి శ్రీ చెన్నమల్నాతదేవరకు
9. రంగభోగానకు అందుల వెల్మవేగురూను స
10. మస్త ప్రజాను ఆ దేవుని సంనిధిని ధారలువోసి ఇ
11. చ్చిన క్రమము దేవబ్రాహ్మణ ప్రిత్తులును వరిచేల గద్య
12. ముంగాక రాచపొలము ఊరిచతుస్సీమాను రేగడు
13. వెలుగడూ మసుకాను చాలు మడిన అంతవటు కూసు
14. ఖ౧ కిచింన ముం౨౧ లెఖను ఆచంద్రాకఁ స్థాయిగా



దొండపాడు శిలాశాసనము
శ.సం. 1233=క్రీ శ. 1311

15. ను ధారలు వోసితిమి ధమ్మఁవు ప్రతిపాలిం
16. చిన వారి పితాల్లు ఇపవై యొక్క కులము వా
17. మాను ఇశ్వర రూపులగుదురు ధమ్మఁవు వి
18. ప్రము దలంచినవారి పితాల్లు పాపానంలో
19. మ॥ స్వదత్తం పరదంత్వా మోహారేతి
20. సుంధరా షష్టిసఁవష సహస్రాణి వి
21. ష్టాయాం జాయతే క్రిమి౨.

# ప్రసుక్కులు

## శ్రీ గడియారం శేషఫణిశర్మ

ఎవరన్నారు
వసంతమంటే పచ్చదనమని?
వసంతమంటే,
కింశుక ప్రసూనాల కుసుంభరాగం!
వసంతమంటే,
పుడమితల్లి చెంగావిరంగు చీర సింగారించటం!! (1)

నీ అసహనానికి
ఫలితం చూడు!
ఉదయాద్రి సదృశంగా,
ఎదగాల్సిన అరుణతేజం,
అనూరువుగా పరిణమించింది!
ఇప్పటికైనా,
ఓర్పు వహించు!
పాపజాతి విషదంష్ట్రలనుండి,
ఈ దిక్కులేని పక్షులను రక్షించే,
తిరుగులేని గరుడోదయం కోసం నిరీక్షించు!! (2)

జీవితంలో అనుక్షణం,
బలివితర్దులపై తల వంచుతూ
పాతాళానికి దిగజారిపోతున్న
బలిచక్రవర్తి వాడు!
వాడే రేపు తిరగబడితే,
ఏమవుతయ్ నీ స్వర్గాలు?
నీ తీయని స్వప్నాలు?? (3)

బిగిసిన పిడికిళ్ళతో,
తిరుగబడి,
గర్భ నరకంనుండి బయటపడ్డ శిశువు.
అవే పిడికిళ్ళు బిగించి,
మరొకసారి తిరుగబడితే
ఖండపరశువు!! (4)

ఉన్నవాడి ఉన్నతి,
ధనమూలం!
లేనివాడి దుర్గతి,
ఋణమూలం!
అందుకే,
ఈ సమాజం ఒక వర్గసమీకరణ మనటం
సత్యం!
దీని రేఖ వక్రించటం తథ్యం!! (5)

వృత్తంలో,
కేంద్రంవద్ద,
నాలుగే లంబకోణాలు!
రాజకీయ వృత్తంలోనో,
ఎన్నెన్నో కుంభకోణాలు!! (6)

ఏవడో కోకిల గొంతు నొక్కితే,
వసంతం ఆగిపోతుందా?
వసంతమంటే కోకిల మాత్రమే కాదు!
ఉర్వి సర్వమూ విస్తరించే
అరుణారుణ చైతన్యం!! (7)

రానున్న ఎన్నికల్లో,
డిపాజిట్టు పెంచవచ్చు!
ఔను మరి,
"మనీబ్యాక్ పాలసీకి"
ప్రీమియం కొంత హెచ్చు (8)

పాలిస్తున్న
పశువులకు,
పచ్చిగడ్డి పెట్టండి!
అడ్డమైన గడ్డి తినే
అలవాట్లు మాన్పించండి!
పొగరుబోతు పశువులకు
ముకుత్రాడు గుచ్చండి!
రైతులారా శ్వేత విప్లవంతో
రామరాజ్యం సాధించండి!! (9)

శ్రీ కాళహరి హనుమంతరావు

# కొన్ని శబ్దార్థాలు

పరిశీలించినకొద్దీ శబ్దార్థాలలో విశేషాలు కనిపిస్తూ ఉంటాయి. నేను పరిశీలించిన కొన్ని శబ్ద విశేషాలూ సాధారణంగా నిఘంటువులలో కనిపించేకన్నా విశేషార్థాలు వివరిస్తాను.

**అధీన :**

ఆప్టే నిఘంటుకారుడు ఇది ప్రాయికంగా సమాసగతమై ఉంటుందన్నాడు. ప్రయోగాలు కూడా చాలావరకూ భవదధీన, దైవాధీన ఇట్లా సమాసగతంగానే కనిపిస్తాయి. కనుక ఈ శబ్దం వ్యస్తంగా ప్రయోగించవచ్చునా అని సందేహం కలుగుతుంది కాని అమరకోశంలో "అధీనో నిఘ్న ఆయత్తః" అని ఈ శబ్దం విడిగా నిర్దిష్టమై ఉంది. అమరకోశం శబ్దస్వరూపాన్నీ తదర్థాన్నీ కూడా సూచిస్తుంది. కనుక అధీనశబ్దం విడిగా ప్రయోగించవచ్చునని తోస్తుంది. "ప్రత్యయోఽధీన శపథజ్ఞాన విశ్వాసహేతుషు" అని అమరకోశకారుడు ప్రత్యయ శబ్దార్థ ప్రతిపాదక వాక్యంలో కూడా అధీన శబ్దాన్ని వ్యస్తంగా ప్రయోగించాడు. వ్యస్తమైన అధీన శబ్దంనుండి ఏర్పడిన అధీనతా, అధీనత్వమ్ అన్న మాటలని మోనియర్ విలియమ్స్ తన నిఘంటువులో సూచించాడు. పరాధీన శబ్దానికి "పరస్య పరేషాంవా అధీనః" అనీ, స్వాధీన శబ్దానికి "స్వస్య అధీనః" అనీ శబ్దకల్పద్రుమ సంస్కృత నిఘంటుకర్త వ్యుత్పత్తులు సూచిస్తూ ఈ పదాన్ని విడిగా ప్రయోగించాడు. "త్వయ్యధీనం సుఖం జ్ఞాత్వా" అని రామాయణం (గీతా ప్రెస్, యుద్ధ, 64, 34)లోనూ, "తవాధీనం కృత్వా మయి నిరపరాధే కురు దయామ్" అని శివానందలహరి (22)లోనూ అధీనశబ్దం వ్యస్తంగా ప్రయుక్తమై ఉంది. తెనుగు కావ్యాలలో ఈ పదానికి విడిగా ప్రయోగానికి ఉదాహరణం— "నీ యధీనములుగా నిఖిల కృత్యంబులు" (ఆం. మహా. భాగ. 7, 367)

**అన్తః :**

దీనికి నిఘంటువులు ప్రాయికంగా దగ్గర, చివర, చక్కనైన అన్న అర్థాలు చూపుతారు. కాని ఇంకా ఈ అర్థాలు కూడా కనిపిస్తాయి. **1.** భాగము "అయమన్త శబ్దోఽస్త్యేవా వయవవాచీ. తద్యథా వస్త్రాన్తః, వసనాన్తః ఇతి, వస్త్రైవ యవో వసనావయవ ఇతి గమ్యతే" అని మహాభాష్యం (1.2.10). **2.** ప్రదేశము, ప్రాంతము. "విశాల పులినాంత నితంబబింబాః" (ఋతుసం. 3, 3). "పునరపి విపినాన్తే ప్రాచరః" (నారాయణీయమ్, 58, 6). "తృణ మమల వనాన్తే చారు సంచారయన్గాః" (డిటో, 10). **3.** లోపల. "విధ్వస్త మీనమకరాద్ యమునా వనాంతాద్." బాలచరితమ్, 4, 8)

**అభిచారః :**

"హింసా కర్మాభిచారఃస్యాత్" అని అమరకోశం. కాని ఈ శబ్దం శోభన కర్మలని కూడా ప్రతిపాదిస్తుంది. 1. ప్రవర్తనము. "ప్రమాణదృష్ట ధర్మేణ కథమస్మాన విగర్హసే అగస్త్యస్యాభి చారేణ యుష్మాకం విహితో వధః" (మహాభారతం, గీతా ప్రెస్, ఆది, 117, 15) (అగస్త్యుడు ప్రవర్తించినట్లే మేము కూడా ప్రవర్తించి మృగవధ చేశాము. మమ్మెందుకు నిందిస్తావు?) 2. ప్రయోగం, విధి. "ఉపచారాభిచారాభ్యాం ధర్మమాహారయస్వవై." (డిటో. 121, 20) ఉపచారః = పూజ. అభిచారః = ప్రయోగం, విధానం. (పూజవలనా సత్కర్మలవలనా ధర్మం నిర్వర్తించు).

**అర్థః :**

దీనికి భాగం, సగం అని అర్థాలు. అమరకోశ నిర్దేశం ప్రకారం సమాంశార్థం చెప్పినప్పుడు ఈ శబ్దం నపుంసకలింగం కనుక అర్ధమ్ అనాలి. "అర్ధం నపుంసకమ్" అన్న కౌముదీ సూత్రం (713) కూడా ఈ అభిప్రాయాన్నే సూచిస్తోంది. కాని మహాభాష్యంలో అదే సూత్రానికి (2.2.2) ప్రదీపోద్ద్యోత వ్యాఖ్యానకారులు సగము అన్న అర్థంలో అర్థశబ్దం పుంలింగంలో కూడా ఉండవచ్చునని చెప్పారు. నిఘంటుకారుల అభిప్రాయాలు అటూ ఇటూగా కూడా ఉన్నాయి. సమాంశార్థకమైన అర్థశబ్దానికి పుంలింగంలో ప్రయోగం— "మాతృభక్తిః పరస్త్రీషు పత్న్యా

మర్థ ఇవాత్మనః ప్రజాసు పితృవత్ స్నిగ్ధః కింకరో బ్రహ్మవాదినామ్." (భాగవతమ్, 4, 16, 17)

ఆర్యపుత్రః :

ఈ శబ్దం కేవల నాటక పారిభాషిక పదమనీ రాణీరాజుని సంబోధించడానికే ఉపయోగించాలనీ నియమం లేదు. స్వప్న వాసవదత్తలో (6) కంచుకిరాజునీ, రామాయణం (యుద్ధ, 23, 34)లో సేవకుడు రావణుడినీ ఆర్యపుత్ర అని సంబోధిస్తారు. "ఆర్యపుత్ర ఏవార్యపుత్రః" (ప్రతిమా నాటకం, 1) అని సంబోధన కాకుండా కూడా ఉపయుక్తమై ఉంది.

ఇహ :

ఈ శబ్దానికి ఇక్కడ, ఇప్పుడు అని దేశకాల వాచకార్థద్వయం నైఘంటికులు చెబుతారు. పాణినీయంలోని "ఇదమోహః, అధునా, దానీం చ" (5-3-11-17-18) అన్న సూత్రాలనుబట్టి ఇహ అన్నది ప్రదేశవాచి అనీ; అధునా, ఇదానీమ్ అన్నవి కాలవాచులనీ అతని అభిమతమని తోస్తుంది. గణరత్న మహోదధికారుడు "సద్యోఽధునా ద్వేహ" అని (1, 11) ఇహ శబ్దాన్ని కాలవాచిగా పేర్కొన్నాడు. ఇహ శబ్దానికి ఇప్పుడు అన్న అర్థానికి ఈ ప్రయోగాలు చూపవచ్చును. "శ్రమ మిహాతప నిష్ఫలం చ కృత్వా" (అభిషేక నాటకం, 6, 24). "అస్యవర్షస్య శేషంచేద్ వ్యతీయురిహ పాండవాః" (మహాభారతం, గీతా, విరా, 26, 4). "నాహం శక్ష్యామి వీరేహ నియంతుం తే హయోత్తమాన్" (డిటో, 61, 4). "భూతపూర్వశ్చ మే మృత్యుః సతతం పూర్వదైహికః యుద్ధాకాంక్షీ దశ యథాతిష్ఠ తీహ మ మాగ్రతః" (హరివంశం, విష్ణుపర్వం. 22, 33). "వరం లబ్ధ్వా దృప్తో జగదిహ భవన్నాయక మిదమ్." (నారాయణీయం; 24, 2).

ఖేదః :

= కామము. "ఖేదాత్ స్త్రీషు ప్రవృత్తిర్భవతి" (మహాభాష్యమ్, అథ శబ్దానుశాసనమ్.) ఖేదః = రాగః, ఇంద్రియ నియమా సామర్థ్యంవా ఖేదః" ప్రదీపవ్యాఖ్య.

ప్రధాన :

అమరకోశకారుడు నామవాచకమైన దీనిని ప్రధానమ్ అని నిత్య నపుంసకలింగంగా పేర్కొన్నాడు. కాని ప్రధానః అని పుంలింగంలో ప్రయోగాలు ఉన్నాయి. "అప్రధానః ప్రధానః స్యాత్ సేవతే యది పార్థివం ప్రధానోఽప్య ప్రధానః స్యాద్యది సేవా వివర్జితః" (పంచతంత్రం, మి. భే. 35). "హింస్రాః సుబాహు మారీచ మిశ్రాః" (అనర్ఘ రాఘవమ్, 2, 55), దీనికి వ్యాఖ్యానం - "సుబాహు మారీచాభ్యాం మిశ్రా మిలితాః, యద్వా మిశ్రాః ప్రధానాః తథా చ సుబాహు మారీచ ప్రధానా ఇత్యర్థః" "రూపానురూప చరిత సుకృత ప్రధానః" (భాగవతచంపూః, వెల్లాల చిదంబరశాస్త్రీ). దీనికి బెల్లంకొండ రామారాయకవి ఇట్లా వ్యాఖ్యానించారు - "మహామాత్రః ప్రధానః స్యాదితి గోపాలిత కోశాత్ ప్రధాన శబ్దః పుంలింగోఽప్యస్తీతి బోధ్యమ్."

మారిషః ;

దీని ప్రయోగం కేవలం నాటకాలకే పరిమితం కాదు. దీని అర్థం మాన్యుడు అని. దుర్యోధనుడు తండ్రిని (మహాభారతం, గీతా, ఉద్యోగ, 58, 18), భీష్ముడు దుర్యోధనుడిని (డిటో, 166, 5), భార్య భర్తనీ (జైమినీ యాశ్వమేధం, 17, 86) మారిష అని సంబోధిస్తారు.

మిథునమ్ :

= 1. ఇద్దరు 2. రెండు. "నవసోదర్యా అంగజా అభూవన్ మిథునం చ యవీయస్యాం భార్యాయామ్."(భాగవతం, 5, 9, 1) = అతనికి మొదటి భార్యకి తొమ్మండుగురు కొడుకులు, రెండవ భార్యకి కవలలు కలిగిరి. "నలస్యదయితానశ్వాన్ యోజయిత్వా మనోజవాన్ ఇదమారోప్య మిథునం కుండినం యాతుమర్హసి. సుమజ్ఞాతిషు నిక్షిప్య దారకౌస్యందనం తథా అశ్వాంశ్చేమాన్ యథా కామం వస వాన్యత్ర గచ్ఛవా." (మహాభారతం, గీతా, వన, 60, 19, 20). ఇక్కడ మిథునము అని భ్రాతృస్వసలు చెప్పబడ్డారు. "సర్వే చ మిథునం దదుః" (డిటో, 57, 38). ఇక్కడ మిథునమునగా రెండు పదాలు.

వధః :

తాడనము. "కీచకేన పదావధమ్." (డిటో, శాంతి, 17, 21), "శూద్రస్తు వధ మర్హతి". (మనుస్మృతిః, 8, 267). "తాడనాదిరూపం వధ మర్హతి" వ్యాఖ్యానము.

నిరాగః :

= 1. విశేషరాగము. "ఉత్తరీయ పటవిరాగతయాఽధిక లక్షణీయః కశ్చిత్." (చాటుద త్తమ్, 2). 2. వివిధ రాగము. "నిరాగ వసనాః సర్వేస్రగ్విణో మృష్టకుండలాః" (మహాభారతం, గీతా, సభా, 21, 27.) (డిటో, కర్ణ 12, 16), "విరాగ వస్త్రాభరణాః ప్రహృష్టాః" (హరివంశం, వి.ప. 89, 41)

వివక్షా :

ఇది వచ్‌ధాతువుకు సన్నంత రూపం. దీనికి చెప్ప బూనుట, చెప్పదలచుట అని అర్థాలు. వివక్షుః అనగా చెప్ప బూనిన లేక తలచినవాడు. ఈ అర్థాలు సాధారణంగా నిఘంటువు లలో కనిపిస్తాయి. కాని ఈ అర్థాలనుండి ఈ శబ్దం కొంతగా జరిగి ప్రత్యేకించి చెప్పడం, ప్రాధాన్యం అన్న అర్థంలో కూడా ప్రయుక్తమైంది. "అస్తిధ్వనిః, సచాసావ వివక్షిత వాచ్యో వివక్షితాన్య పరవాచ్యశ్చేతి ద్వివిధః సామాన్యేన." (ధ్వన్యాలోకః ప్రథమోద్యోతః). "అవివక్షితోఽ ప్రధానీకృతః" అని లోచన వ్యాఖ్య. ఆప్టే నిఘంటుకర్త వివక్షిత శబ్దానికి ఫేవరైట్ అని అర్థం ఇచ్చాడు. విచక్షణ అన్న అర్థంలో కూడా వివక్షా శబ్దం ప్రస్తుతం తరచుగా ప్రయుక్తమవుతున్నది. "వర్ణవివక్ష లేకయే ప్రతివానికిని యజ్ఞాధికారము కలదని తేల్చినాడు" (ప్రాచీన భారతవర్షమునందు శూద్రులకు గల యధికారము. వేలూరి శివరామశాస్త్రి, వ్యాసవాణి.), "నతేషు అల్పత్వ మహత్త్వ స్త్రీత్వ పురుషత్వాది వివక్షా, నాపి మనుష్యత్వ పశుత్వాది విచారః" (విశ్వగుణాదర్శ చంపూః, చౌఖాంబా, శ్లోకం 21, వ్యాఖ్య). సందేహము అన్న అర్థంలో కూడా ఈ శబ్దం ప్రయుక్తమైంది. "నచత్వాం ప్రోత్సహే వక్తుమిష్టా నిష్ట వివక్షయా." (మహాభారతమ్, గీతా, ఆది, 123, 7)

శ్రాద్ధమ్ :

ఇది కేవలం పితృకార్యం కాదు. నామకరణాద్యుత్సవా లలో బ్రాహ్మణులకి భోజనం పెట్టడం మొదలైన పుణ్యకార్యం ఇది. (విష్ణుపురాణం, 3-10, 4; 13,1, 14,6)

సకాశ, సమీప, అంతిక :

ఈ మూడు మాటలూ దగ్గర అన్న అర్థంలో ఉంటాయి. దగ్గర అన్న మాటకి దాపు అనేకాక షష్ఠీ సప్తమీ పంచమీ విభక్త్యర్థాలు కూడా ఉంటాయి. ఇంటిదగ్గర చెట్టు ఉంది, వాని దగ్గర డబ్బు ఉంది, వాని దగ్గర డబ్బు అప్పు చేశాను అన్నవి క్రమంగా ఉదాహరణలు. అట్లాగే సంస్కృత శబ్దాలు కూడా ప్రయుక్తములయి ఉన్నాయి. "ఉత్తరాయా వైతాలిక్యా స్సకాశే వీణాం శిక్షితుం నారదీయాం గతా ఆసీత్." (ప్రతిజ్ఞా యౌగంధ రాయణం, 2). "సహైవ మహ్యజనయన్నా సత్యయోరన్తికాత్." (చంపూభారతమ్, 1, 61) అన్తికాత్ సమీపాత్ తత్వాంగత్వాది తియావత్" (రామ కవీంద్ర వ్యాఖ్య).

స్నాతః :

= నిష్ణాతః. "మన్యేత్వాం విషయే వాచాం స్నాత మన్యత్ర ఛాందసాత్." (భాగవతమ్, 1, 4, 13) ఇంకా (డిటో 1, 5, 7; మహాభారతమ్, గీతా, ద్రోణ, 194,12).

స్వస్తిః :

స్వస్తి అన్నది అవ్యయమే కాక నామవాచకం కూడా. "భగవన్ భవతో యాత్రా స్వస్తయే సర్వదేహినామ్." (భాగవతం, 11, 2, 4) ఇంకా (8, 24, 22). "సమస్త నిగమస్తుతో నృహరిరస్తునః స్వస్తయే" (సుభాషితరత్న భాండాగారమ్, 1, దశా. 49)

కొన్ని సంస్కృత పదాలు ప్రాచీనాంధ్ర కావ్యాలలో ప్రయుక్తములై ఉన్నాయి. కాని ఇప్పటి సుప్రసిద్ధ సంస్కృత నిఘంటువులలో (అమరకోశం, వైజయంతీకోశం, ఆప్టే నిఘంటువు, మోనియర్ విలియమ్స్ నిఘంటువు, శబ్దకల్ప ద్రుమం, వాచస్పత్యం) అవి కనిపించడంలేదు. వాటిలో కొన్ని టికి ప్రాచీన సంస్కృత గ్రంథాలలో, ప్రధానంగా దాక్షిణాత్య సంస్కృత వాఙ్మయంలో ప్రయోగాలు ఉన్నాయి. కొన్నిటికి ప్రయోగాలు మృగ్యాలు. బహుశః పూర్వం దక్షిణ భారతంలో ఒక సంస్కృత నిఘంటువు సుప్రసిద్ధంగా ఉండేదనీ ఈ మాటలు దానిలో ఉండేవనీ తోస్తుంది. క్రింద అటువంటి కొన్ని శబ్దాలు, ఆంధ్ర కావ్యప్రయోగాలు, దొరికినంతవరకు సంస్కృత వాఙ్మయ ప్రయోగాలూ ఇస్తున్నాను. అజవంజవః = సంసారం. "శ్రీ విద్యుత్కలితా జవంజవ మహా జీమూత." (కాళ, శత, ధూర్జటి, 1). సర్వశబ్ద సంబోధినీ సంస్కృతాంధ్ర నిఘంటువులో ఇది పుంలింగ శబ్దంగా ఇవ్వబడింది. సంస్కృత గ్రంథ ప్రయోగం అన్వేష్టవ్యం.

కలశాబ్ధిః :

= క్షీర సముద్రం. "కలశపాథో రాశిగర్భ వీచిమతల్లి" (మనుచరిత్రము, 1, 18). "కలశ మకరాకర పరిశోభమానే" (పూర్వభారత చంపూః, మానవేదః, వ్యాఖ్యా-కృష్ణః. కేరళ యూనివర్శిటీ, త్రివేండ్రమ్ సాంస్క్రిట్ సీరిస్ నెం. 209) 10, 21, 22. కలశ మకరాకరః = క్షీరాబ్ధిః; వ్యాఖ్యా. కలాచికా = తమ్మపడిగము. "రత్న పాదుకా కలాచికా ముకుర పీఠికా కరండ ముఖ్య రాజలాంఛనా" (మను, 1, 83) "తాంబూల కరండ కలాచి కాద్యుపచారః" (నీలకంఠ విజయః, 2); ఇంకా (ఆనందసాగర స్తవః, 82.)

కూచిమారః :

పురుష (విట) జాతులలో ఒకడు. విటులు నాలుగు విధాలు- భద్రుడు, దత్తుడు, కూచిమారుడు, పాంచాలుడు. (కాళహస్తి మాహాత్మ్యము, 4, 15). భద్రుడు శృంగార చేష్టలవలన, దత్తుడు ధనంచేత, పాంచాలుడు మృదువాక్కౌశలము వలన, కూచిమారుడు మందులు మాయలుచేత వేశ్యలను వశపరచు కొంటారు. (మానవల్లి కవి రచనలు, ఉపోద్ఘాతం నిడుదవోలు వెంకటరావు, పేజీ 75) "బాలా మనః పాంచాలుండు" (శృ. నై. 1, 10). తథాచ పద్మినీ పాంచాలాదీనాం స్వస్వవిహితయామ ప్రతీక్షణం (ఉత్తర రామ. 1. 27. వాధూల వీరరాఘవాచార్య వ్యాఖ్య)

గమకి(న్)? :

గమకి అనగా మంచి శయ్యలో గమకముగా పద్యము చదువువాడు. "కవి గమకి వాగ్మిగాయక నట చింతామణి." (కుమా. సం. నన్నిచోడ. 3, 112). కన్నడంలో కూడా ఈ పదం ప్రయుక్తమై ఉంది. తెలుగు కన్నడములు రెండింటిలోనూ "కవి, గమకి వాగ్మి" అన్న సమాహారమునందే కానవస్తున్నది. (నే. వెం. రమణయ్య వ్యాఖ్య). (ఇంకా హర. విలా. 1, 7). గమకము కలవాడు అన్న వ్యుత్పత్తినిబట్టి ఈ శబ్దం నకారాంతం కావచ్చును. సంస్కృత గ్రంథాలలో ప్రయోగం మృగ్యం.

చతురంత యానమ్ = పల్లకి. "రాజుల్ మత్తులు.... వారిచ్చు నంభోజాక్షీ చతురంతయాన...." (కాళ.శతకం.ధూర్జటి) "చతురంతయాన గత ఇవ భగవా నంబికా రమణశ్చతురతర మస్మాభిర్వాహనీయః". (నీలకంఠ విజయః, 3).

ధారుణీ :

= భూమి. "నిజభుజాశ్రిత ధారుణీ వజ్రకపచంబు" (మనుచరిత్రము, 1, 26) (ఇంకా. ఆంధ్రమహాభారతము. ఆది, 7, 129; సభా, 2, 249). తెలుగులో చాలా తరచుగా ప్రయుక్తమైన ఈ పదం సంస్కృత సాహిత్యంలో మృగ్యం.

పుట :

= పేజీ (ఆంధ్ర వ్యవహారం). రూపావతారః, ద్వితీయ భాగః, రంగాచార్య ప్రణీతః. ఈ సంస్కృత గ్రంథంలో పుట శబ్దం పేజీ అన్న అర్థంలో అంతటా ఉపయుక్తమైంది.

మత్తల్లి :

= నృత్య విశేషం. (ఆముక్తమాల్యద 3, 92; కాశీ ఖండము 5, 83).

"తల సంచర పాదాభ్యాం ఘూర్ణమానోప సర్పణైః
సమోత్సారిత మత్తల్లీ వ్యాయామే సముదాహృతా.
ఉభాభ్యామపి పాదాభ్యాం ఘూర్ణమానోపసర్పణైః
ఉద్వేష్టితాప విద్ధైశ్చ హస్తైర్మ తల్ల్యుదాహృతా"

(నాట్యశాస్త్రమ్, 10, 27, 28)

రింఛోళీ :

= సమూహము. "మణిమరీచి రింఛోళి". (మను చరిత్రము, 1, 12). "త్రిజగతాం కర్ణేసుధా ధోరణీ వాణీ".(పూర్వ భారత చం పూః, 8, 22) "ధోరణీ రింఛోళీ శబ్దౌ సమూహార్థౌ." (వ్యాఖ్య)

రేవంతః :

= 1. అశ్వారోహకుడు, అశ్వశిక్షకుడు. "బహు విధా రోహ కళారేవం తునక...." (మనుచరిత్రము, 1, 43). "అథాతః సంప్రవక్ష్యా మిహయారోహణ ముత్తమం యేన విజ్ఞాత మాత్రేణ రేవంతః ప్రియతాం వ్రజేత్." (మహా సుభాషిత సంగ్రహః, లుడ్విక్ స్టెర్న్బాక్, I, 785. 2. అశ్వరూపులైన సూర్యసంజ్ఞల కొడుకు. (విష్ణుపురాణమ్, 3, 2, 7)

శుంఠః :

= మూఢుడు. "పూర్ణ శుంఠలు సభాపూజ్యులైరి". నారసింహ శతకము, 26. "పండితపుత్రః శుంఠః (ఆంధ్ర దేశీయ లోకోక్తి.)

శుద్ధః = శుక్ల పక్షం. (ఆంధ్రదేశీయ వ్యవహారం.)

సంకుమదః

ఒక పరిమళ ద్రవ్యం. "బహు సంకుమదపంక పాణింధ మంబైన." (పాండురంగమా. 3, 10); (భర్తృ, శృంగా, ఏనుగు లక్ష్మణకవి, 9) సంస్కృత వాఙ్మయ ప్రయోగం వెతకాలి.

హల్లోహల :

"హల్లో హల మదబంభర" (మనుచరిత్రము 2, 6). "గంగా హల్లోహల వాగ్విలాస" (పాండు. మా. 4,309) = 1. వేగము. "ఉల్లోల జలధి కల్లోల హల్లోహల శమనశీలయా" (నీల. విజ. 1) = 2. కోలాహలము. "ఉల్లోల తర మాలినీ కల్లోల హల్లోహలా మ్రేడితాధ్యయన ఘోషః" (పూర్వభారత చంపూః, 4) ("హల్లోహలః = కోలాహలః"; వ్యాఖ్య).

# పులి

మూలం :
**ఎస్. రాజరత్నం**

అనువాదం :
**కె. సుబ్రహ్మణ్యం**

సాయం సమయం. నీరెండలో నీళ్లు సువర్ణకాంతులీనుతూ తళతళల్లాడుతున్నాయ్. నది ఒడ్డుమీంచి కొంచెం దూరం నడిచి మొలబంటిలోతున్న నీళ్ళలోకి దిగింది ఫాతిమా. చల్లగా, ఆహ్లాదంగా వుందనిపించింది ఆమెకు.

ఫాతిమా మలే యువతి. చంద్రబింబంలాంటి ముఖం, ఎత్తైన దవడలు, తెల్లని పలువరుసలతో గోధుమ ఛాయలో బొద్దుగా వుంటుంది. బరువైన పాలిండ్లు, ఎత్తైన పొత్తికడుపు ఆమె నిండు చూలాలు అని సూచిస్తున్నాయ్. ఆమె ధ్యాసంతా తనలో రూపుదిద్దుకుంటున్న తన చిన్నారి కదలికలమీదే లీనమయినట్టు వింటిలా ఒంపుతిరిగిన ఆమె కళ్ళు చెబుతున్నాయి.

ఫాతిమా కొప్పు విదిల్చి కేశపాశాన్ని జారవిడిచింది. ఆమె నిగనిగలాడే నల్లని కురులు పిల్లగాలిలో అల్లనల్లన నడయాడుతున్నాయి. నది కావలిఒడ్డున లలాంగ్ గడ్డి ఏపుగా పెరిగిపోయి పల్లె మరుగయింది. ఎత్తైన చెట్లు, దట్టంగా అల్లుకున్న అడవి మొక్కలు, అనతిదూరంలో చిట్టడవితో ఆమె ఏకాంతంగానే వుండిపోయింది. అక్కడక్కడా నీటిబాతుల కూతలు, వాటి రెక్కల చప్పుళ్ళు, పరుగు పెట్టే చిన్న జంతువుల ధ్వనులూ వినవస్తున్నాయి. నిర్జన వాతావరణం కలయజూస్తోన్న ఫాతిమాకు దడ పుట్టుకొచ్చింది.

అదే సమయానికి చిట్టడవివైపునుండి గాండ్రింపు మంద్ర స్థాయిలో వినిపించింది ఆమెకు. క్షణం - భ్రమపడ్డానా? అనుకుంది. క్రమేణ గాండ్రింపులు హెచ్చుతున్నకొద్దీ ఆమె గుండెల్లో సన్నని వణుకు పుట్టింది. బెదిరిన తన చూపులు గడ్డి పైరులో సుమారు ఇరవై గజాల దూరంలోనే ముంగాళ్లమీద కూచున్న ఓ భారీ ఆకారంగల పులిమీద పడ్డాయ్! ఏటవాలుగా పడుతోన్న సూర్యకాంతిలో ఆ మృగం కళ్ళు అగ్నిగోళాల్లా వున్నాయి. పులి చెవులు రిక్కించింది. నదివైపుగా తల తిప్పింది. గహ్వరం వంటి నోరు తెరిచి పెద్దగా గాండ్రించింది. దాని నాలిక రక్త వర్ణంలో, పసుపువర్ణం కోరలు చెట్టు దుంగల్లా అగుపడ్డాయ్ ఫాతిమాకు. భీతావహమైన పరిస్థితిలో చిక్కుకొని ఆమె చేష్టలు దక్కి నిల్చున్న చోట్లోంచి కదల్లేకపోయింది. ఆమె మనస్సు మొద్దువారిపోయింది.

ఫాతిమా ఉనికి పసికట్టిన పులి కళ్ళు ఆమెవైపునే తీక్షణంగా చూస్తున్నాయి. ఆమె భీతహరిణేక్షణలా బెబ్బులివైపు బెదురు చూపులు నిగుడిస్తోంది. పులి తరుచు గాండ్రిస్తోనే వుంది. దాని బారినుండి తప్పించుకోవాలన్న జిజ్ఞాస కోల్పోయింది ఫాతిమా.

అలా ఆమె నిల్చుండిపోయి ఎంతసేపయిందో! పులి గాండ్రింపులు ఒక్కమాటు ఆగిపోయినయ్. అది తన పంజాలని ముందుకు చాపి చతికిలబడి ఫాతిమావంక చూస్తోంది. ఇప్పుడు దాని చూపులో క్రూరత్వం లేనట్టు ఆమెకు తోచింది.

ప్రొద్దువాలుతోంది.... గడ్డి పైరులోని పులి ఆకారం అలుక్కుపోయి అక్కడో నల్లనికొండలా కన్పట్టుతోంది. నది మీదుగా పొగమంచు పరుచుకుంటోంది. రేయి ఆగమనాన్ని సూచిస్తూ ఎక్కడ్నుంచో ఓ గుడ్లగూబ కకావికాలుగా అరిచింది.

ఉన్న చోట్లోంచి పులి కదలిక లేదు. ఫాతిమాకు అలుపుగా వుంది. నిలువెల్లా వణకిపోతూ తన పొత్తికడుపుమీద అరచేతితో సుతారంగా తడిమి చూసుకుంది. తన తెలివిమాలిన చర్యవల్ల తనకు పుట్టబోయే బిడ్డ పులివాత పడకూడదు.... ఆలశ్యం చేస్తే పరిస్థితి విషమిస్తుందని, అక్కడ్నించి వెంటనే పారిపోవాలని నిశ్చయించుకుంది, గుండె దిటవు చేసుకుంటూ.

ఫాతిమా నీట్లోకి గభాల్న దూకి పులి కంటబడకుండా లోతులోకి మునిగి అవలి గట్టువైపుగా ఈదటం ఆరంభించింది. ఊపిరి బిగపట్టటం కష్టమయిపోతోంది.... ఊపిరితిత్తులు వాయు స్తంభనవల్ల బద్దలైపోయినట్టే అనిపించింది. తన జీవితంలో ఇలాంటి విపత్కర సంఘటనను మొదటిసారి ఎదుర్కొంటోంది! ....చివరికి అవలి గట్టు చేరుకుంది.... ఆమె అడుగులు ముందుకు చురుగ్గా పడుతున్నాయి. కొద్దిసేపట్లో పల్లె చేరుకోగలనన్న సంతోషం ఆమెను ముప్పిరిగొన్నది.

ఇల్లు చేరుతూనే తను పెద్ద గండంనుండి ఎలా తప్పించుకు వచ్చేసిందో వివరంగా తన తల్లితో చెప్పుకుంది ఫాతిమా. తన కూతురు ధైర్యానికి ముక్కుమీద వేలేసుకుంది వృద్ధురాలు. అక్కడితో ఆగక ఇరుగు పొరుగువాళ్ళతో జరిగిన సంఘటనని విన్నట్లు చెప్పక, చిలవలు పలవలుచేసి చెప్పటం ప్రారంభించింది. హడలిపోయిన కొందరు స్త్రీలు తమ పిల్లల్ని ఇళ్ళల్లోకి లాగి వీధి తలుపులు వేసేసుకున్నారు. కొందరు గుమ్మాలు దాటకుండా మగవాళ్ళకు పన్లు పురమాయిస్తూ హడావుడి పడిపోయారు. బయట పశువుల్ని కొట్టాలలోకి తోలుకెళ్ళేవారు తొందరపడుతూంటే, ముసలివాళ్ళు తాపీగా పొగాకు నవుల్తూ ఆ గందరగోళానికి కారణమేమిటా అని అడుగుతున్నారు. పులి అగుపడిన వార్త పల్లె అంతా పాకిపోయింది.

త్వరలో గ్రామపెద్ద కొందరు పెద్దమనుషులు వెంటరాగా ఫాతిమా ఇంటికి వెళ్ళాడు. ఫాతిమాను పిలిపించి పులి పల్లె దరిదాపుల్లోకి ఎందుకు వచ్చిందో, అది కనిపించినచోటు ఆరా తీయటం మొదలెట్టాడు. ఫాతిమా జరిగింది ఉన్నట్లుగానే చెప్పింది. మధ్యలో ఫాతిమా తల్లి ఏదో చెప్పబోతుంటే గ్రామపెద్ద గద్దిస్తూ ఆవిడ నోరు మూయించాడు.

చిట్టడవిలోకి తగిన ఆయుదాలతో మనుషుల్ని అదేరాత్రి పులివేటలో పంపకపోతే పల్లీయులకు, పశువులకు రక్షణ లేదన్నాడు గ్రామపెద్ద. కానీ అక్కడ మూగిన జనాలుమటుకు నీరుకారిపోయినారు. అంత పెద్దపులిని ఎదుర్కోవటమా?....

ఫాతిమా అంతా వింటూ ఆయాసంగా చాపమీద మేను వాల్చింది. పులిని చంపించటం ఆమెకు సుతరామూ ఇష్టం లేదు. పులికి బుద్ధిపుడితే నిశ్శబ్దంగానే వచ్చిపడి చంపి తన దేహాన్ని అడవిలోకి లాక్కుపోయేది. అది ఎందుచేతనో తన జోలికి రాలేదు. అలాంటి జంతువు పల్లెలోకి వస్తుందన్న నమ్మకం తనకు లేదు. ఆ మాటే పైకి చెప్పింది కాని గ్రామపెద్ద ఆమెతో ఏకీభవించలేదు. ఆ పులిని పట్టి చంపివేయందే పల్లెకు రక్షణ వుండబోదు అని ఫాతిమా తల్లి గ్రామపెద్ద దగ్గర గొడవ చేసింది. తన కూతురు ప్రాణాలు దక్కినందుకు కృతజ్ఞతతో తన రెండు చేతులూ పైకెత్తిపట్టి అల్లాను ప్రార్థించింది.

లలాంగ్ గడ్డిపైర్లో అదీ రాత్రివేళ ఓ పెద్దపులిని వెంటాడి చంపటమంటే మాటలు కాదు! అంత సాహసం లేక ఇష్టంగా ముందుకెవ్వరూ రాలేకపోవటం గమనించిన గ్రామపెద్ద పెద్ద చిక్కులో ఇరుక్కున్నాడు. అతనికి ఎటూ పాలుపోలేదు....

పల్లెవాళ్ళ అదృష్టంకొద్దీ అంతలో మమూద్ అటుకేసి వచ్చాడు. అతడు ఓ భుజాన డబుల్ బ్యారల్ గన్ వేలాడదీసుకున్నాడు. ఆ చుట్టుపట్ల షికారుగా మంచి అనుభవమున్న వ్యక్తి అతడు.

"ఫాతిమాను పులి తరుముకొచ్చిందని ఆడవాళ్లు చెప్పుకుంటుండగా విన్నాను...నిజమేనా?" గ్రామపెద్దని అడిగాడు.

గ్రామపెద్దకు ప్రాణం లేచివచ్చినంతయింది. మమూద్‌కి పులి స్థావరం గుర్తులు చెప్పాడు. పల్లీయుల పిరికితనం గ్రహించి అక్కడున్నవాళ్ళల్లో ధైర్యస్థులెవరేనా వుంటే తనకు అండగా ముందుకు రావచ్చుననీ, లేకుంటే తనొక్కడే పులివేట సాగించటం జరుగుతుందనీ నొక్కి అడిగాడు. ఆ పలుకులు వింటంతోటే ఓ దజనుమంది ఉద్రేకంకొద్దీ అతనితో చేతులు కలిపి చిట్టడవికి వెళ్ళటానికి సంసిద్ధమైనారు.

* * *

"మమూద్ తనో పెద్దపులిలాంటివాడేనే! ఆ మృగాన్ని చంపాకే తిరిగివస్తాడు" అంది తల్లి ఫాతిమాతో.

ఇంట్లో ఓ కిటికీ నది దిక్కుగా వుంది. అక్కడే నిల్చుండిపోయి బయటికి చూస్తోంది ఫాతిమా. చిక్కని వెన్నెల కాస్తోంది. వెన్నెల్లో కొబ్బరిచెట్లు ఊగిసలాడుతున్నాయి. దూరాన మమూద్ జట్టు పెడుతున్న గావుకేకలు తగ్గుస్థాయిలో వినవస్తున్నాయి. నదీప్రవాహం మోత చెవులకింపుగా వుంది. పాపం! పులి ఆవలి ఒడ్డుకు అనతిదూరంలోనే చతికిలబడి తనమానాన పడుంది కాబోలు! ... ఈ జట్టుకు అది చిక్కకుండా పారిపోయేట్టు చూడు! - అని అల్లాను మనసారా స్మరించింది.

ఓ మూలగా కొయ్యపాత్రలో వక్కలేసుకుని ఓ చేత్తో ముక్కముక్కలుగా చితకకొడుతోంది ఫాతిమా తల్లి. ఆవిడ నోటికీ తీరుబడి లేనట్టు వాగుతూ వుంది—

"ఓ అల్లా!- ఈ రాత్రి మనకు చావుగండం తప్పదులా వుంది. పులికి వంద గుంటనక్కల జిత్తులన్నీ తెలిసివుంటాయ్. తెల్లారేలోపు ఎంతమందిని బలి తీసుకుంటుందో!...."

"పులిని మన జట్టు రెచ్చగొట్టకుంటే మరే ప్రమాదం లేదు" - కిటికీముందునుండి తల తిప్పకుండా నిరసనగా జవాబిచ్చింది ఫాతిమా.

"పిచ్చిగా వాగకు! అది క్రూరజంతువు." అరిచింది తల్లి.

"స్థావరం వదిలిపెట్టి ఎక్కడో వేటాడుతుంటుంది పులి."

"అలా అనుకోవద్దు. పల్లె దగ్గర్లోకి వచ్చిన ఏ పులీ చంపకుండా తిరిగి వెళ్ళదు. ఆ జంతువు స్వభావమే అంత!"— రెట్టించింది తల్లి.

"కాని - ఈ పులి అలాకాదు. పల్లెజోలికి రాదమ్మా!"

ఫాతిమావంకి కోపంగా చూసింది తల్లి.

"ఇరవై గజాల దూరంనుంచి పులి నాబోటి ప్రాణిమీదికి లంఘించి చిక్కించుకోవటం అంత కష్టం కాదు. అది నా మీద అనుమానంగా దృష్టివేసి నన్ను తరిమికొట్టిందంతే. నేను దాని కళ్ళ క్రౌర్యం చూళ్లేదు. నువ్వు అర్థం చేసుకోవాలమ్మా!"

"అదుగో! మీ నాన్న చాదస్తమే నీకు అబ్బింది...."

ఫాతిమా తల్లివంక చురచుర చూసింది.

"....అహా!- మీ నాన్నకు గాల్లోంచి పాటలు వినపడేవిట! కొండేలు చెప్పాలని కాదు. ఆయన ఆత్మశాంతికోసం భగవంతుడ్ని సదా ప్రార్థిస్తున్నాను."

ఫాతిమా ఇంకా బయటికి చూస్తోనే వుంది. పల్లె ప్రశాంతంగా వుంది. తన గుండెల్లోమటుకు దడ మొదలైంది. హఠాత్తుగా బాధగా విలవిల్లాడిపోతూ చేయివంచి తన పొత్తి కడుపును పట్టుకుంది.

"ఇంతల్లో ఏమయిందే?" - గాభరాగా అడిగింది తల్లి.

"ఏమీ కాలేదమ్మా!"-పళ్ళు బిగువుపట్టి అంది ఫాతిమా.

"ఈ గాలి నీకు మంచిది కాదు. ఇలా వచ్చి పడుకో."

ఫాతిమాకు నొప్పులు ఆరంభమైనాయి. చాపమీద అటు ఇటు తల తిప్పేస్తోంది బాధగా. ఆమె మనోవీధిలో పులి చూసిన చూపు మెదులుతోంది.

ఇంతలో— తుపాకి ప్రేలిన శబ్దం! ఏం జరిగిపోయిందో! ఫాతిమా పరిపరివిధాల ఆలోచిస్తూనే వుంది.

మరోతూరి తుపాకి పేల్చిన శబ్దం వినవచ్చింది. వెన్వెంట పులి గాండ్రింపులు!.... క్రమేణ బాధగా ఎదురుదెబ్బకు తట్టుకోలేక కొట్టుకుంటున్నట్లు మంద్రంగా గాండ్రింపులు!.... పులిని చంపారా?....

ఫాతిమా వంటినిండా చెమటలు పట్టేశాయి. ఆమె పెదాల నుంచి సన్నగా మూలుగు వెలువడింది.

"అయ్యో! తల్లీ! - ఏమిటే? ఊపిరాట్టంలేదా?" - వృద్ధురాలు తన కూతురి భుజంచుట్టూ ఆసరాగా చేయివేసి కూర్చోబెట్టుకుంది.

"నొప్పి-లమ్మా!"

"ఇలాంటి ఘడియకే కాన్పు రావాలా?!" అంది నిస్పృహగా తల్లి. క్షణం ఆగి—

"నీళ్ళు వెచ్చబెట్టి చిటికెలో తెస్తాను. ఆ పాడు పులికోసం వెళ్ళినవాళ్ళు తిరిగిరాందే ఈ అర్ధరాత్రివేళ మంత్రసానికి ఎలా కబురు పెట్టనూ? బయట కాలు మోపలేని ఉపద్రవమే వచ్చి పడింది తల్లీ!"....

బయట కలకలం అయింది. బయటినుంచి తట్టిన సవ్వడి.

"మనవాళ్ళు తిరిగొచ్చేస్తున్నారల్లే వుంది!— కాస్తంత ఓపికపట్టు!"

ఫాతిమా తల్లి వాకిలి తలుపు తెరిచింది.

"అత్తా! మన మమూద్ పులిని చంపేశాడు! దాని కళేబరాన్ని వెనక ఈడ్చుకొస్తున్నారు. ఎంత పెద్దపులి అనుకున్నావ్! తెగించి మీద పడిందట. మనవాళ్ళకేమీ గాయాలు కాలేదు. రెండుసార్లు తుపాకి దెబ్బతో, ఈటెతో పొడిస్తే చచ్చిందట. అసలు ఏమయిందో అక్కడ, చెబితే ఆశ్చర్యపోతావ్...." అన్నాడు ఆ వచ్చిన కుర్రవాడు.

"అలాగా!"

"పులిని చంపుతూనే ఏవో జంతువుల చప్పుళ్ళు విన్నారట. హరికేన్ లాంతర్లతో చుట్టుపట్ల గాలిస్తే కనిపించాయట ముచ్చటైన మూడు పులికూనలు! ఒకటే రొద చేస్తున్నాయిట. కళ్ళింకా తెరవని ఆ పిల్లకూనల్ని ఆ ఆడుపులి ఈని కొద్ది గంటలైనట్లు చెప్పాడు మమూద్. అంచేతనే తల్లిపులి దెబ్బ తిన్నాక శివమెత్తిపోయిందట. కూనల్ని తెచ్చాడు మమూద్. వాటికి మంచి ధర కిట్టుతుందట!"

నొప్పులు పడుతూనే ఓపిక చేసుకుని తల్లిని పిలిచింది ఫాతిమా. ఆ కబుర్లన్నీ ఓ చెంప వింటోనే వుంది. ఆమె మనస్సు వికలమైపోయింది.

ఫాతిమా స్థితి జ్ఞప్తికివచ్చి లోపలికి రాకుండా ఆ వచ్చిన కుర్రవాడి జబ్బ పుచ్చుకుని నెడుతూ పని పురమాయించింది—

"మంత్రసానిని వేగిరంగా రమ్మన్నానని చెప్పరా అబ్బాయ్!"

కుర్రవాడు లోపలికి తొంగిచూసి అంతా అర్థమయినట్టు తలూగించి హుషారుగా మంత్రసాని ఇంటికేసి పరుగు లంకించుకున్నాడు.

## ఇల్లాలు

రాత్రీ పగలూ కష్టమూ సుఖమూ, మంచీ చెడూ
స్త్రీ పురుషుడూ విడదీయడానికి వీల్లేని ద్వంద్వాలు
అర్థనారీశ్వర భావన అభిప్రపంచాన్నీ ఆశ్చర్యంలో ముంచే
భారతీయ సృజన"
ఉపన్యాసాల ఉద్రేకాల ఊకదంపుడు!
సభల్లో వున్న జనంలో నూటికి తొంభై మంది మగాళ్ళే.
షాపుల్లో, ఆఫీసుల్లో, సందుసందుల్లో కలయతిరిగినా
అధికశాతం పురుషులే!
కార్లో దిగిన కాస్ట్లీ స్త్రీ
మనుషులు చూసేంతలో మాయమవుతుంది.
మన సంస్కృతి మగ సంస్కృతిగా
అడుగడుక్కీ పొడగడుతుంది.
వీధిలో జనంలో
వాననీటి ప్రవాహానికి పక్కగా
మట్టిచార పోతున్నట్లు పల్చగా ఆడవాళ్ళు
సమాజాన్ని సమూలంగా మార్చే
ఉద్రేకాల అలల ఊరేగింపులో ఊసుకూడాలేని స్త్రీలు,
వినయం చాటున, విన్రమం చాటున
శీలం చాటున, చీకటి నీతుల నీడల్లో,
'ఇళ్ళ'ల్లో వున్నారు స్త్రీలు
స్త్రీ! ఆవిడ ఇల్లాలు
మనిషికి ఆలు కాదామె
ఇంటికి ఆలు
కనుకనే ఇల్లాలు!

## ఉదయం

ఉదయం ఎంత ఉదాత్తంగా వుంది!
ప్రభాతం ఎంత పరవశంగా వుంది!
ఉరుకులు పరుగులమీద వొచ్చే సూర్యుణ్ణి
ఆకాశమంతా వ్యాపించిన మేఘం ఆగమని చెప్పింది.
జలదరించే చెట్లలో గలగలమని పక్షులు,
కళ్ళు తెరవని లోకం కమ్మగా నిద్రపోతోంది.
నమ్మకంలాంటి మసకచీకటి సరిహద్దుల వెంబడి
సాయుధంగా పహారా కాస్తున్నట్లు నిశ్శబ్దం.
మైళ్ళకొద్దీ వ్యాపించిన అలలాంటి పిల్లగాలిని
ఆ కొసను ఈ కొసను
అదృశ్య వ్యక్తులు పట్టుకొన్నట్లు ఆహ్లాద చలనం.
రాత్రిమంచుకు అర్ద్రమైన ఆనందపు గుళికెల్లా మల్లెపూలు.
గుబురు గుబురుగా, నురుగు నురుగుగా ఉబుకుతూ
పొంగులు వారే
గడ్డ కట్టిన రంగుల జలపాతంలా బోగన్ విల్లాలు.
ఇళ్ళూ ఇళ్ళల్లో మనుషులూ, మనుషుల్తో మహా నగరాలూ, దేశాలూ
పరస్పర పరిష్వంగంలో పరవశిస్తున్నట్లు
తరంగాలుగా తన్మయం.
భూగోళాన్ని తాడుకుకట్టి బుడుంగున ముంచినట్లు
ముంచిన భూగోళాన్ని పైకి లాగుతున్నట్లు
చీకటికీ వెలుక్కీ మధ్య భూమి చిత్రంగా కదుల్తోంది!

## సమదృష్టి

"నేను బళ్ళకొద్దీ నవలలు రాస్తాననీ
ఉద్రేకాలతో జనాల్ని
ఉర్రూతలూగిస్తాననీ
ఖాళీలను పూరించడంలా
కవిత లేమిటనీ" – ఇతను నిక్కుతాడు
"కంటి మెరుపుల్లా
వంటి విరుపుల్లా
నరాల్ని కదిలించే
నాదాలు విసిరే కవితకు
నవలల్తో పోలికేమిటని" – నవ్వుతాడతను.
కాలం చెదలు మాత్రం
అక్షరాల అహంకారాన్ని అరగిస్తూ
సమదృష్టితో సాగిపోతుంది.

**సౌభాగ్య**

డాక్టర్ ఎం. బుద్ధన్న

# గాలిబ్ కవిత్వంలో జీవనరేఖలు

మొగలు సాహితీ స్వర్ణయుగం మొగం ముడవకముందే లోకానికందిన ఆఖరు కానుక 'మీర్జా అసదుల్లాఖాన్ గాలిబ్'. షా ఆలం కాలంలో తురుష్క దేశంనుంచి యోధునిగా వలస వచ్చిన 'అబ్దుల్లాఖాన్' గాలిబ్ జననానికి కారకుడై అస్తమించాడు. పినతండ్రి 'నస్రుల్లాఖాన్' పెంపకంలో గాలిబ్ కొంత కాలం పెరిగాడు. తండ్రి, పినతండ్రి - ఇరువురు గతించాక గాలిబ్, తాతగారైన 'గులాం హుసేన్‌ఖాన్' కంపిత హస్తాల నీడల్లో కొన్నాళ్ళు పెరిగాడు. షేక్ మొఅజ్జమ్, అబ్దుల్ సమద్‌లు, గాలిబ్‌కు గురువులని పేరే గాని, వాళ్ళదగ్గర నేర్చుకొన్నది అంతంతమాత్రమే. ఆతనికి జీవితమే అనేక పాఠాలు నేర్పింది. గాలిబ్ జీవితం ఒక గాయాల కహానీ. ఒక నిట్టూర్పుల నిహానీ.

క్షాత్రధర్మంలోనే అసువులు బాసిన తండ్రినుంచి గాలిబ్‌కు ఖడ్గం వారసత్వంగా లభించింది. ఖడ్గం పట్టాల్సిన గాలిబ్, కలం పట్టి కవనసమరం చేశాడు. కవనసమరంలో గెలుపొందిన గాలిబ్, జీవనసమరంలో అనుక్షణం ఓటమి చవిచూశాడు. ఈ చేదు జీవితాన్నంతా, స్వాదుకవిత్వంగా మార్చగలిగాడంటే గాలిబ్ ఎంతటి 'శిల్పి'యై వుంటాడో ఊహించుకోవచ్చు. ఉర్దూలోనే కాదు, ఫారసీలో కూడా తన కవిత్వం సానలుదీరి వుందని అందుకు 'మెహరె నీమ్ రోజ్' వంటి గ్రంథాలు నిదర్శనమని సవాలు చేసినట్లనిపించవచ్చు కాని, ఆ సవాలులో ఎంతో వాస్తవముందని విజ్ఞుల తిరుగులేని అభిప్రాయం.

ఆగ్రాలో పుట్టినా, ఢిల్లీలో మెట్టి గిట్టినా, గాలిబ్ ఒక ప్రాంతానికీ, ఒక జాతికీ పరిమితం కాదు. భావసమైక్యత, సమగ్రతల దృష్ట్యా ఆతడు సార్వజనీన కవి. దాశరథి చెప్పినట్లు గాలిబ్ సంప్రదాయవాదుల్లో అతి నవ్యుడు. సంకుచిత మతగజాలకు అంకుశంలాంటివాడు. మూఢాచారాల మూసపోతల్లో ఇమిడిపోనివాడు. మీదుమిక్కిలి గాలిబ్ మహామానవతావాది. స్వచ్ఛత, స్వేచ్ఛతలు ఆతని ఉచ్ఛ్వాస నిశ్వాసాలు. గాలిబ్ కవిత్వంలో ఇవన్నీ పడుగుపేకల్లాగా అల్లుకున్నాయి.

పద్ధతులు వేరైనా పరమార్థం ఒక్కటే కావున గాలిబ్ ఉర్దూభాషలో కవిత్వం చెప్పినా అది అన్ని భాషలవాళ్ళకూ ఆదర్శప్రాయమే. గాలిబ్ చెప్పిన ప్రతి గజల్ మానవుని మనస్తత్వాన్ని కదలిస్తుంది. అజమాయిషీ చేస్తుంది. ఎక్కడ వెతలన్నీ మానవుణ్ణి క్రుంగదీస్తుంటాయో, ఎక్కడ మనస్సము ద్రపు హోరు అతి దుర్భరమైపోతుందో అక్కడ గాలిబ్ కవిత్వం మిత్రసమ్మితంగా ప్రత్యక్షమవుతుంది. అందుకే మనసున్నంతకాలం గాలిబ్ గజల్‌కే కాదు, అసలు కవిత్వానికే క్షతి లేదు. నిజజీవితంలో కుమిలిపోయిన క్షణాలన్నీ - గాలిబ్ కవిత్వంలో జ్వాలావీక్షణాలైనాయి.

సంఘటనలు జీవితపు లోతుపాతుల్ని స్పృశింపజేస్తాయి. మనిషికి తాత్వికస్పృహను కలిగిస్తాయి. ఈ తత్వాన్ని కవితా తత్వంగా మార్చుకోగలిగాడు గాలిబ్. అందుకే జీవితపు లోతుల్ని ఆవిష్కరించే గాలిబ్ కవిత్వం కేవలం భౌతికానంద సంధాయకం కాదు. ఈ మాటకువస్తే ఉర్దూకవులే అతీతానందాభిలాషులు! వాళ్ళ కవిత్వమూ అతీతానంద సంధాయకం, కావున గాలిబ్ కవిత్వాన్ని ఆనందంతో చదవలేం. ఒకవేళ చదివినా ఆనందం కాస్త ఆలోచనామృతంలో లయం కావాల్సిందే.

గాలిబ్ ఏది చెప్పినా అది మానవ జీవితాన్ని 'జాదూ' చేస్తుంది. ఉక్కిరిబిక్కిరి చేస్తుంది. ఆర్తిని మూర్తిమంతంగా మారుస్తుంది. అంతర్వాహినిగా అంతులేని ప్రబోధసుధను కూడా పంచుతుంది.

మానవ జీవితంలో ఎన్నో ఆశలు. వీటి సాఫల్యం కోసం ఎన్నో ఆరాటాలు, పోరాటాలు, జీవన భద్రతకోసం చేసే ఈ నిరంతర ప్రయత్నాల్లో మనిషికి సుఖశాంతులు కరువైనాయి. నిజమైన సంతృప్తి నిస్వార్థ జీవితంలోనే సాధ్యం. అందుకే గాలిబ్ దృష్టిలో మానవుడు కేవలం ఒక బాటసారి. ఒక అతిథి మాత్రమే. ఇలాంటివాడు జీవనప్రయాణంలో దేనికీ వెంపరలాడ కూడదు. ఉన్నదానితోనే సంతృప్తి పొందాలి. లేనిపోని కట్టు

బాట్లు, హద్దులు, హంగామాలు మానవ జీవితాన్ని సంకుచితం చేస్తాయి. ఈ విధానం గాలిబ్ కవికి సరిపడదు. అందుకే ఇలా అంటున్నాడు.

"బే దరొ దీవార్ సా ఏక్ ఘర్ బనాయా చాహియే
కోయీ హమ్ సాయ న హో ఔర్ పాస్బాఁ కోయీ న హో"

ద్వారబంధాలు, అడ్డుగోడలు ఇలాంటివేవీ లేని ఒకానొక వింత గృహం నిర్మించుకోవాలి. ఆ ఇంటిచుట్టూ ఇరుగు పొరుగువారుండ రాదు. కాపలావాడు అసలే అక్కరలేదు.

ద్వారబంధాలు ఆర్భాటాల్ని సూచిస్తాయి. మనిషిని ఇంట్లోనే బంధిస్తాయి. అడ్డుగోడలు ముందుకు సాగనీయవు. ఆలోచనల్ని అడ్డగిస్తుంటాయి. ఇంటిలోని ధనాదిక వస్తు సామగ్రిని రక్షించటానికే ఈ ద్వారబంధాలు, గోడలు. ఆ సామగ్రివల్ల వ్యక్తికి గల ఆరాటానికి, స్వార్థచింతనకు ఇవి ప్రేరకంగా వున్నాయి. కావలాదారు కూడా అంతే. మంచి సంకల్పాన్ని కించపరిచే ఇరుకు మనస్తత్వంగల ఇరుగు పొరుగు వాళ్ళు ఆ ఇంటిచుట్టూ వుండడం అభిలషణీయం కాదు.

ఇలా చూస్తే గాలిబ్ నిర్మించుకోదలచిన ఇల్లు ఇంచు మించు ఒక సత్రశాల వంటిదే! పైవేవీ దీనికంతగా అవసరం లేదు. ప్రయాణీకుడు అందులో కేవలం విశ్రాంతి తీసుకొని వెళ్తాడు. అతనికి దేనిమీదా ప్రత్యేకమైన 'నిఘా' వుండదు. ఇంకా చెప్పాలంటే గాలిబ్ దృష్టిలో ఈ ప్రపంచమే ఒక విడిది గృహం! మానవుడు ఒక నిరంతర ప్రయాణీకుడు. గాలిబ్ ప్రయాణీకుడే కాక పరివ్రాజకుడు కూడా. అచ్చమైన సూఫీ ఫకీరుగా గాలిబ్ చెప్పిన ఈ గజల్, అతని నిస్వార్థ దృక్పథానికీ, మనోవైశాల్యానికీ ఒక నికషోపలం!

ఉర్దూ సాహిత్యంలో సత్ర ప్రస్తావన అధికంగా వస్తుంది. మానవుని తటస్థ వైఖరిని తట్టి చెబుతుంది.

ఉర్దూ కవికి భావనలో స్వేచ్ఛ వుంది. జీవితంలో అది కొరవడింది. వైశాల్యం ఏ కోశానా లేదు. లోకం ఆకాశాన్ని హద్దుగా భావిస్తే, గాలిబ్ మాత్రం ఆ హద్దును చెరిపేసి అక్కడే స్వేచ్ఛగా ఒక ఇల్లు కట్టుకొని, మరింత వైశాల్యాన్ని పెంచుతా నంటాడు. అంతటి మనోవైశాల్యమున్న గాలిబ్, లోకంలో ఎన్నో సంకుచిత పద్ధతుల్ని గమనించి, ఈసడించుకొన్నాడు. ఈ నిరసన భావప్రకటనకు తన్ను తానే ఉదాహరణగా తీసు కున్నాడు.

"మిసాల్ యె మేరీ కోషిష్ కీ హైకె ముర్గ్ అసీర్
కరే ఖఫస్ మేఁ ఫరాహమ్ ఖస్ ఆషియాఁ కేలియే"

ఈ ప్రపంచంలో నేనొక బందీని. జీవించటానికి నా ప్రయత్నం - పంజరబద్ధమైన పక్షి, అందులోనే గూడు కట్టు కోవడానికి గడ్డిపోచల్ని ప్రోగు చేసుకుంటున్నట్లుంది.

గాలిబ్‌కి లోకమే ఒక బందిఖానా. తానే ఒక బందీలాంటి వాడు. ఇంతటి ఇరుకు గదిలో కూడా జీవికకోసం ఏదో ఆరాటం! ఎడతెగని యత్నం. అసలే గూడు! అందులో స్వార్థం కరడు గట్టిన గూడు! పక్షికి పంజరమే బంధం. అందులో కూడా గూడు కట్టుకోవటానికి అది తృణపూలికల్ని ప్రోగు చేసుకుంటే - ఎంత హాస్యాస్పదంగా వుంటుందో, మనిషి కూడా క్షణభంగురమైన జీవితంలో లేనిపోని ఆరాటాలకు ప్రయత్నించటం అంతే హాస్యాస్పదంగా వుంటుంది. దీన్ని వివరించటానికి గాలిబ్ పక్షిని దృష్టాంతంగా చూపుతున్నాడు. పంజరం-లోకం. పక్షి-మానవుడు. గూడు-గృహం. ప్రోగుచేసే గడ్డిపోచలు-స్వార్థ పూరిత సంపాదనలు. మేధావియైన మానవుడు తిర్యగ్వర్గంనుంచి వేరు కావాలని, విశాల దృక్పథాన్ని పెంచుకోవాలని గాలిబ్ ఆకాంక్ష. గాలిబ్ తానే ఉదాహరణగా మారినా అది మానవుణ్ణి దృష్టిలో నుంచుకొనే. సిపాయీల తిరుగుబాటులోని సంకుచితత్వం ఈ గజల్‌లో వ్యంగ్యంగా చిత్రించబడిందని 'రషీద్ ఖురేషీ' వ్యాఖ్యానం.

ఉర్దూకవి జీవితం ముళ్ళబాట. ముళ్ళు కష్టాలకు సంకేతాలు. కష్టాల రారాపిళ్ళతో కవి భావం ప్రకాశిస్తుంది. 'తో కాంటోమే ఉలఝ్‌కర్ జిందగీ కర్నేకీ ఖూఁ కర్లో'- ముళ్ళలో తగుల్కొని జీవించటం అలవాటు చేసుకోవాలని ఇక్బాల్‌వంటి అభ్యుదయ కవులే భావించారంటే- గాలిబ్‌లాంటి సూఫీ దరిదేసి మాట ఇక చెప్పాలా! నిజమైన సుఖశాంతులు బాధల్లోనే దాగివున్నాయి. అందుకే కష్టాల్ని చిరునవ్వుతో ఎదుర్కొమ్మంటున్నాడు గాలిబ్.

'రంజ్ సే ఖూఁగర్ హువా ఇన్సాఁతో మిట్ జాతాహై రంజ్
ముష్కిల్ ఇత్నీ పడీ ముఝ్‌పర్ కె ఆసాఁ హోగయీ'

మానవుడు కష్టాలకు అలవాటుపడితే వాటంతట అవే సమసి పోతాయి. నామీద కూడా ఎన్నో కష్టాలు వచ్చి పడ్డాయి కాని, అలవాటు పడినవాణ్ణి కనుక, అవన్నీ నాకు తేలికైపోయాయి.

కష్టాలు, బాధలు మానవుడికి జీవితానుభవాన్ని నేర్పుతాయి. ఆ అనుభవ పాఠంద్వారా జీవితంపట్ల సదవగాహన ఏర్పడుతుంది. తియ్యటి పదార్థాన్ని తినేకొలదీ చేదవుతుంటే - చేదును ఆరగించే కొలదీ స్వాదువవుతుంది. వేము మధురమవటం అనుభవసిద్ధం.

అలాగే కష్టాల్ని, బాధల్ని అనుభవించేకొలదీ అవి తేలికవటమే కాక, వ్యక్తిలో సహనశక్తి పెరుగుతుంది. గాలిబ్ జీవితమే ఒక 'బాధల బస్తీ' కావున, తాను సహించి, లోకుల్ని కూడా సహించాల్సిందిగా ఉపదేశిస్తున్నాడు.

'తినటానికి ఏమీ లేదు' అని మిత్రుడంటే 'దుఃఖం వుంది కదా' అని సమాధానమిస్తాడు గాలిబ్. లోకులకు ఆహారం ఎంత పరిచయమో, గాలిబ్ కవికి వెతలు అంతగా చిరపరిచయమైనాయని భావించాలి. 'దస్త్ కో దేఖ్‌కర్ ఘర్ యాద్ ఆయా'- ఎడారిని చూస్తే, ఇల్లు స్మృతికి వస్తున్నది. కష్టానికి ఎడారినీ, సుఖానికి ఇంటినీ చిహ్నాలుగా భావిస్తే, కష్టపడితే తప్ప, సుఖం విలువ తెలియదని తాత్పర్యం.

'జోక్'లాంటి కవులు దీప దృష్టాంతంతో బాధల్ని సహించాల్సిందిగా సూచించారు. కాని గాలిబ్ తానే ఉదాహరణగా మారటం విశేషం. తనమీద ఎన్ని కష్టాలొచ్చాయో చెప్ప తరం కాదు. అయినా సహించి, గమ్యం చేరాడు. తనలాగే, మానవులు వెతలకు క్రుంగిపోకుండా వాటిని అధిగమిస్తూ లక్ష్యసిద్ధిని పొందాలని సందేశం ఇచ్చాడు గాలిబ్.

జీవితమే ఒక కార్యరంగం. ప్రతి పనికీ మనసే ప్రేరణ. మనస్సు సంకల్ప, వికల్పాత్మకం! సత్సంకల్పం సత్కార్యాన్ని చేయిస్తుంది. దుస్సంకల్పం దుష్కార్యాన్ని చేయిస్తుంది. మనిషిమీద దుష్టముద్రను వేయిస్తుంది. ఈ మంచీ చెడుల్ని క్రింది గజల్‌లో చక్కగా విశ్లేషిస్తున్నాడు గాలిబ్.

'ఖత్ర దర్యామే మిల్ జాయెతో దరియా హోజాయె
కామ్ అచ్ఛా హై వొ జిస్‌కే మాల్ అచ్ఛా హై'

బిందువు సముద్రంలో పడిపోతే, అది సముద్రమే అవుతుంది. అదేవిధంగా ప్రతి పని కూడా సంకల్పాన్నిబట్టి మంచిదవుతుంది.

చిన్న బిందువు సముద్రంలో పడ్డాక, ఆ బిందు ప్రభావం సముద్రమంతా వ్యాపిస్తుంది. విషబిందువైతే విషసముద్రం, అమృతబిందువైతే అమృత సముద్రం! అనగా బిందువు సముద్రంగా పరిణమిస్తుంది. అట్లే మంచి ధ్యేయంతో చేసే పని జీవితానికే వన్నె తెస్తుంది. బిందువులో సముద్రం ఇమిడి వున్నట్లు, సత్సంకల్పంలో మలుపు తిరిగే మనుగడ దాగివుంది. అందుచేత సదాశయం, సదాచరణం కావాలంటాడు గాలిబ్. పవిత్రమైన ధ్యేయబిందువులతో జీవన జలధి గంభీరంగా వుండాలి.

అదే బిందువు ముత్యపుచిప్పలో పడితే ముత్యమవుతుంది. మరి ముత్యమంతటి సమున్నత స్థానాన్ని పొందటానికి పూర్వం ఆ జలబిందువు ఎంత శ్రమపడి వుంటుంది! ఈ విషయాన్ని శుక్తిమౌక్తిక న్యాయంద్వారా వివరిస్తున్నాడు గాలిబ్.

"దామ్ హర్ మౌజ్ మేఁ హై హల్ఖయె సద్ కామ్ నహెంగ్
దేఖే క్యా గుజ్రె హై ఖత్రేపె గొహర్ హోనే తక్."

వానబిందువు శుక్తిలో పడి మౌక్తికంగా మారుతుంది. కాని, ఆ నీటిచుక్క ఎన్నో ఇబ్బందుల్ని ఎదుర్కొన్న తరువాతనే ముత్యంగా మారుతుంది.

ఆ బిందువు ఒకప్పుడు సముద్రజలం. రగిలే మండు టెండలకు మాడిపోతుంది. తరగల రారాపిళ్ళకు తట్టుకుంటుంది. మొసళ్ళ నోళ్ళనుంచి తప్పించుకుంటుంది. హోరుగాలి దాడుల్ని ఓర్చుకుంటుంది. క్షారత్వాన్ని సహిస్తుంది. అటుపై మేఘాల దాహానికి గురి అవుతుంది. చివరికా మబ్బులేన్నే చీల్చుకొని ముత్యపు చిప్పలోనే పడుతుంది. మంచి ముత్యమవుతుంది. ఒక నీటిబిందువుకి ఇంతటి పట్టుదల, ఓర్పు ఉన్నాయి కావున ముత్యంగా భాసించే స్థానాన్ని పొందగలిగింది. మనిషి కూడా జీవన జలధిలో తటస్థపడే ఎన్నో ఆటుపోటుల్ని సహిస్తూ, దీక్షతో సాగిపోతే తప్ప అనుకున్న లక్ష్యాన్ని సాధించలేడు. లక్ష్యసిద్ధి కోసం జీవనప్రయాసను భరించాలని ప్రవచిస్తున్నాడు గాలిబ్.

బ్రతుకొక బాధల బంధిఖానాయే కావచ్చు. అయినా బ్రతకాల్సిందే! బాధలకు జడిసిపోరాదు. ఆ బాధలకు జీవితంలో విరామముండదు. మృత్యువే బాధా పరిష్కారమంటాడు-గాలిబ్.

"గమె హస్తీకా అసద్ కిస్‌సేహో జుజ్ మర్గ్ ఇలాజ్
షమ హర్ రంగ్‌మే జల్తీహై సహెర్‌హోనే తక్."

జీవనవ్యథలకు మరణమే పరిష్కారం. తెల్లవారేదాకా దీపం కాలుతూనే వుంటుంది కదా!

రేయంతా దీపం కాలుతూ, తెల్లవారేసరికి ఆరిపోతుంది. నడుమ ఆరిపోదు. దీపం రాత్రంతా సుఖంగానే వెలగదు. అది కాలుతూ, గాయాల కథల్ని వినిపిస్తుంది. కుములుతూ కూడా రాత్రికి వెలుగునివ్వటంలోనే దాని ఔదార్యం దాగివుంది. కొనరి విసరే గాలి తాకిళ్ళను, రెక్కల పురుగుల రెపరెపలను కూడా ఎదుర్కొంటూ ఒక చిన్న దీపం వేకువదాకా వెలుగుతుంది. మానవుడు కూడా జీవితంలోని విఘాతాలకు భయపడి మధ్యలోనే

ఆహుతి కారాదు. సుఖంగానో, దుఃఖంగానో జీవితాన్ని సాగించాల్సిందే. రకరకాల అనుభవసారం జీవితమవుతుంది కాని, ఏ ఒక్క అనుభవంవల్లనో జీవితానికి పరిపూర్ణత రాదు. రాత్రియే బాధామయ జీవితం. దీపమే మనిషి. జ్వలనమే బాధ. ఉదయమే మరణం. ఇదే చిరపరిష్కారం. మనిషికి అనుసరణీయం. దీపం కాలుతూ కూడా దీప్తిని ప్రసాదిస్తున్నట్లు, మానవుడు బాధల్లో వున్నా సరే పరోపకారిగా వుండాలనే ధ్వని ఈ గజల్‌లో ఆవిష్కృతమవుతుంది.

'జౌక్' కూడా మానవపరంగా దీపాన్ని సంబోధిస్తూ సుఖదుఃఖాత్మక జీవనరాత్రాన్ని గడపాల్సిందే అన్నాడు. కాని బాధలకు పరిష్కారం మృత్యువని చెప్పలేదు. గాలిబ్ ఆ పరిష్కార మార్గాన్ని సూచించి, అందాకా సాగాలంటూ ఆశావాదాన్ని రేకెత్తించాడు. తన ప్రత్యేకతను ప్రదర్శించుకొన్నాడు.

జీవితం నియంతవంటిదని, అది మానవుడికి లొంగదని, అతడే దానికనుగుణంగా సాగిపోవాల్సి వుంటుందని ఒక అద్భుతమైన ఉదాహరణతో వివరించాడు గాలిబ్.

"రౌమేఁ హై రఖ్షె ఉమ్ర్ కహాఁ దేఖియే థమే
నై హాథ్ బాగ్‌పర్ నపా హై రికాబ్ మే"

జీవితం ఒక వేగవంతమైన గుర్రం వంటిది. మానవుడే రౌతు. కాళ్ళు జీనులో పట్టుగా లేవు. చేతిలో కళ్ళెం కూడా లేదు.

గాలిబ్ కవి మానవ జీవితాన్ని ఒక జవనాశ్వంతో పోలుస్తున్నాడు. మనిషి అశ్వారోహకునితో సమానుడు. అశ్వవేగం రౌతు అధీనంలో లేదు! మనిషి కూడా జీవితాన్ని శాసింపలేడు. అనేకానేక విపత్కర పరిస్థితులకు తలవంచాల్సి వుంటుంది. మనిషికి ఇష్టమైనా, కాకున్నా జీవితం సాగిపోతుంది. రౌతు చేతిలో 'రికాబు' లేదు. కాళ్ళు జీనులో స్థిరంగా లేవు. కళ్ళెం-జీవితాన్ని అదుపుచేసుకునే పథకం కావచ్చు. కాళ్ళు జీనులో స్థిరంగా లేవంటే — జీవితంలో భద్రతగానీ, స్థిరమైన ఉనికి గానీ మానవుడికి సాధ్యంకావని భావించాలి. ఒకవేళ ఇవన్నీ సిద్ధించినా ఏదో ఒక సందర్భాన హఠాత్పరిణామాలు సంభవించక మానవు. ఇందుచేత కూడా జీవితం మనిషికి వశమైనట్లు కాదు.

ఈ విషయాన్ని గమనించి జీవితంలో ఎదురయ్యే సంఘటనల్ని సముదాయించుకుంటూ మానవుడు ముందుకు పోవాలని ఉద్బోధిస్తున్నాడు గాలిబ్.

గాలిబ్ గజళ్ళకు 'చుగ్తాయీ' అనే ప్రఖ్యాత చిత్రకారుడు భావచిత్రాలు గీశాడు. అతడీ గజల్ భావానికి సన్నిహితంగా, మనోహరంగా చిత్రం గీశాడు. ఒక సాగిపోయే నది. అందులో పద్మం. ఆ పద్మంమీద దీపం. ఇదీ చుగ్తాయీ చిత్రం. నది-జీవితపు వేగానికి సంకేతం. ప్రవాహపు సందడి-జీవన కల్లోలానికి సంబంధించింది. పద్మం - ఆధారం. దీపం - మానవుడు. ప్రవాహానికి దివ్వె అనుగుణంగా సాగుతుందే కాని ఎదురీదదు. అలాగే మానవుడున్నూ.

దీపం-మానవుని అస్థిరత్వాన్ని చూపుతుంది.

సమూహంలో హుందాగా వ్యవహరిస్తూనే, చాటుమాటుగా అసహ్యాలకు పాల్పడే మనుషుల్ని ఎద్దేవా చేయటానికి గాలిబ్ తారకల్ని ఆశ్రయించాడు.

"థీ బనాతున్నాశె గర్దూ దిన్ కే పర్దేమే నిహాఁ
షబ్‌మే ఉన్ కే జీ మే క్యా ఆయీ ఉర్యా హోగయీ"

దినమంతా పగటి పరదాల్లో తారకలు దాక్కున్నాయి. రాత్రివేళ అయ్యేసరికి వాటి మనసు ఏమయిందో కాని, అవన్నీ దిగంబరంగా మారిపోయాయి.

తారకా సమూహాన్ని మానవ సమూహంగా అర్థం చేసుకోవాలి. పగలు అందరూ గమనిస్తారు కావున తారకలు పరదాల్లో దాక్కుంటాయి. రాత్రి ఎవ్వరూ చూడరు కనుక అవి విచ్చలవిడిగా, దిగంబరంగా తిరుగుతాయి. అల్లే మానవులు నలుగురిలో వున్నప్పుడు ఉదాత్తంగా వ్యవహరిస్తారు. అసలు స్వభావాల్ని బహిర్గతం చేయరు. ఏకాంతంలో వాళ్ళ శీలం తెలుస్తుంది. ఇంటా బయటా కూడా ఒకేరకమైన స్వచ్ఛత, స్పష్టతలు మానవులకు అలవడితే మంచిదని గాలిబ్ అభిప్రాయపడుతున్నాడు.

లోపాల్ని తెలుసుకోవటం మహావిద్య. ఆ లోపాల్ని చక్కదిద్దుకొన్నవాడే పరిపూర్ణమైన మానవుడని గాలిబ్ సందేశం. లోపాలు సవరింపబడకపోతే పతనం ప్రారంభమవుతుందని హెచ్చరిక.

ఈ విధంగా గాలిబ్ కవిత్వంలో జీవనరేఖలు సమగ్రంగా దర్శనమిస్తున్నాయి. సమాజాన్ని ముందుకు నడిపించటంలో గాలిబ్ కవిత కృతకృత్యత చెందింది. దీనికితోడు సూక్ష్మపరిశీలన, తాత్త్వికసౌందర్యం గాలిబ్ కవితను అజరామరం చేశాయి.

---

**ఆధార గ్రంథాలు :**


(1) గాలిబ్ గీతాలు - దాశరథి
(2) ఏరికూర్చిన గీతాలు - రషీద్ ఖురేషీ (సంకలనం)
(3) ఇక్బాల్ కవితలు - బెజవాడ గోపాలరెడ్డి అనువాదం

# దానవుడా!

## శ్రీ కాసల నాగభూషణం

మనశ్చక్ర వక్రగతులలో
రాత్రిందివాల వినోదాలలో,
విస్కీసీసాల విలాసాలలో
మానవత్వం సర్వం మరచిపోయిన
నాగరికతా వ్యామోహంలో
రూపాంతరం చెందినవాడా!
దానవుడా! దానవుడా!

సౌందర్యం నిరసించేవాడా!
కవితలో, శిల్పంలో–పురుగులో, పుష్పంలో–
మెరుపులో, మేఘంలో
అందం ఏముందని ఆక్షేపించేవాడా!
అర్జించేవాడా!
తెంచేవాడా! తుంచేవాడా!
దుశ్శీలుడా! దుష్టుడా!
కామించేవాడా!
నాయకుడా! లౌకికుడా! నటుడా! విటుడా!

ఆలోచనలు లేనివాడా!
అనునిత్యం ద్వేషించేవాడా!
మట్టూ, మరుగూ
సిగ్గూ, సెరమూ
నీతీ, నియమం
త్యజించేవాడా!
దుష్టస్వాంతుడా! మంచితనం ఎరుగనివాడా!
స్వార్థదృష్టి! మహాదేహుడా!
మహాతాంత్రికుడా!
దానవుడా! దానవుడా!
ఓట్లడుక్కునేవాడా! ఓనమాలు రానివాడా! నిరంకుశ
స్వభావుడా!
అమ్మో! దానవుడా!
ఒరేయ్ దానవుడా!
ధర్మభూస్థాపనకు యత్నం చేసేవాడా!
న్యాయం భరించలేనివాడా!
అవిమర్శజీవీ! అల్పాత్మా! దానవుడా!
సెక్స్, క్రైమ్, సస్పెన్స్
హారర్, థ్రిల్లర్‌లలో,
పట్టుబడే అనువాదాల్లో,
పట్టుబడని అనుసరణల్లో
సినిమాల్లో, పత్రికల్లో
కథకుడవో, నవలాకారుడవో
ఒరిజినల్‌వో, ఘోస్ట్ రైటర్‌వో
ఒల్లని, చెల్లని, తలవని, నిలవని రచనో
బుద్ధిమంతుడివో, బుద్ధిహీనుడివో
బ్రదకనేర్చినవాడా! బాగుపడేవాడా! దానవుడా!
దానవుడా!

అననురక్త కుటుంబీ!
కలియుగ కబంధూ!
దానవుడా! దానవుడా!
అనేక దుర్భాషలు మాట్లాడేవాడా!
అనేక వేషాల్లో తిరిగేవాడా!
అనేక కాంతల చెరిచేవాడా!
కుహృదయా! అదయా!
దుర్మార్గగామీ!
మాటలు దాటేవాడా!
పార్టీలూ, ప్రహరీలూ దూకేవాడా!
అవకాశాలను వెదికేవాడా!
నక్షత్రాలను ఛేదించేవాడా!
ఏబ్రాసీ! కుమనస్వీ!
వంతెనలు కూల్చించినవాడా!
మద్యశాలలు, నగ్న నృత్య ప్రదర్శనశాలలు,
వేశ్యాగారాలు, దొంగనోట్ల ముద్రణాలయాలు,
స్టెన్‌గన్‌లూ, ఆటంబాంబులూ, న్యూక్లియర్ వెపన్‌లూ
నిర్మించినవాడా!

దూరదృష్టి, దూరాలోచన శక్తులు
లోపించినవాడా!
దానవుడా! దానవుడా!
హింసైకజీవీ! మాయావీ! శఠుడా! అల్పాచార్యా!
పానకళా కోవిదుడా! నిర్వేదాంతీ!
అజ్ఞానధనీ! అహంభావధునీ!
భోగమయా! సంశయాళూ! పరసుఖా సహనశీలీ!
పిల్లికి కూడా పెట్టడానికి
చేతులు రానివాడా!
అశుద్ధమూర్తీ!
వెనమస్!

ద్విపాదపశూ! అధర్మైకజీవీ!
నరశరీర పరివృతుడా!
ధర్మక్రౌంచ నిషాదుడా!
దుష్టగణ సమష్టికుటుంబీ!
నికృష్టజీవీ! మార్మికుడా! దానవుడా!

కంట్రాక్టర్! డాక్టర్! ఏక్టర్!
ఇతరుల శ్రమతో బ్రదికేవాడా!
పేదల కన్నీళ్ళు తాగి కాలం గడిపేవాడా!
కడిపెడు కార్పణ్యం కలిగినవాడా!
అత్యాశల కన్నూ! దానవుడా!

విరగబడేవాడా! పీడించేవాడా!
ఆదర్శాలను ఆహుతి చెయ్యడానికైనా
జంకనివాడా!
దుర్బుద్ధీ!
కేడీ!
బడాచోర్!
పాపీ!
దానవుడా! దానవుడా!

(శ్రీశ్రీకి క్షమాపణతో)

---

# అగ్ని సముద్రం

## శ్రీ చెన్నోజు రామ్మోహన్‌రావు

ఒళ్ళంతా తారు పూసుకున్న ఆకాశాలు
సస్యాలను నిర్మాణాలను అనంతంగా మోస్తున్న నేలలు
అలవాటుగా బానిసను వేధించే 'బాస్చన్ద్రార'లు
నోరున్న సతి చెంత మూగ పతి వేదనలా
ఈ పడుచు దేశం గులాబీ ముఖంపై
ముళ్ళ పాదంతో గభాల్న తంతున్న
కాలదోషం పట్టిన ఒక చీకి చివికిన సిద్ధాంతమై

ఈ తిరోగమన కాలం నిశ్శబ్దంగా రోదిస్తోంది
విరహంతో జడలు విరబోసుకున్న కాముకిలా
ఆటంబాంబులా పేలుతున్న పేదరికంలా
పొరపాటున మృత్యులోయలోకి దొర్లిపోయే మానవ విజయంలా
ఈ ముసిరిన జీవన కలతల అగ్నిసముద్రం—
ఈ సమస్యల మబ్బులు క్రమ్మిన ఆకాశం—
ఈ ప్రజల గుండెల్లో బ్రతుకుదెరువు అగ్నిజ్వాలాపాశం—

శ్రీ సూర్యదేవర రవికుమార్

# తుమ్మలవారి కవితాకళ

విద్వత్కవులు శ్రీ తుమ్మల సీతారామమూర్తిగారి పద్య రచన విస్తృతమైనది. తొలినాటి కృతులైన శతకములు, హరి కథలు, నాటకములు కాక, ఆత్మార్పణము మొదలుగా గాంధి గానము వరకు చిన్నా పెద్ద రచనలు ఇరవైమూడింటిలోను గల పద్యవివరములు పట్టికలో చూపబడినవి.

(పట్టికలోని) ఇరవైమూడు రచనలలో కేవలము నాలుగు రచనలు-ఆత్మార్పణము, ధర్మజ్యోతి, ఆత్మకథ, మహాత్మకథపై మాత్రమే చంపూ పద్ధతిలో గద్యపద్యాత్మకములుగా రచించబడినవి, మిగిలినవి నిర్వచన రచనలే. మొత్తము రచనలలో ద్విపదలు, మంజరీ ద్విపదలు, ముత్యాలసరాలు, గేయాలు కాక సాధారణ పద్యగద్యాలు 13201. వీటిలో 27 గీతమాలికలు, 9 ఉత్పలమాలికలు, రెండు చంపక మాలికలు మొత్తం 38 మాలికలు కలవు. విశేషవృత్తాలు మూడు- ఒక పంచచామరము, ఒక ఇంద్రవజ్ర, ఒక వసంతతిలకం - మాత్రమే ఉన్నాయి. వచనాల సంఖ్య 1130. అక్కరలు 251. ఇందులో 139 మధ్యాక్కరలు, తుమ్మలవారి స్వీయకల్పితమైన నవాక్కరలు 110, ఒక మహాక్కర, ఒక మధురాక్కర కలవు. సీసపద్యాలు తేటగీతులతో కూడినవి 241 కాగా ఆటవెలదులతో గలవి 70 మొత్తము 311. కందపద్యాలు 3982, తేటగీతులు 3006, ఆటవెలదులు 3042. సాధారణ వృత్తాలలో ఉత్పలమాలలు 743, చంపకమాలలు 363, మత్తేభాలు 146, శార్దూలాలు 186.

ఇక, ద్విపదలు కేవలము రెండు — ఉదయగానము, ఆత్మార్పణము — కావ్యాలలోనే కలవు. ఇవి 56 పాదాలు. మంజరీ ద్విపదలు 230 కలవు. వీటి పాదసంఖ్య 10454. ముత్యాలసరాలు 167, చాలీసాలు 40, గేయాలు 7.

ఛందోరీతులలో అభినవ తిక్కనకు తిక్కనకు సామ్యము కన్పించదు.

ఆశు, మధుర, చిత్ర, విస్తరమను చతుర్విధ కవితలలో మాలికారచన, ఆశుకవితా ప్రక్రియ మనకు తెలిసిన మొదటి ప్రసిద్ధమాలిక. అల్లసాని పెద్దన 'పూతమెఱుంగులున్....' ఇత్యాదిగా గలది. గొడ్లవర్తి వెంకన కవి రకార ప్రాసతో రామాయణ కథను రెండువేల ఉత్పలమాలికా పాదాలలో చెప్పినదే తెలుగులో అతిపెద్ద మాలికారచన. తెలుగు సాహిత్యంలో వృత్తాలలోకంటె సీసపద్యాలలోనే మాలికారచన విశేషముగా సాగినది. అయితే, తుమ్మలవారు చెప్పిన మాలికలలో ఒక్క సీసమాలిక కూడ లేదు. పఱిగపంటలోని ఒక సీసపద్యము మాత్రము 6 పాదాలతో కన్పిస్తుంది. తుమ్మలవారి మాలికా కవిత్వంలోని విశేషము వారు తేటగీతులలో మాలికలు చెప్పటము. వారి రచనలలో 27 గీతమాలికలు కలవు. గీతమాలికలను తెలుగు కవులంతగా ఆదరించినట్లు కన్పించదు. బహుశః తుమ్మలవారే గీతమాలికా రచనకు ఆద్యులేమో! మహాత్మ కథలో వీరి పెద్ద గీతమాలిక 113 పాదాలతో కన్పిస్తుంది. పెద్దకాపులోని ఒక గీతమాలికలో 112 పాదాలు గలవు. ఇది ముత్యాల రాజాస్థానంలో ఆశువుగా చెప్పినది.

తుమ్మలవారు తమ బృహత్కవితా సృష్టిలో కేవలం మూడు ప్రత్యేక సంస్కృత వృత్తాలనే రచించటం గమనార్హము. ఇవికూడ ఒక్క ఆత్మకథలోనే ప్రయోగింపబడినవి. ఇన్నివేల పద్యసృష్టిలో ఇంత తక్కువగా సంస్కృత విశేషవృత్తాలను ప్రయోగించిన కవి మరి లేరేమో! ఈ విషయములో అభినవ తిక్కన, తిక్కనకు పూర్తి వ్యతిరేకులు.

తుమ్మలవారు మొట్టమొదటగా ఆత్మకథలోనే ఒక మధ్యాక్కరను వ్రాశారు. ఇది లాక్షణికుల లక్షణానుసారంగా నాల్గవ గణాద్యక్షరం యతిస్థానంగా వ్రాయబడినది.

బెడిదం బగు తెవులు రేఁగి పెనఁగొనఁ దనయన్న యిట్లు
కడలేని యిడుములం గుడుచు కథ విని నా పిన్నతండ్రి
యడలొంది పోర్బందరు పురి నప్పుడ తావీడనాడి
వడివడి పయనంబు లదర వచ్చెను దత్సేవ సలుప. (పుట. 42)

ఆత్మకథ 1951లో వెలువడినది. ఆ తరువాత 1955లో వెలువరించిన ఉదయగానము, శబలలలో కూడ మధ్యాక్కరలు

## తుమ్మలవారి ఛందోరీతులు

| గ్రంథము | తొలి కూర్పు | ఉ | చం | మ | శా | కం | గీ | ఆ | సీస. గీ | సీస. ఆ.వె | వచనము | ద్విపదలు పాదాలు | మంజరులు-పాదాలు | మాలికలు | ముత్యాల సరాలు | గేయాలు | విశేషవృత్తాలు | మొత్తము |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ఆత్మార్పణము | 1932 | 16 | 8 | 5 | 5 | 85 | 32 | 6 | 13 | - | 25 | 1-8 | - | - | - | - | - | 196 |
| ధర్మజ్యోతి | 1945 | 9 | 10 | - | 2 | 95 | 29 | 24 | 10 | 2 | 1 | - | - | - | - | - | మహాక్కర-1 | 183 |
| పెద్దకాపు | 1948 | 13 | 10 | 6 | 14 | 60 | 48 | 21 | 11 | 1 | - | - | 1-18 | గీత.2-112+50 ఉ.1-116 చం. 1-30 | 24 | - | - | 213 |
| (కొన్ని మినహాయింపులతో) | | | | | | | | | | | | | | | | | | |
| ఆత్మకథ | 1951 | 33 | 21 | 7 | 12 | 1682 | 669 | 572 | 59 | 51 | 602 | - | 79-998 | - | 2 | - | పంచచామరము-1 ఇంద్రవజ్ర-1 మధ్యాక్కర-1 వసంతతిలక-1 | 3793 |
| సర్వోదయగానము | 1961 | 3 | - | 1 | - | 152 | 108 | 126 | 2 | 1 | - | - | 4-124 | - | - | - | మధ్యాక్కర-4 | 401 |
| తెనుగునీతి | 1961 | 11 | 17 | - | - | 19 | 20 | 38 | - | - | - | - | — | - | - | - | — | 105 |
| రాష్ట్రగానము | 1938 | 65 | 14 | 24 | 29 | 4 | 6 | 1 | 41 | 1 | - | - | - | - | - | 1 | - | 186 |
| పఱిగపంట | 1943 | 69 | 21 | 6 | 19 | 112 | 17 | 12 | 41 | 5 | - | - | 2-54 | గీత.3-115 ఉ.1-69 | 1 | - | - | 309 |
| (కొన్ని మినహాయింపులతో) | | | | | | | | | | | | | | | | | | |
| అమరజ్యోతి | 1948 | 16 | 4 | 6 | 9 | 8 | 5 | 1 | 6 | - | - | — | — | - | - | - | - | 55 |
| తపస్సిద్ధి | 1949 | 21 | 8 | 14 | 17 | 15 | 3 | 2 | 2 | - | — | — | — | — | — | — | — | 82 |
| ఉదయగానము | 1955 | 86 | 54 | 12 | 11 | 51 | 24 | 35 | 2 | — | — | 1-48 | — | — | — | — | — | 276 |
| శబల | 1955 | 65 | 26 | 18 | 21 | 49 | 28 | 15 | 8 | — | — | — | 1-72 | ఉ.3-94 తే.గీ 2-56 | - | — | — | 236 |
| నేను | 1963 | — | — | — | — | 55 | 43 | 64 | — | — | — | — | — | — | — | — | — | 162 |
| గీతాదర్శము | 1963 | — | — | — | — | 87 | 361 | 261 | — | — | — | — | — | — | — | — | — | 709 |
| పైరపంట | 1964 | 63 | 24 | 8 | 10 | 65 | 47 | 61 | 12 | 1 | — | — | 5-32 | ఉ.1-60 గీ.17-355 | — | 1 | మధ్యాక్కర-2 | 317 |
| సమదర్శి | 1967 | 32 | 15 | 5 | 4 | 105 | 54 | 99 | 5 | — | — | — | 2-51 | ఉ.2-29 చం. 1-32 గీ. 1-44 | — | — | మధ్యాక్కర-8 | 333 |
| మహాత్మకథ | 1968 | 166 | 79 | 18 | 24 | 718 | 757 | 714 | 18 | 6 | 502 | — | 109-2528 | గీ. 1-113 | — | 1 | మధ్యాక్కర-75 | 3188 |
| నా కథలు | 1973 | 4 | 3 | 1 | 1 | 308 | 313 | 370 | 4 | 1 | — | — | 25-1122 | — | — | — | మధ్యాక్కర-45 మధురాక్కర-1 | 1076 |
| ఎక్కట్లు | 1976 | 3 | 1 | 1 | — | 77 | 99 | 162 | — | — | — | — | — | — | — | — | — | 343 |
| హనుమాన్ చాలీసా | 1978 | — | — | — | — | 10 | 18 | 27 | — | — | — | — | — | — | — | - | చాలీసాలు-40 | 95 |
| సందేశ సప్తశతి | 1981 | 14 | 10 | -- | 1 | 130 | 247 | 333 | 1 | - | - | - | - | - | - | - | మధ్యాక్కర-3 | 739 |
| కదంబకైత | 1983 | 44 | 36 | 14 | 7 | 94 | 76 | 98 | 5 | 1 | - | - | 1-92 | గీ. 1-35 ఉ. 1-30 | 3-35 | 4 | మధ్యాక్కర-1 | 418 |
| గాంధిగానము | 1987 | 10 | 2 | - | - | 1 | 2 | - | 1 | - | - | - | 1-5363 | - | 105 | - | నవాక్కర-110 | 282 |
| మొత్తము | - | 743 | 363 | 146 | 186 | 3982 | 3006 | 3042 | 241 | 70 | 1130 | 2 | 230 | 38 | 167 | 7 | 294 | 13,647 |

లేవు. 1961లో ప్రచురించిన సర్వోదయగానములో 4 మధ్యాక్కరలు గలవు. ఇవి ఆత్మకథలోని మధ్యాక్కరవలె కాక, నన్నయభట్టు మార్గాన్ని అనుసరించి 5వ గణాద్యక్షరం యతిగా వ్రాయబడినవి. ఇది గమనించదగిన మార్పు. 1961 తర్వాత వెలువడిన ఇతర రచనలలో గల మధ్యాక్కరలు నన్నయ మార్గాన రచించబడినవే.

ఇక్కడ ఒక విషయమును ప్రస్తావించటం అప్రస్తుతం కాదనుకుంటాను. మధ్యాక్కరకు లాక్షణికులు చెప్పిన లక్షణము రెండింద్రగణాలు, ఒక సూర్యగణము గల దళము రెట్టింపు. నాల్గవ గణాద్యక్షరం యతి. కాని నన్నయ మధ్యాక్కరలు 5వ గణాద్యక్షరం యతిగా కలిగి ఉండటమే కాక, లాక్షణికుల గణ నియమాన్ని కూడ కొన్నిచోట్ల ఉల్లంఘిస్తున్నాయి. 'భూపాలా! నీకు నిక్కోమలియందుఁ బుట్టిన సుతుఁడు' వంటి పాదాలు మరింత పరిశీలించవలసినవని దివాకర్ల వంటివారు సెలవిచ్చారు.

మధ్యాక్కర పాదమున గల ఆరు గణాలను రెండు రెండు గణాల చొప్పున మూడు దళాలుగా విభజించి, మొదటి, మూడవ దళాలను కలిపిన అది ద్విపద అవుతుంది. ఈ ద్విపద పాద మధ్యమందు గల దళం ఒక సూర్యగణం, ఒక ఇంద్రగణం కలది. నన్నయగారి మధ్యాక్కరలలో కొన్నిచోట్ల ఈ మధ్య దళంలోని గణాలు ముందు వెనుకలైనాయి. మధ్యాక్కర నిర్మాణంలోని యీ తత్వాన్ని నేను ఇదివరకే విశదీకరించాను. (చూ. భారతి అక్టోబరు 1983). ఈ విధముగా మూడు దళములు గల మధ్యాక్కర పాదములోని మూడు దళాద్యక్షరాలకు యతి నన్నయగారి రచనలో యాదృచ్ఛికంగా ఉన్న విషయాన్ని కూడా నేను చూపించాను.

ఎందుండి వచ్చితి ఋషికుమార యే నెన్నడు నిట్టి
ఇందుండు మీవని కృష్ణమృగచర్మ కృతకు శాసనము
(3-3-97)

వంటి నన్నయ మధ్యాక్కర పాదాలు ఈ విషయమై పరిశీలించదగినవి.

5వ గణాద్యక్షరం (మూడవ దళాద్యక్షరం) యతిగా రచించబడిన తుమ్మలవారి మధ్యాక్కరలలో కూడ పై విధంగానే మూడు దళాల ఆద్యక్షరాలకు యతిమైత్రి కలిగిన పాదాలు ఎన్నో కన్పిస్తాయి. ఇవి తుమ్మలవారు గమనించి కూర్చినవి కావు. సహజముగా దొర్లినవే.

వేదాంగవిదుడు భా వేమహాఋషి వినిచిన నుడులు
ఆదరింపవె! తుమ్మ లాన్వవాయ సుధాంభోధి చంద్ర
వోకార్పఁ బెనగునీ బోంట్లకుంగాక పూని యెవ్వాని
(సర్వోదయగానము పుట 11)

కానున్నచోయని కర్షకులడతి కంపించునపుడు
(పైరపంట పుట 34)

గుర్తుంచుకొనివారి గుణముల వలపు కొంతయంటినను
(సందేశ సప్తశతి పుట 5)

ఇటువంటి పాదములు సమదర్శిలో మూడు, నా కథలులో 11, మహాత్మకథలో 18 కలవు.

5వ గణాద్యక్షరముతోపాటు నాల్గవ గణాద్యక్షరమునకు కూడా యతిమైత్రి కలిగిన పాదములు తుమ్మలవారి మధ్యాక్కరలలో కనిపిస్తాయి.

కావచ్చుగాక నీకొక్క కానుక కాంక్షదీఱంగ
(సర్వోదయగానము పుట 11)

ఆనాడు నీవానకట్ట నట్టిట్టులాడించి త్రెంచి
(పైరపంట పుట 34)

ఎందాఁక నర్కేందులుందు రెందాఁక నెసఁగు సంద్రమ్ము
(సందేశ సప్తశతి. పుట 8)

ఇటువంటి పాదములు సమదర్శిలో రెండు, నా కథలులో 6, మహాత్మకథలో 26 కలవు. మధ్యాక్కర నిర్మాణ విశేషములను గూర్చి ఇంకా చర్చించవలసియున్నది.

తుమ్మలవారు 'నా కథలు'లోని 'సుందర వరదుయ' ఖండికలో ఒక మధురాక్కరను, 'ధర్మజ్యోతి'లో ఒక మహాక్కరను రచించారు. 'గాంధిగానము'లో 5 ఇంద్రగణములు, ఒక సూర్యగణము గలిగి 5వ గణాద్యక్షరం యతిగా గల ఒక అక్కరను సృష్టించి దానిని నవాక్కరగా పేర్కొన్నారు. ఈ ఛందస్సులో 110 అక్కరలు రచించారు. వీటిలో కూడ మధ్యాక్కర పాదాలలోవలె 3వ గణాద్యక్షరానికి కూడా యాదృచ్ఛికంగా యతి మైత్రి గల పాదాలు కొన్ని గలవు. 'అనసూయ' అన్న మకుటముతో చక్కని తూగుతో శ్రుతి హితంగా నడిచాయి యీ నవాక్కరలు.

ఉప్పుఁ బప్పును మాను టొండె నీమందని యువిదకుం జెప్ప
నొప్పక "యయ్యగారూ! పేరుగన్న వైద్యుండు మీ కుప్పు
పప్పు వర్జ్యం"బని పల్కిన విదుతురా! పలుమాటలేల
చెప్పుట సులభ మెవ్వరికేని యనియె నచ్చెలి యనసూయ!

ద్విపదలు రెండు గ్రంథాలలో 56 పాదాలకే పరిమితం కాగా మంజరీ ద్విపదలు 11 గ్రంథాలలో 10,454 పాదాలుగా సాగినవి. కందపద్య రచనకు ప్రసిద్ధుడు తిక్కన. తిక్కన భారతమున గల కందపద్యముల శాతము 32.28. కాగా అభినవ తిక్కన రచనలలో వీటి శాతము 28.04. తుమ్మలవారి రచనలలో తేటగీతులు, ఆటవెలదులు సమపాళ్ళలో (క్రమంగా 21.16, 21.42 శాతము) కన్పిస్తాయి. తిక్కన మహాభారత రచనలో వీటి శాతము కేవలము 8.73, 5.53 మాత్రమే. మొత్తముమీద తుమ్మలవారి రచనలలో జాత్యుపజాతుల శాతము 79.30. ఇది గణనీయమైన సంఖ్య. జాత్యుపజాతుల నింతగా ఆదరించటానికి గల కారణమును తుమ్మలవారే ఇలా వివరించారు.

వృత్తముల త్రిక్కవాడముచో నెల్లదప్పి
గుప్పవలె సంస్కృతము; దీనికొప్పనేను
జాతి నుపజాతిని దెనుంగు చక్కనిముడు
గాన నవ్వారిగా వీని గారవింతు. (నేను పుట 27)

వృత్తరచనలో త్రిక్కవాడముచో సంస్కృతము గుప్పింప బడుట సాధారణ విషయమే. సంస్కృత పదభరితమైనపుడే వృత్తములు సొగసుగా పరుగుతీస్తాయి. మహాత్మ కథలోని 'అలనన్నయ్యకు లేరు....' (పుట 2), శబలలోని 'కర్ణాటీనవ హీరహారము....' (పుట 29), పైరపంటలోని 'జయజయ....' (పుట 81), కదంబకైతలోని 'జయ! మేడూరి....' (పుట 19), 'కులమత వర్గభేద....' (పుట 15) ఇత్యాదిగా సాగే ఎన్నో వృత్తాలు దీనికి ఉదాహరణలుగా చూపవచ్చును. ఇక, జాత్యుప జాతులను కూడ సంస్కృత పదభూయిష్ఠంగా రచించిన సందర్భ ములు తుమ్మలవారి కవితలలో కొన్ని కన్పిస్తాయి. తమ పుట్టినూరు, అచ్చమైన పల్లెటూరు అయిన కావూరును 'ప్రచలిత స్వాతంత్ర్య రణవీర కాహళీ రుతిరాణ్ముహుర్ముహు ర్ముఖరితంబు' అంటూ సాగే సీసపద్యంలో సంస్కృత సమాసభరితంగా వర్ణించారు.

మసృణ మకరందధారా
విసృమర పుణ్యప్రబంధ విరచన పరితః
ప్రసృణ ప్రథా మహిష్ఠులు
రసజీవులు సుకవులుందురా యీ సరణిన్
(పతిగపంట పుట 126)

వంటి కందపద్యాలు.

'లలిత కర్ణాటగాన కలా సరస్వ
తీ సవిత్రీ సమర్చనాదీనవృత్తి'

అంటూ సాగే గీతపద్యాలు కొన్ని కన్పిస్తాయి. ఇవి భాషపై శబ్దంపై వారికి గల అధికారాన్ని, ప్రయోగ సామర్థ్యాన్ని, సమగ్ర పాండిత్యాన్ని ప్రతిబింబిస్తాయి. ఒక ప్రాచీనాంధ్రకవి ముచ్చటపడి ఒక సంస్కృత రచనలో ఆటవెలదికి కూడ స్థానాన్ని కల్పించాడు.

తుమ్మలవారు రచించిన ఉపజాతులలో ఆటవెలదులే అధికము. 'తగిన శయ్య, నొయ్యారములు గులుకు నాటవెలది కవుల నీటుకొలది' అని, 'అలతి యలతి నుడుల నలరు తెలుంగున కాటవెలది మిగుల నందగించు'నని, 'తెలుగునోటి కాటవెలదిబోటి' అని వారికి ఆటవెలదిపై అభిమానము. తుమ్మలవారి ఆటవెలదుల అందాలను శ్రీ సి. హెచ్. వెంకటరత్నంగారు స్రవంతి ఆగష్టు 87 సంచికలో విశ్లేషించి చూపించారు.

తుమ్మలవారు 7 గేయాలను రచించటం ఒక విశేషముగా చెప్పవచ్చును. వీటిలో ప్రశస్తమైనది రాష్ట్రగానములోని గేయము.

తెనుగుతల్లీ! నీకు జోహారు
దేశమాతా! నీకు జేజేలు

నినుఁ జూచి నినుఁ బాడి నినుఁగొల్చువేళ నా
కనులాణి ముత్యాల గనులుగా నగునహో!

అంటూ ప్రారంభమై

కుటిల శాత్రవకోటి గుండెలో నిదురించి
యిటుసేతు వటుగంగ యెల్లగా జగమేలె
నటరాజ కంధరా నైల్యమ్ము నడఁగించు
పటుకీర్తి పెంచె నీ పట్టి యెంతటివాఁడొ

అని సాగుతున్నప్పుడు మేను పులకరిస్తుంది. ద్విరదగతి రగడలో సాగిన యీ గేయంలో యతి, ప్రాసలు చక్కగా పాటింపబడినవి.

'నిండెనురంగా కెనుబది
రెండేడులు జీవితమున
నేడుసైత మీతనిలో
నెఱజవ్వన మున్నదేమి'

అంటూ సాగే కదంబకైతలోని 'రంగా' (పుట 83) అన్న ఖండిక, అదే సంపుటంలోని సంక్రాంతి, (పుట 89) యుగాది మాట (పుట 90) గేయాలు, పైరపంటలోని గేయము హయ ప్రచార రగడ ఛందస్సులో రచించబడినవి. కదంబకైతలోనే ఒక గేయరూపకము కూర్చబడినది.

మహాత్మకథలో 'వైష్ణవజనతో' అన్న గుజరీకీర్తన శరషట్పదీ ఛందములో తెనిగించబడినది.

తుమ్మలవారికి గర్భకవిత్వంమీద అంతగా మక్కువ ఉన్నట్లు కనిపించదు. వారి తొలి కృతులలో ఒకటయిన 'నామ దేవ చరిత్రము'లో ఒక మత్తేభ కందగర్భిత సీసపద్యము కన్పిస్తుంది. ఇది తప్ప వారి రచనలలో గర్భకవిత్వం మరి కన్పించదు. కాని వారి పద్యాలలో కొన్నింట దీని ఛాయలు గోచరిస్తాయి. గీతాదర్శములోని యీ క్రింది తేటగీతి (18-43) పాదాలను గమనించండి.

శూరతయును దేజమ్మును ధీరతయును
దక్షతయు రణస్థిరతయు.........

దీనిని కొద్ది మార్పులతో కందంగా వ్రాయవచ్చును.

శూరతయును దేజమ్మును
ధీరత దక్షతయు రణస్థిరతయు....

'నిండెను రంగా వెనుబది రెండేడులు జీవితమున' అన్న రగడ పాదాలు కందపద్య పాదాలుగా కూడ సరిపోతాయి.

చిత్రకవిత జోలికి తుమ్మలవారు పోలేదు. యమకము, అనుప్రాసలు కొద్దిగా కన్పిస్తాయిగాని ఏకాక్షరి, ద్వ్యక్షరి, నిరోష్ఠ్యాలు, బంధకవితలు వీరి రచనలలో కన్పించవు. ఆలంకారికులు కవితాత్మలుగా చెప్పిన ధ్వని, రీతి, వక్రోక్తులు తుమ్మలవారి కవితలలో ప్రముఖంగా కన్పించవు, ఇక, అలంకారాల ఆడంబరాలు కూడ తక్కువే. ఇవేవీ లేని కవితలో చక్కదనము ఏముంటుంది? అనిపిస్తే వారి పద్యమే సమాధానంగా కన్పిస్తుంది.

కవిత చక్కఁదనము గరిత చక్కఁదనము
కోటికోటి గతులఁ గుల్కఁగాన
నిలకుఁ గాళిదాసుఁడే మహాకవి కాఁడు
రతియె సోయగంపు రాశికాదు.

అక్షర లక్షలు విలువచేసే పద్యమిది. తుమ్మలవారి కవితా కన్య సహజ సౌందర్యవతి. ఒప్పులకుప్ప. వారి కవితలలో అన్వయక్లిష్టత, అస్పష్టత మచ్చుకైనా కన్పించవు. యతిప్రాసలకు తడుముకొనే పనిలేదు వారికి. సాధారణ పాఠకుడు కూడ సులభంగా అర్థం చేసుకొనే శైలి వారిది. అది, గంగాప్రవాహంలా నిర్మలంగా, నిరాడంబరంగా, గుంభనగా, ధారాళమైన శయ్యతో సాగిపోతుంది. ఈ విధమైన శైలిలో కవిత వ్రాయటము కవికి కవితపైగల అత్యున్నత అభిరుచికి నిదర్శనము. ఇటువంటిదే నిజమైన కవిత. శబ్దాల గారడీతో, అలంకారాల తళుకులతో, వ్యంగ్య వైభవాన్ని, ప్రతీకలను ప్రదర్శించేదే కవిత్వమను అభిప్రాయము దురభిప్రాయమే. నిజమైన కవితను అలంకార శాస్త్రము మట్టుపెట్టినదని పరిశీలకులనుమాట సత్యమైనది. అట్లని పొడిమాటలు కవిత్వము కాజాలదు. కవికి కావలసినది భావుకత, తుమ్మలవారిలో ఇది పుష్కలముగా నున్నది. కర్షకుని నైపుణ్యాన్ని, జీవితాన్ని గూర్చిన ఈ పద్యమును చూడండి.

మేఁడి నడిమి గిత్త త్రాడు చేకొని మహా
యోగి వోలె దృష్టి నునిచి కాఁపు
కొండ్ర వేయ గోటి కొనసాటి వంకలే
దాయె నతని బ్రతుకు నందువోలె.(పైరపంట పుట 72)

ఈ చిన్నపద్యం ఎంతటి ఆలోచనను రేకెత్తిస్తుందో, ఎంతటి అనుభూతితో హృదయాన్ని నింపుతుందో, ఎటువంటి చిత్రాన్ని మన కళ్ళముందుంచుతుందో మాటలలో చెప్పలేము.

ఈ గోడ యిసుక సున్నము
యోగించిన వస్తువనుచు నూహింపకుఁడీ
ప్రేగులు మూగెడి పేదల
మైఁగల రుధిరాస్తులిట్లు మనకుందోఁచున్

అంటూ వెలగలేరు అవధానములో 'గోడ'ను గూర్చి చెప్పిన కవిత, 'పళిగవంట'లో చుక్కలను వివిధంగా వర్ణించిన తీరు, సంక్రాంతి కవితలు, ఇంకా ఎన్నో ఘట్టాలు తుమ్మలవారి భావుకతకు చక్కని నిదర్శనాలుగా కనిపిస్తాయి.

తుమ్మలవారి కథాకథనం చిత్రమైనది. అనగా అనగా ఒక రాజు అన్న రీతిలో కథను ప్రారంభించి, చివరివరకు పాఠకులకు ఆ రాజెవరో చెప్పరు. ఆ వ్యక్తి గుణగణాలను గ్రహిస్తూ, ఇంతటివారెవరబ్బా అను ఉత్కంఠతో పాఠకుడు తుదివరకు చదివినపుడుగాని అసలు వ్యక్తి గోచరించడు. 'ఆయన వయస్సు వింశతిహాయనముల మించ'దని ప్రారంభించి చివర 'అహో! మత్పిత యతఁడు' అని ముగించిన తన తండ్రి కథ,(నా కథలు-హరిభక్తి) కబలలోని వినోబాను గూర్చిన కవితాఖండిక, జ్ఞానస్నానము, కల్ల నిజమైనది (నా కథలు) ఖండికలు ఇందుకు చక్కని ఉదాహరణలు.

తుమ్మలవారు ప్రాచీనాంధ్ర కావ్యాలను చక్కగా అధ్యయనము చేసినవారు. ఆయా కవుల కవితారీతులను ఆకళింపు చేసుకున్నవారు. నన్నయ, తిక్కన, శ్రీనాథుల కవితారీతులు వారిని బాగా ప్రభావితం చేశాయి. తమ కవితలో ఆయా కవుల పోకడలను చూపించారేకాని వారి పద్యపాదాలను యథాతథంగా ఎక్కువగా అనుసరించలేదు.

ఎల్లవారు నెఱుఁగ నొల్లని ధర్మవు
బేల నీకుఁ దెలుప నేల వలసెఁ
జిఱుతవాని కింత దఱుసంటి పలుకులు
సన్నె? వృద్ధజనము లున్న చోట.

అన్న నన్నయ పద్యమునకు తామెంత మురిసిపోయారో తుమ్మలవారి

బొట్టు బలిసి నేఁడు విఱ్ఱవీఁగుచున్న
సాహుకార్ల యాట సాగదిల్లె
రుద్రమూర్తియై దరిద్రుండు చిచ్చఱ
కన్ను విప్పి గజ్జె గట్టునెపుడొ.

అన్న పద్యానికి 'అంతకెక్కువ' మురిసిపోయినట్లు వేటూరివారు ధర్మజ్యోతి తొలిపలుకులో వ్రాశారు.

ధర్మవును శమనుండు భూతమ్ములైదు
నంతరాత్మయు నమృతాంశుఁ డర్యముండు
శ్రుతులు సంధ్యలు రే పవల్ సూచు నరుని
పోకడల నన్నపల్కు మతాకుమన్న

అన్న ధర్మజ్యోతిలోని మరొక పద్యము (పుట 40) నన్నయగారి యీ క్రింది పద్యానికి పునఃసృష్టి.

విమల యశోనిధీ! పురుషవృత్తి మెఱుంగుచునుండుఁ జూవె వే
దములును బంచభూతములు ధర్మవుసంధ్యలు నంతరాత్మయున్
యముఁడును జంద్రసూర్యులు నహంబును రాత్రియు నన్మహాపదా
ర్థము లివియుండఁగా నరుఁడు దక్కొన నేర్చునె తన్ను ద్రుమ్ముచ్చిలన్.
భార-1-4-80

తిక్కన కవితను తుమ్మలవారు ప్రత్యేక శ్రద్ధతో అధ్యయనము చేశారు. ఆ కవిత వారి రచనా వ్యాసంగము నెంతగా ప్రభావితము చేసినదో వారికి గల 'అభినవ తిక్కన' బిరుదు వలన గ్రహింపగలము. తుమ్మలవారి కవితలో "అర్థమును బట్టి పదములు, పదములలో లీనమైనకీతిని యతిప్రాసములు సునాయాసముగ, నప్రయత్నముగ, స్వచ్ఛందముగ వచ్చి చేరుచుండును. ఈ సిద్ధియందుఁ బ్రసిద్ధుఁడు తిక్కన. ఈ మార్గమునఁ దిక్కనతో సజాతీయుడై నవాఁడు మన చౌదరి" అని అభిప్రాయపడి పండితులు, పెద్దలు వారికి 'అభినవ తిక్కన' అను బిరుదునిచ్చి గౌరవించారు. విషయ మిట్లుండగా ఇటీవల (స్రవంతి డిసెంబరు 1987 సంచికలో) వారి ఆత్మార్పణమును గూర్చి వ్రాస్తూ డా. వెలువోలు నాగరాజ్యలక్ష్మిగారు 'ఈయన వచన రచన తిక్కనగారి వచన రచనను తలపింపజేస్తుంది. అందువల్ల 'అభినవ తిక్కన' అనే బిరుదు లభించినదని వివరించుట ఎంతో విచారకరము దురదృష్టము. తుమ్మలవారి రచనలలో వచనములు కేవలము 8.28 శాతము. ఇవి కూడ ప్రధానముగా మూడు కావ్యములలోనే కన్పిస్తాయి. మరి, నాగరాజ్యలక్ష్మిగారు పై మాటలనెలా వ్రాశారో అర్థము కాదు. వచన రచనలో తిక్కనను తలపింపజేయునది వీరేశలింగము పంతులు గారు. వారికి గద్యతిక్కన అన్న బిరుదమున్నది.

శ్రీనాథుని రచనలు తుమ్మలవారినెంతో ఆకట్టుకున్నాయి. 'శబల'లోని అనేక పద్యాలు-కర్ణాటీనవ హీరహారము.... అరుణమయూఖ బింబ ముదయాద్రికిఁ జేరకమున్నె ........ ఇత్యాదులు శ్రీనాథుని పద్యములను తలపింపజేస్తాయని విశ్వనాథవారు చక్కగా వివరించారు. తుమ్మలవారి ఇతర రచనలలో శ్రీనాథుని పద్యములను తలపుకు తెచ్చు పద్యములు మరికొన్ని కలవు. మచ్చుకు రెండు:

నిట్టనిలుచుండి చూచె నిర్నిమిషదృష్టి - కాశీ. 1-119
నిట్టనిలుచుండి బోయ నిర్నిమిషదృష్టి - ఆత్మార్పణము 52 పద్యము

వండుచున్నార మనె నొక్క వనజనేత్ర
తిరిగి రమ్మనె నొక్క లేఁదీఁగెఁబోఁడి
దేవకార్యంబు నేఁడనెఁ దెఱవయోర్తు
ద్వాఃకవాటంబుఁ దెఱవదు వనిత యొకతె. కాశీ.7-137

వంట యగుచున్నదనె నొక్క యింటి మగువ
మరల రమ్మనె నొక్క మందిరపులేమ
నేఁడు వీలు గాదనె నొక్క నెలవు నెలఁత
మెతుకు నిప్పుచ్చమయ్యె నయ్యతికి నపుడు.
కదంబకైత

తుమ్మలవారి రచనలు సమకాలికులను ప్రభావితం చేశాయి. 'నాదు పలనాఁడు మేలిగొనాల గూఁడు' అన్న వారి పద్యపాదము (రచన 1934. పఱిగపంట) దాశరథిగారి 'నా తెలంగాణ కోటి రత్నాల వీణ' అన్న ప్రసిద్ధ పద్యపాదానికి ప్రేరణగా చెప్పవచ్చును.

తుమ్మలవారి కవితలలో జాతీయాలు తరచుగా కన్పిస్తాయి. వారికి బాగా ఇష్టమైనవి పండ్లు పులియజేయు, చెట్టున కుట్టిగట్టు, గ్రుడ్డిలో మెల్ల, నీరునములు , బుద్ధి గడ్డి తిను,

వేన్నీళ్ళకు చన్నీళ్ళు మొదలైనవి. వారి రచనలలోని జాతీయముల నెత్తిచూపుట సముద్రమున కేతామెత్తటమే.

కవిగా తుమ్మలవారిలో గల ఒక విశిష్ట గుణము, ఒక గొప్పదనము వారి పద్యసంస్కరణాభిలాష. వ్రాసిన కవితకు మెఱుగులు దిద్దటము కవుల కలవాటే అయినప్పటికి తుమ్మలవారిలా స్వీయపద్యములను బహుధా సంస్కరించిన తెలుగుకవి మరొకరు లేరేమో. ప్రాచీనకాలంలో కావ్యాన్ని అంకితమిచ్చి బహిర్గతం చేసేలోపే యీ సంస్కరణ జరుగుతూ ఉండేది. కావ్యాలకు ప్రతులు వ్రాయబడి ప్రచారమైన పిదప కవికి ఆ పద్యాలను సంస్కరించే అవకాశమున్నప్పటికి వాటికి తగిన ప్రచారము కల్పించుట సులభసాధ్యము కాదు. కాని యీనాడు ప్రతి పునర్ముద్రణకు సవరింతలు చేర్చి ప్రచారమునకు తెచ్చుట కవకాశమున్నది. దీనిని తుమ్మలవారు పూర్తిగా వినియోగించుకున్నారు.

వ్రాసినది సవరించు నభ్యాసమెపుడు
లేదు నా కను కవినెట్టు లాదరింతు
గణము లిమిడిన యంతన కైతయగునె
యౌచితీ శౌచముఖదీప్తు లమరకున్న (నేను, పుట 4)

అన్నది వారి విశ్వాసము. దీని కనుగుణముగానే వారి కవితలలో ఎన్నో సవరింతలు కన్పిస్తాయి. దీనికి చక్కని ఉదాహరణ వారి భజగోవిందం అనువాదము. భజగోవిందమును అనువదించి 1924 సంవత్సరాది సంచికలో మొదట ప్రకటించారు తుమ్మలవారు. తరువాత దీనిని ప్రత్యేక గ్రంథంగా కూడా ప్రకటించారట. ఆ తరువాత పఱిగపంటలో ఇది ప్రకటించబడినది. పై ప్రత్యేక గ్రంథము, 1943నాటి పఱిగపంట తొలికూర్పు నాకు లభించలేదు. 1952నాటి పఱిగపంట పునర్ముద్రణ ప్రతిలో ఈ అనువాద పద్యాలు సంస్కరణలతో కన్పిస్తాయి.

సంవత్సరాది సంచికలో ప్రకటించబడిన తొలి పద్యమిది :

అరరే! యెంత వివేకహీనుఁడవు లోకాధారు గోవిందునిన్
గరుణా సాగరు సంస్మరింప వకటా! కాలుండు నీ ప్రాణమున్
నరగన్ దీయుచు నున్నకాలమున లేశంబైన నిన్నీ 'డుకృఞ్
కరణే' పాఠము రక్షసేయ దిది నిక్కంబోయి మూఢాత్ముఁడా!

పఱిగపంటలో దీని రూపురేఖలే మారిపోయినవి. మత్తేభము అందమైన కందమైనది.

గోవిందప్రభు సంతత
సేవావ్రతమూను మితర చింతనమేలా
పైవచ్చుఁ డెత్తినతఱి
గావదురా శబ్దశాస్త్ర కౌశల మజ్ఞా!

పై మొదటి పద్యములో లేని బిగువు ఈ కందపద్యములో కొట్టవచ్చినట్లు కన్పిస్తున్నది. సంవత్సరాది సంచికలో 27 భజగోవింద శ్లోకానువాదాలతోపాటు 4 శేషశ్లోకానువాదాలు కూడ కన్పిస్తాయి. ఈ శేషశ్లోకానువాదాలు పఱిగపంటలో కన్పించవు. పై ఇరవైయేడు శ్లోకానువాదాలలో సంస్కరణకు లోనుకాని పద్యము ఒక్కటి కూడా కన్పించదు. పఱిగపంటలోని మెఱుగు పరచబడిన పద్యాలు సంవత్సరాది సంచికలోని పద్యాలకంటె మనోజ్ఞంగా ఉన్నాయి.

1936లో ప్రకటించబడిన ఆత్మకథ తొలిభాగములోని తొలి పద్యము 1951నాటి ఆత్మకథ సంపూర్ణ గ్రంథములో సంస్కరింపబడినది.

**1936నాటి పద్యము**

ఎవ్వని కొల్వు భద్రములకెల్ల నిదానము; ప్రేమమూర్తియై
యెవ్వఁడు సర్వలోకముల నేలుచునుండు నెవండు శాశ్వతుం
డెవ్వఁడు వాఙ్మనఃక్రియల కేర్పడరాని మహాత్ముఁ డీశ్వరుం
డెవ్వఁడు నిత్యహర్షనిధి యెవ్వఁడు వాని భజింతు నిచ్చలున్.

**1951నాటి పద్యము**

ఎవ్వని కొల్వు భద్రములకెల్ల నిదాన ముదార తామయుం
డెవ్వఁడు సర్వలోకముల నేలు మహఃపరిపూర్ణమూర్తియై
నెవ్వడు వాఙ్మనః క్రియల కేర్పడరాని మహాత్ముఁ డాద్యుఁడై
యెవ్వఁడెసంగు సత్యమన నెవ్వఁడు వాని భజింతు నిచ్చలున్.

ఆత్మకథ కృత్యాదిలో 1951 ప్రతిలోగల మేనల్లుడు నరసయ్య ప్రసక్తి 1936 ప్రతిలో కన్పించదు. 1936 ప్రతిలో గల

తప్పొప్పు లెఱుంగక యిది
తప్పనినన్ వినక చొప్పదంటు కపితముల్
సెప్పుచు విద్వత్సదములఁ
జప్పట్ల న్మనిఁగి తేలు చవటలుఁ గవులే

అన్న కుకవి నిందాత్మకమైన పద్యము 1951 ప్రతిలో కన్పించదు. ఈ మార్పుచేర్పులు కవి కవితాసాధనలో ప్రగతికి, మానసిక పరిపక్వతకు నిదర్శనములు.

**1938**లో వ్రాసి, **1942**లో గ్రంథరూపములో ప్రకటించిన ధర్మజ్యోతిలోని ఒక సీసపద్యమును సుమారు **46** సంవత్సరముల తరువాత ఆ గ్రంథము నాల్గవ కూర్పులో- **1984**లో-తుమ్మలవారు సవరించటం ఎంతో ఉత్కంఠతను కలిగిస్తుంది. ఒక సుప్రసిద్ధ కవి తాను వ్రాసిన ఒక పద్యాన్ని **46** సంవత్సరాల సుదీర్ఘకాలము గడిచిన తరువాత సంస్కరించటం సాహిత్య చరిత్రలోనే అపూర్వ విషయము. ధర్మజ్యోతి తొలికూర్పులోని ఆ పద్యమిది:

ఏ వంశమునఁ బుట్టె నిద్ధాంధ్ర సామ్రాజ్య
    ధౌరేయ బాహుప్రతాపరుద్రుఁ
డే వంశమునఁ బుట్టెఁ గృష్ణరాయ క్షమా
    భృచ్ఛమూనేతృ రావెళ్ళమల్లఁ
డే వంశమునఁ బుట్టె హేరాళ దాతృతా
    వీరతా భ్రాజిష్ణు వేంకటాద్రి
యే వంశమునఁ బుట్టె సేవాసమంచితా
    రంభ కుంభత్సూర్య రాఘవుండు
ప్రకృతి పరమ రహస్య శోభా విభూతి
వేతృ శతశిల్పి నరసింహవీరుఁ డుద్భ
వించె నేవంశమున దాని వింద్రు మీరు
క్రొత్త కొనియాటలేల తత్కులము పెంపు

**1984** మే నెలలో ప్రచురింపబడిన ధర్మజ్యోతి 4వ కూర్పులో గల పద్యమిది.

ఏ వంశమునఁ బుట్టె నిద్ధాంధ్ర సామ్రాజ్య
    ధౌరేయ భుజుఁడు ప్రతాపరుద్రుఁ
డే వంశమునఁ బుట్టెఁ గృష్ణరాయక్షమా
    భృచ్ఛమూనేత రావెల్లమల్లుఁ
డే వంశమునఁ బుట్టె హేరాళదాతృతా
    వీరతా విభ్రాట్టు వేంకటాద్రి
యే వంశమునఁ బుట్టెఁ గృతసంఘహితజనా
    గ్రణి సూర్యదేవర రాఘవుండు
సారధీ రాశి శతశిల్పి నారసింహ
నాయఁడే వంశమున బుట్టె నా యుదాత్త
వంశమున్ గని తనియనివారు లేరు
సేతు శీతాచలాంతర క్ష్మాతలమున.

తమ కవిత జనరంజకముగా, నిర్దుష్టంగా ఉండాలనే అభిలాషే తుమ్మలవారిని యీ సంస్కరణలకు ప్రేరేపించినది. కవి బ్రతికున్నంతవరకు తన కవితకు మెఱుగులు పెట్టాలనే ఆశించుతాడని అంటారు వారు. పూర్వ ముద్రణ గ్రంథములలోని తమ కవితలకు చేసిన దిద్దుబాట్లను వారు పునర్ముద్రణ పీఠికలలో కొంతవరకు ప్రస్తావిస్తున్నారు. రాష్ట్రగానములోని పద్యములలో కొన్ని దిద్దుబాట్లు, మార్పులు చేర్పులు జరిగినవని, ఆ పద్యములలో గల శ స ప్రాస, వద్దు, కద్దు వంటి వ్యవహార రూపాలను ఇప్పుడు మన్నింపజాలనని స్పష్టపరిచారు. తుమ్మలవారి స్వీయ పద్య సంస్కరణలను గూర్చి విపులముగా పరిశీలించవలసిన ఆవశ్యకత కలదు.

తుమ్మలవారి కవిత వీరరసప్రధానమైనది. వీరము దాన, ధర్మ, దయా, యుద్ధ భేదాలతో నాలుగు విధములుగా కనిపిస్తుంది. ఈ భేదాలను స్థూలంగా ఇలా వివరించవచ్చును.

"దాన, దయా, యుద్ధాలకు ప్రత్యేక పరిస్థితులు అవసరమవుతాయి. దానం చేయటానికి అర్హత కలిగిన పాత్ర ఉండాలి. దీనపురుషుడు దయావీరానికి ఆలంబన మవుతాడు. బద్ధవైరం ఏదైనా ఏర్పడినప్పుడే యుద్ధ ప్రసక్తి వస్తుంది. కాని ధర్మవీరానికి అలాంటి అవసరమేదీ లేదు. స్వధర్మాన్ని పాటించటంలో ఉత్సాహం చూపించటం ధర్మవీర మవుతుంది. కష్టాలలో ఉన్న సాటి మనుషులను ఆదుకోవటం ధర్మం. ఆకలితో నకనకలాడుతున్న మనిషికి పట్టెడన్నం పెట్టటం ధర్మం. ఆపదలో ఉన్న అబలను కాపాడటం ధర్మం. సంసారాన్ని ఒడుదుడుకులు లేకుండా రాకుండా సాగించటం స్త్రీ పురుష ఉభయుల ధర్మం. బిడ్డలు సన్మార్గంలో నడిచేటట్టు చూడటం పెద్దల ధర్మం. పెద్దలను గౌరవించటం పిన్నల ధర్మం. ప్రతి వ్యక్తిలోనూ ఇప్పుడు పెంపొందవలసింది ఇలాంటి ధర్మవీరం" (ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక **17-2-1988**నాటి సంపాదకీయము).

తుమ్మలవారి కవిత ధర్మవీరాన్ని ప్రధానముగా ఆశ్రయించినది. ధర్మజ్యోతిలో ఈ ధర్మవీరము చక్కగా పోషించబడినది. ఆత్మకథ, మహాత్మకథ, గాంధిగానములు ధర్మవీరుడైన గాంధి చరిత్రాత్మకములు. వీటిలో వీరరసముతోపాటు కరుణ, రౌద్ర రసములు కూడా లెస్సగా పోషించబడినవి. 'దీక్షా కంకణమున్ ధరించి జనయిత్రీ దాస్యవిచ్ఛేదనాపేక్షల్ పొంపిరివోవ ముజ్జగము కంపింపంగ లేచెందు' అని ప్రబోధించే రాష్ట్రగానములో ధర్మవీరము యుద్ధవీరముతో కలిసి ప్రవహిస్తున్నది. అయితే ఈయుద్ధవీరము ఉద్యమాత్మకమైనదే కాని బాహాబాహి రణాత్మకమైనది కాదు.

ఎక్కట్లు, సందేశ సప్తశతి, సర్వోదయగానము, మరెన్నో ఖండకవితలలో స్వధర్మాచరణకై చేసే ప్రబోధము కన్పిస్తుంది. ఇది కూడ ధర్మవీరాన్ని ఆశ్రయించినదే.

వీరరసం తరువాత తుమ్మలవారి రచనలలో కన్పించేది కరుణరసము. ఆత్మార్పణము, అమరజ్యోతి కావ్యాలు కరుణ రసాన్వితాలు. రసరాజమని పేరుగాంచిన శృంగారాన్ని తుమ్మలవా రాదరించలేదు. నామదేవచరిత్రము, మాహేంద్ర జననమువంటి తొలినాటి రచనలలోను, 'సంక్రాంతి'వంటి ఖండ కవితలలోను గల శృంగారము గణనీయమైనది కాదు. శృంగార రసాత్మకంగా మీరు కవితలను వ్రాయలేదేమి అని ప్రశ్నిస్తే 'అటు పోలేదు బుద్ధి' అని వారి జవాబు. హాస్యాదులు తుమ్మలవారి కవితలలో అంతగా కన్పించవు.

తుమ్మలవారిది సలక్షణమైన గ్రాంథికభాష. చిన్నతనం నుండి సంప్రదాయబద్ధంగా కవితాధ్యయనం చేసినవారు కావటము వలన, శ్రద్ధాసక్తులతో గురుముఖతః విద్య నభ్యసించినవారు కావటము వలన, సంస్కృతాంధ్ర సాహిత్యాలు తప్ప ఇతర భాషా సాహిత్యాలతో ముఖ్యంగా ఆంగ్లభాషా సాహిత్యాలతో ప్రగాఢ పరిచయము లేకపోవటము వలన వీరు కేవలం సంప్రదాయ కవిగా నిలిచిపోయారు. తమ జీవితకాలంలో ఎన్నో కవితోద్యమాలు పుట్టి పెరిగినా, ఏవీ వీరి నాకర్షించలేదు. ఏ ఉద్యమము వీరిని ప్రభావితము చేయలేదు. తమదైన ఒక ప్రత్యేక మార్గములోనే వీరి కవితారథం పరుగులు తీసింది.

ఎవ్వతెంద తెంత దవ్వైన నేను భా
షా విపర్యయమ్ము సైపలేను
సాధుశీలమాభిజాత్యమ్ము చెలువమ్ము
ననపి మెఱయు వనిత నాదు కవిత. (నేను పుట 21)

అని కంఠోక్తిగా చెప్పగలిగారు.

తొలినాటి వీరి రచనలలో కొన్ని వ్యాకరణ విరుద్ధ ప్రయోగము లున్నప్పటికీ, క్రమముగా వీరి కవితాభాష నిర్దుష్టమై ఒక అధికారికతను సంపాదించుకొన్నది. శబ్ద ప్రయోగాన్ని గూర్చిన చర్చలలో తుమ్మలవారి ప్రయోగము లభించితే, తుమ్మలవారు ప్రయోగించారు కనుక సాధువే అన్న స్థూలమైన నిర్ణయానికి పండితలోకము వస్తున్నది. భాషావిషయకమైన సందేహము లున్నప్పుడు 'బ్రదికినన్నాళ్ళు విద్యార్థి పగిదినుంట, వలయునని విశ్వసించెడి'వారు గనుక ఆ సందేహములను నివృత్తి చేయగల సమర్థుల నాశ్రయించి వాటికి తగిన సమాధానములను పొందెడివారు. 'చౌదరిగారు నిర్దుష్టమైన సుష్ఠుభాష వ్రాసెడి కొలఁదిమందిలో నొకఁడు' అని విశ్వనాథవారు పేర్కొనటం గమనార్హము. (శబల పీఠిక).

తొలినాటి రచనలలో కొంత సంస్కృత భాషాధిక్యత ఉన్నప్పటికి క్రమంగా దానిని తగ్గిస్తూ తెలుగుకు పెద్దపీట వేశారు. 'గీర్వాణ మెంత నీల్గిన జిబ్బిలి తెలుంగు, నుడిసొంపు నకు దిగదుడుపు' అని భావించారు. ఈ తెలుగుముద్రకు వారికి తిక్కన, చిన్నయసూరి రచనలు మార్గదర్శకములు. 'తెనుగుబాస యందే యింత యదికాదరము కలవారు నేటి కవులలో లేరు' అని సమకాలికులచే ప్రశంస లందుకొన్నారు. 'తెనుగులెంక'గా రూపొందారు. తెలుగు పదాలకు, నుడికారానికి పునరుజ్జీవనము కల్గించటమే కాక ఎన్నో అన్యదేశ్యాలను తెలుగు పదాలుగా మార్చి ప్రయోగించారు. ఈ మార్పుకై మొదట సంస్కృతాన్ని ఆశ్రయించినా, క్రమంగా అచ్చతెనుగునే ఆశ్రయించారు. కొన్ని ఉదాహరణలు గమనిద్దాము. టిక్కెట్టు=ప్రయాణ పత్రము, బ్యాంకి=వాణిజ్యకోశము, అడితిబొక్కసము. తుపాకి=లఘునాళిక. ఫిరంగి = బృహన్నాళిక. కోర్టు = తీర్పునెలవు, పాడివట్టు. అటెండెన్సు రిజిష్టరు=రాకరాముల పట్టిక. సిమెంటు=అొచూరు. ఫోటో=నీడబొమ్మ. హోటల్=చిఱుతిండిసాల. కొన్ని ప్రసిద్ధ సంస్కృత పదాలకు, గ్రామనామాలకు వీరు సృష్టించిన పర్యాయపదాలు కొంత తికమకను కలిగిస్తాయి. ఉదా॥ న్యాయాధికారి=ధర్మదాత. సంక్రాంతి=మకరార్కము. చందోలు=ధనదుపురము, అర్థపతివీడు. వేటపాలెము=మృగయాపురి-ఎన్నో సంస్కృత పదాలకు అచ్చతెనుగు రూపాలను చూపించారు. ఉదా॥ వ్యాకరణము=నుడితీర్పు. ఏ భాషా పదానికైనా అచ్చ తెనుగు రూపాన్ని చూపవచ్చునని నిరూపించారు. తెనుగు భాషకు వీరు చేసిన సేవ విలువ కట్టలేనిది. వేనోళ్ళ ప్రశంసింపదగినది.

తెలుగుభాషపై తుమ్మలవారికి ప్రత్యేకాభిమున్నదిగాని పరభాషలపై ద్వేషభావము లేదు. నిత్యవ్యవహారములో గల ఎన్నో ఉర్దూ, హిందీ, ఆంగ్ల పదాలను వారు సందర్భోచితంగా విరివిగానే ప్రయోగించారు.

తాము ప్రయోగించిన మారుమూల పదాలకు, నిర్మించిన నూతన పదాలకు గ్రంథమున లఘుటీకలో వివరణనిచ్చి పాఠకులకు భాషాభిమానాన్ని పెంపొందింపజేయటానికి ప్రయత్నిస్తారు

తుమ్మలవారు. ఇది ఎంతో అభినందించదగిన విషయము. అయితే, తుమ్మలవారు ప్రయోగించిన కొన్ని పదాలు విపరీతార్థాలను, స్ఫురింపజేస్తున్నాయని, దానికి ఉదాహరణగా వారి 'గోవైద్యము' అన్న ప్రయోగాన్ని చూపించి శ్రీ గొల్లపూడి ప్రకాశరావు 'తెనుఁగులెంక తుమ్మల' అన్న గ్రంథం 121వ పుటలో ఇలా వ్రాశారు. 'గోవైద్యము అనగా గోవుకు చేయు వైద్యము అని యనిపించును. నేత్రవైద్యమని చెప్పనగాని తెలియదు. ప్రజలకీ పదములు అర్థము కానివని కవిగారికి గూడ తెలియును. అందుచే పుస్తకము చివర ఆ పదముల కర్థము నీయవలసి వచ్చినది' అని. ఈ వ్రాత ఎంతో విచారించదగినది. కవిత్వము అర్థము కావటము, కాకపోవటము పాఠకుని శక్తి సామర్థ్యాలనుబట్టి ఉంటుందన్న విషయము నిర్వివాదము గదా! శబ్దకాఠిన్యము గలిగిన కవిత సామాన్యునకు వ్యాఖ్యానము లేకుండ అర్థముకాదు.

వసుచరిత్రలో రామరాజభూషణుడు బ్రహ్మదేవుని 'గో లలనా వల్లభుడు' అని పేర్కొనినాడు. తగినంత నిఘంటు జ్ఞానము లేని పాఠకునకు ఈ గోశబ్దమున కర్థము తెలియదు. దానిని వ్యాఖ్యాత విప్పిచెప్పినపుడు లేదా నిఘంటువు ద్వారా ఆ శబ్దార్థమును గ్రహించినపుడు సాహిత్యాభిమానియైన పాఠకుడు ఆ భావాన్ని గ్రహించి ఆ ప్రయోగమున కానందిస్తాడు. ఇక్కడ తుమ్మలవారు తామే వ్యాఖ్యాత అయి తాము ప్రయోగించిన పదాలకు తామే అర్థమును విప్పిచెప్పినపుడు ఆనందించి కవితా మాధుర్యాన్ని ఆస్వాదించవలసినది పోయి విచారించుట దురదృష్టము. నిజానికి, తుమ్మలవారి కవిత్వములో అర్థముకానివి వారి పదప్రయోగములు కావు. ఆసక్తిగల పాఠకులు నిఘంటువుల ద్వారా ఆ శబ్దముల కర్థములను గ్రహించగలరు. కాని, వ్యాకరణ పాండిత్య మాధారముగా వారు చేసిన కొన్ని ప్రౌఢ ప్రయోగములు అంతంత మాత్రముగా అర్థముకావు.

తెల్లవాఁడు పోయె దేశంబునకు నింక
నవత వచ్చునని జనమ్ము పొంగ
నదియ వచ్చెఁగాని యరసున్నతో వచ్చి
కన్నకలల నిండుసున్న చేసె

దేశ స్వాతంత్ర్య సమరంలో ఏ కొంచెం పాలు పంచు కొన్నవారైనా, లేదా ఆ చరిత్రను అర్థం చేసుకున్నవారైనా ఈనాడు ఈవిధంగా భావించటములో వింత లేదు. ఈ పద్యం రెండవ పాదంలోని నవత సంస్కృత శబ్దము. దీనికి నూత నత్వము, క్రొత్తదనము అని అర్థము. దేశానికి స్వాతంత్ర్యము వస్తే క్రొత్తదనముతో జనము సుఖపడగలమని సంతోషించారు. మరి ఆ నవతే వచ్చినదట. కాని అది అరసున్నతో వచ్చినదట. ఈ అరసున్నగల నవఁత తెలుగుపదం. ఇది నవయుధాతువునకు కృదంతరూపము. నవయుట అనగా కృశించుట, దుఃఖించుట. అనగా ఆ స్వాతంత్ర్యానంతరం వచ్చిన క్రొత్తదనం దుఃఖాన్ని కలుగజేసేదిగా ఉన్నది అని భావం. దీనికి కారణం కన్నకలలను అది నిండుసున్న చేయటమే. ఈ పద్యంలో వ్యాకరణంలో కన్పించే అరసున్న, నిండుసున్న పదాలను ప్రయోగించటమే కాక, చెప్పదలచుకొన్న భావాన్ని వ్యాకరణాన్ని ఆశ్రయించి వ్యంగ్యంగా చెప్పటం జరిగింది. ఇది సాధారణ పాఠకునకు బోధపడటం కొంత కష్టమే!

ఉదయగానములోని ఈ పద్యాన్ని కూడా చూద్దాం.

తనకుఁ బనికిరాని తరువాంధ్రునకు నేఁడు
కల్పవృక్షమేని కలుపుమొక్క
యెద్దలై తెలుఁగు బిడ్డలు దొడ్డలు
తన్నుకొంద్రు కచటతపలవోలె.

ఈ పద్యంలోని 'కచటతపలవోలె' అన్న ఉపమానాన్ని తన్నుకొంద్రు అన్న క్రియాపద ప్రయోగంతో అన్వయించుకొని పద్యాన్ని అర్థం చేసుకోవటములో సాధారణ పాఠకుడు కొంత తికమక పడతాడు.

కచటతపలు వర్గప్రథమాక్షరాలు. ఇవి ఆయా వర్గాలకు నాయకులవంటివి. అయినా పరస్పర సఖ్యత లోపించినవి. భాషకు సహజ సౌందర్యాన్ని ఇచ్చే యతిప్రాసలలో ఒకదాని కొకటి పొత్తుకలపక తమ తమ ప్రత్యేకతలను నిలుపుకొనటం కోసం తన్నుకొంటుంటాయి. వాటి వాటి వర్గాక్షరాలతోటే యతులలో పొత్తుగలిగి ఉంటాయి. అలాగే తెలుగువారు ముఖ్యంగా ఒక వర్గానికి నాయకులైనవారు మరొక వర్గంవారితో పొత్తు కలపక వారి వారి వర్గీయులతో మాత్రమే పొత్తు కలుపుతూ పరస్పరం తన్నుకొంటుంటారని, ఇతరులెంత గొప్ప వారైనా దరిచేరనీయరని కవిగారి భావము. ఈ కోవకు చెందిన

అక్షరాలు తెలుగుభాషలో మరికొన్ని ఉన్నా వీటినే కవిగారు ఎన్నుకోవటములోని ఔచిత్యము అవి పరుషాలుగా ప్రఖ్యాతి గలిగిఉండటం కూడా.

తుమ్మలవారు పాఠశాలను వీడిన తరువాత కూడా ఉపాధ్యాయప్రవృత్తిని వీడలేదు. తమ కవితద్వారా విద్యార్థుల భాషాపాటవాన్ని మెరుగుపెట్టటానికి కృషిచేశారు. సందేశ సప్తశతిలో కొన్ని పద్యాలను ఈ పాఠాలకు వినియోగించారు. ఒక ఉదాహరణ గమనిద్దాం.

కవిత అల్లినవారలే ఘనులు గాదు
కఱవులకు దాసులైనారు కమ్మతీండ్రు
వాఁడె యుత్తమ ధీశక్తివంతుఁడనిన
బంతి బంతికి నెరసొండు పాదుకొనియె.

ఇందులోని మొదటి పాదములో క్రియాపద ప్రయోగము దోషము. 'వారలు....కారు' అనుట సాధువు. రెండవ పాదములోని కమ్మతీడు పదానికి బహువచన రూపము కమ్మతీలు. మూడవ పాదములోని సరియైన పదం శక్తిమంతుఁడు. ఈ విధంగా వారు పాఠకులకు సాధురచనాశక్తిని కలిగించే కృషి చేయటం ప్రశంసించదగినది. 'సాధురచనమ్ము కత్తిపై సలుపు సాము' అని భావించి ఆ సాములో కృతకృత్యులైనారు తుమ్మలవారు. భాషలో ఈ పదం కూడా ఉన్నది అని తెలియజెప్పటానికి వారు ఎన్నో పదాలను పనిగట్టుకొని ప్రయోగించి వాటికి పునర్జీవనము ప్రసాదించారు.

మొత్తముమీద తుమ్మలవారి కవితాకళ విశిష్టమైనది. ప్రత్యేకమైనది. సర్వస్వతంత్రమైనది. 'సర్వతంత్ర స్వతంత్రుఁడౌ సత్కవీంద్రుఁ డెన్నఁడో కల్పమున కొక్కఁడే లభించు' నంటూ ఒకరిని గూర్చి వారన్న మాటలు వారికీ అన్వయిస్తాయనటములో సందేహము లేదు.

---

# యాచకుడు

## శ్రీ అనంత వేంకటేశన్

నేను నీ తలపులలో తల్లీనమైన రేయి
ఎవరో తలుపు తట్టిన చప్పుడు!
అమృతం తాగిన ముఖంతో వచ్చి తలుపు తెరిచాను
నీవే!
నా ముంగిట నిలబడి చేయి చాచి యాచిస్తున్నావు!
నిరుత్తరుడనయ్యాను
నీ పాదాల వ్రాలి పసిపాపలా రోదించాను
పలకలేదు నీవు
యాచన మానలేదు!
"నేనేమివ్వగలవాడను ప్రభూ?" అని దీనంగా అడిగాను
చిద్విలాస మోముతో అలాగే నిలుచున్నావు!
"నీకర్పింప పవిత్రమైనది నావద్ద ఏమున్నది స్వామీ?"
అని నిన్నే అడిగాను
"ఇపుడు నాకోసం కార్చిన ఓ కన్నీటిబొట్టు" అన్నావు
ఆనందంగా కన్నీటితో నీ దోసిలి నింపాలని పొగిలి
పొగిలి ఏడ్వసాగాను
చిరునవ్వుతో చూస్తున్నావు!
వాటిలో ఒక్క చుక్క కూడ గ్రహించలేదు నీవు!
తెల్లవారే వేళయింది
నెమ్మదిగా నీ రూపు అదృశ్యమైపోతోంది!
ఆ క్షణాన అర్థమయింది నాకు—
నా దైన్యాన్ని తీసుకుపోవాలని వచ్చావని
మందమతిని! ఆనందాశ్రువుల్ని అందించాను
నీవులేని నా వాకిట నీ పునరాగమనాన్ని యాచిస్తూ
నేను నిలబడిపోయాను

(టాగూర్ 'గీతాంజలి' చదివిన ప్రేరణలో)

# ఆశలోనే...

*మూడు నామాలతో
ఏడుకొండల నన్నింటినీ వెలిగిస్తూ
కఱకురాతి బండలవంటి మనసులను కరగిస్తూ
మంచీచెడుల హెచ్చూ తగ్గుల
విచిత్ర సమ్మిళితాన్ని
అర్థంకాని మానవ కథనాన్ని
అద్భుతంగా చిత్రించి
బహు రమణీయంగా విరచించి
చిద్విలాసంగా నవ్వుకొంటున్నాడు తిరుమల తిరుపతి
అర్థంకాని రాయుడు!
సైకోట్రానిక్స్!?
"సోల్" - ఎలక్ట్రానిక్స్!?
ప్రశాంతం తరంగాలుగా విచ్చుకొంటూ
సముద్రంలా ఒకచోట!
నిశ్శబ్దం చిరుతపులిలా ఒళ్ళు విరచుకొంటూ!
గండుచీమల బారులా హారన్‌లు కొట్టుకుంటూ
కొండెక్కుతూ దిగుతూ అల్లరిచేస్తున్న నీలిరంగు బస్సులు!
కీచుకీచుమంటూ టర్నింగులు పల్లటీలు కొడుతూ!!
నిశ్శబ్దంగా ఒకడు నడుస్తూ వస్తున్నాడు
తలనీలాలు సమర్పించుకొని!
గోవింద శబ్దంతో మరొక్కడు మెట్లెక్కుతూ ఉన్నాడు
ముడుపులు కట్టుకొని!
గాలిగోపురంలోని గాలిని పీలుస్తూ ఒక భిక్షకత్తె
నిలువుదోపిడీ ఇచ్చినట్లుంది!
పారాణి పాదాల సిగ్గుల్ని క్రుమ్మరిస్తున్న చిన్నదాన్ని
ఓరకంట చూస్తూ ఒకడు
మ్రొక్కుబడి తీర్చుకోవాలని వచ్చినట్లుంది!
అంతా సంబరం!
అర్థంకాని అవగతంకాని సందోహం!
అయినా నవ్వుతునే ఉంటాడా రమేశుడు....
తిరునాళ్ళని చూస్తున్నట్టు!
తిలకిస్తూనే ఉంటాడా వడ్డీకాసులవాడు....
జుట్టుపోలిగాడి వెంపర్లాటను చూస్తున్నట్టు!

ఆసుపత్రిలో అర్థంకాని ఆత్రం
కొండకు దగ్గర దగ్గరగా!
మార్చువరీ వేదాంతం చెబుతుంది!
ఎన్నో మెదళ్లు కట్టుకొన్న అక్షరాల పిచ్చుకగూళ్లు
పుస్తకాల గదిలో చప్పుడు చేయకుండా కొండక్రిందే!
వేదం జ్ఞానభిక్ష పెడుతుంది!
కావుకావు మంటున్న కాకి టీ.వీ. ఆంటెన్నా మీద
ఠీవిగా కూచొని
పిల్లల అల్లరికి నొసలు చిట్లిస్తూ
వినుకొంటోంది నాయిస్ పొల్యూషన్‌ని!
ముద్దబంగారు కలశాలతో
నిగనిగలాడుతున్న గోవిందరాజస్వామి గోపురం
మేళాలు వినిపిస్తూ
స్వాగతిస్తోంది సెక్యులార్ రెలిజియాసిటీతో!
నక్షత్రాల మిరమిట్లు అధునాతన రెస్టారెంటు
సన్నని పాశ్చాత్య సంగీతాన్ని వినిపిస్తూ డబ్బును
డిస్కో దివానా! తినిపిస్తూ!
ఒకప్పటి తందానతాన!!
రైలు కూత వేస్తోంది
నేను కాలాన్ని వెళ్తున్నా వెళ్తున్నానంటూ!
ట్రాక్టరు డ్రుయ్ డ్రుయ్ అంటోంది
మీ కర్మకు మిమ్మల్ను వదిలేస్తున్నానంటూ!
ఆకాశం ఆరంజిగా అయ్యిందని బుజ్జి గోల
పెడుతున్నాడు
ఆకుపచ్చని చీరలో రామచిలుకలా ఉన్న నా భార్య
వెచ్చాలు వెచ్చాలు అంటోంది
ఆడకూతురెవరో స్నానం చేస్తుంటే
నా తమ్ముడు తొంగి తొంగి చూస్తున్నాడు!
ఎవర్రా అదీ! అన్న అరుపులు!!
మహావీరు టాకీసులో
అరిగిపోయిన రికార్డు వింటూ ఎవడో పిచ్చివాడు
పులి వేషం కాదు! కరాటే! గంతులేస్తున్నాడు!
హరోంహర అంటూ డప్పుల్తో ఒకచోట

క్రొత్త సినిమా రిలీజయిన బంపరు మోజులొకచోట!
అహా! తిరుపతి అద్భుతంగా ఉంది!
తిరుమల తిరుపతి దేవస్థానంవారి పరిపాలనా భవనం
అంతకంటే అద్భుతంగా ఉంది!
ఈ నగరానికి సాటి ఏది?
ఈ అల వైకుంఠపురానికి ధీటు ఏది?
అందుకే కాబోలు
నవ్వుతూ ఉంటాడా ఏడుకొండల వేంకటేశ్వరుడు!

ఆయనతోపాటే
నవ్వడం నేర్చుకొన్నాడు డాబామీద కూచొన్న ఈ
ఏమైతేనేం మధ్యతరగతి యువకుడు!
ఎందుకైతేనేం
గుడిలో దీపం వెలిగింది
ఆకాశంలో చుక్క పొడిచింది
గుండెలో ఆశ మొలకలెత్తింది
అవునుమరి జీవితమంతా ఆశలోనే ఉంది!*

# ప్రకృతి సహజం

*చలికారునాటి
కారుచీకటి అర్థరాత్రి
వేడి కౌగిలి కోసం
వెతల నలుగుతున్న ధరిత్రి
ఆకాశాన్ని వాటేసుకొంటే
నలిగిన కుంకుమపువ్వులు నక్షత్రాలు!

దిట్టంగా
ఎంతో దట్టంగా
వలపు మంచు అలుముకొందో
కొండిగట్టని ఆశ రగులుకొందో
ఈత ముళ్ళలాంటి
ఈదురుగాలులతో
జివ్వుమనిపించే చలిగాడ్పులను
ఎముకల్ని కొరుక్కుతినే వడగంటి ఊర్పులను
వదలించుకోవాలని పిడికిలి బిగపట్టి
వేడి నిట్టూర్పులకోసం పట్టుపట్టి
ఆరాటపడుతోన్న
ఆ అమావాస్య రాత్రి ధరిత్రి

భవిష్యత్తును కప్పుకొంటున్న
వేదగాయత్రి!
ఆ ఆవేదన ఆశారోదన
తలపండిన ఈ భూమి అనుభావన
అంతటి ఆకాశాన్ని
ఊరడిస్తుంది!
అనుభవం అన్వేషించి
గవేషణ అనుశీలించి
రాత్రి పగలు కాగ
భూమ్యాకాశాల పంట పండుతుంది!

అప్పుడు
ఆకాశం పచ్చిబాలెంతలా
పాలపుంతల వొలకబోస్తుంది!
అదే సమయంలో
భూమి తూర్పుదొరకు
ఎర్రనీళ్లు పడుతుంది!
శుభోదయం విరగబూస్తుంది
అభ్యుదయం అడుగు ముందుకేస్తుంది.*

డాక్టర్ గుమ్మనూరు రమేష్‌బాబు

శ్రీ చిపుకుల వేంకట సుబ్బావధానులు

# కవిత్వము - లక్షణము

కవిత్వం అనేదానికి నిర్వచనం ఆలోచించడం ప్రస్తుతాంశం. కవిత్వం అంటే కవి స్వభావం. కవి చేసే రచన కావ్యం. కవిత్వం అనే పదమే కావ్యం అనే అర్థంలో వాడుతున్నాం.

కవిత్వానికే గానీ మరొకదానికే గానీ లక్షణం చెపుతాం అంటే, వెంటనే చెవులు మూసేసుకోడం, ఆ ప్రస్తావాన్ని అవజ్ఞ చేయడం ఈ కాలంలో మామూలు ఐపోయినాయి. నియమం అనే దేనినీ సహించని విశృంఖలత్వం అందుకు కారణం. అంతేగాక, ఎవరో చేసిన లక్షణ నిర్ణయాన్ని శిరసావహించవలసిన విధి నాకేమిటి? అని ప్రతి రచయితా అనుకోడమే అందుకు కారణం. కాని, ప్రతి రచయితా తన రచనే యితరుల రచనలకంటె గొప్పదని అనుకొంటాడు. దేనినిబట్టి ఆ గొప్పదనం? అంటే, చెప్పడానికి సమాధానం ఏమీలేదు అతనివద్ద. ఆంగ్లేయ కవులలో షేక్స్పియర్‌తోను, సంస్కృత కవులలో కాళిదాసుతోను సమానులైన కవులు లేరన్నప్పుడు, కవుల కవితాశక్తిలో తారతమ్యం ఉన్నదని ఒప్పుకొన్నట్లే గదా! ఆ తారతమ్యాన్ని నిర్ణయించడానికి గీటురాయి యేదో ఒకటి ఉండాలి గదా! అది ఫలానా అని నిర్ణయించగూడదంటే యెట్లా?

ఇంకొకరు చేసిన లక్షణనిర్వచనానికి ఇంకొకరు కట్టుబడి యెందుకు ఉండాలి? అంటే, అది వేఱుమాట. తన సొంత నిర్వచనమైనా ఉండక తప్పదని దానినిబట్టి తేలుతోంది. అట్లా 'తన' నిర్వచనం అంటూ ఒకటి చెప్పి, దానికి లక్ష్యంగా తాను రచన చేస్తే, అప్పటికి, హేతువాద ప్రపంచంలోకి ఒక అడుగు వేసినట్లే అవుతుంది.

కాని, అది ఒక్క అడుగు మాత్రమే అవుతుంది. హేతువాదపు సమగ్రతకు చిహ్నం కాదు. తనకంటె తెలివిగలవారు గాని, యిటువంటి ఆలోచనలో తనకంటె మిన్నగా పరిశీలన చేసినవారు గాని 'అనాది'నుండి యిప్పటివఱకు ఎవరూ లేరనే అహంకారంమీద ఆధారపడిన భావనా ధోరణి అది. అది హేతువాదపరులకు అంగీకారయోగ్యం కాజాలదని చెప్పవలసి ఉంటుంది.

కవిత్వపు బాగోగుల పరిశీలనలో ఆలోచనకు వచ్చేవి నాలుగు అంశాలు ఉన్నాయి. కవిత్వం అనిపించే ముఖ్యలక్షణం మొదటిది. ఇతివృత్తం, బోధ, ఛందస్సు అనేవి తక్కినవి.

ఆనందప్రదత్వం కవిత్వపు ముఖ్య లక్షణం అని, స్థూల దృష్టితో చేసిన నిర్వచనం ఒకటి ప్రచారంలో ఉన్నది. ఆ ఆనందం ఎటువంటిది అనేది తేల్చనంతవఱకు ఆ నిర్వచనం స్థూల దృష్టితో చేసినదే అనవలసి ఉంటుంది. మానసిక వ్యాపారాలలో కొన్ని జ్ఞానాత్మకాలుగాను, మఱికొన్ని భావానుభూత్యాత్మకాలుగాను ఉంటాయని మన స్తత్వ శాస్త్రజ్ఞులు చెపుతారు. మొదటితెగవాటికి చెందిన ఆనందం గాక, రెండవ తెగవాటికి చెందిన ఆనందం 'కావ్యాత్మ' అవుతుంది. ఆ మొదటి తెగవాటిని బుద్ధి సంబంధులనీ, రెండవ తెగవాటిని హృదయ సంబంధులనీ అంటారు ఆలంకారికులు. ఈ భేదాన్ని గుర్తించకపోవడంవల్ల, కవితా లక్షణాన్ని గూర్చి అనేకులు ఏర్పఱుచుకునే భావాలలో అనంతమైన గందరగోళం ఏర్పడుతోంది. మాట చమత్కారం చేతనో భావ చమత్కారంచేతనో శ్రోతలను తాత్కాలికంగా రంజింపజేసే యే వాక్యమైనా కవిత్వమే అనుకొనే భ్రమ యేర్పడినది తమ కిష్టమైన ఏ రాజకీయ సిద్ధాంతాన్నో, సాంఘిక నీతిసూత్రాన్నో గుఱించి కొద్ది వాక్యాలలో వ్రాసిన 'చిఱు వ్యాసాల'ను, ఛందోబద్ధంగానో, గేయరూపంలోనో లయతో పనిలేని పొట్టి-పొడుగు-పంక్తుల వచనపు ఆకారంలోనో ప్రదర్శిస్తే, అది కవిత్వమే అనుకొనే పరిస్థితి కనబడుతోంది.

"అవి మేడలు
ఇవి గుడిసెలు"

అంటే, కవిత్వమై కూర్చుంటోంది.

"లంబోదరుడు రా
కొంచెం చెక్కు"

అంటే, మహాకవిత్వం అనిపించుకుంటోంది. ఈ లెక్కను-

"ఉన్నవాడికే అన్నీ
లేనివాడికి సున్నా"

అనేది కూడా కవిత్వం అవుతుంది. ఇట్లాగే అయితే, ఒకనికి ఉద్యోగం లభించిందని తెలిపే వార్త కూడా, ఆనందప్రదమే గనుక, కవిత్వమే అవుతుంది అని ఒకరు అనేట్లయితే, కాదనడం ఎట్లా?

"ఆనందకరత్వం మాత్రమే కాదు; చమత్కారంవల్ల ఆనందం కలిగించడం అంటారా? చమత్కారం ఏదో కొంత ఉన్నంతమాత్రాన ఒకానొక వాక్యం కవిత్వమైపోతుందనడానికీ వీలులేదు. "వక్త అంటే శ్రోతల ఓర్పుపై విశ్వాసం గలవాడు" అనే చమత్కారపు నిర్వచనాన్ని కవిత్వంగా ప్రచురించారు, ఒక పత్రికలో. "పోతన్న త్యాగయ్యలు తప్ప తక్కిన వారందఱూ రాజాశ్రయంవలని లాభం కోసం ఆశపడ్డవారే" అని ఒక ఉదారభావాన్ని మాటల చమత్కారంలో పొదిగినంత మాత్రాన, సభ అంతా, ఒకప్పుడు, హర్షంతో కదలిపోయింది. కాని అది కవిత్వం అవుతుందా? అటువంటి ఏదో ఒక చమత్కారంచేత తత్కాలమందు కలిగే ఆనందం కావ్యానందం కాదు. కావ్యాస్వాదన కాలమందు కలిగిన ఆనందం హృదయానికి హత్తుకొని, స్మరించినప్పుడెల్ల ఆనందంగా స్ఫుటమవుతూ ఉండాలి. అది హృదయాన్ని కదలించేదిగా ఉండాలిగాని, బుద్ధిని కదలించేదిగా ఉండరాదు. "లౌకిక ప్రయోజన సాధకం కావడం చేత ఆనందకరం అయ్యేది కాక, అలౌకికానంద సాధకం అయ్యేదే కవిత్వం" అని చెప్పవచ్చును. కనుకనే, కావ్యరసాన్ని బ్రహ్మానంద సబ్రహ్మచారి అనడం సంగతం అవుతుంది.

ఈ లౌకికాలౌకికత్వ భేదాన్ని గమనించనందువల్ల, కొందఱికి కవిత్వం అనిపించే రచన మఱికొందఱికి కవిత్వం అనిపించకపోతోంది. అందఱికీ కవిత్వం అనే అనిపించే రచనలు ఉండవా, అంటే, ఉంటాయనే చెప్పాలి. అట్లా అనిపించే సౌందర్యం ఏది అని ప్రాచీనులూ ఆధునికులూ ఐన మేధావులు పరిశీలించి, కొన్ని సిద్ధాంతాలు ఏర్పఱిచారు.

ప్రసాదం, అర్థవ్యక్తి మొదలైన (కావ్య) గుణాలవల్లనే ఒకానొక రచనకు సౌందర్యం వస్తుందని కొందఱన్నారు. రీతుల వల్ల వస్తుందని కొందఱూ, వక్రోక్తివల్ల వస్తుందని కొందఱూ, ధ్వనివల్ల వస్తుందని కొందఱూ, 'రసం'వల్ల వస్తుందని కొందఱూ అన్నారు. ఇంకా అనేకమైన విజ్ఞాభిప్రాయాలు ఉన్నాయి. ఈ మతాలలో 'ధ్వనియే కావ్యజీవితము' అన్నదే పరమ సిద్ధాంతం అని అనేక పండితుల అభిప్రాయం.

ధ్వని అంటే, ఈ కావ్యభాషలో, ఉత్తమమైన వ్యంగ్యార్థం అని చెప్పవచ్చును. వ్యంగ్యార్థం అంటే ఏమిటి? ఉత్తమమైన అనే విశేషణం ఎందుకు? అనే ప్రశ్నలకు సమాధానాలు చూద్దాం.

శబ్దాలు అర్థాలను తెలుపుతాయి గదా! అట్లా అర్థాలను తెలిపే శబ్దశక్తి మూడు విధాలుగా ఉంటుంది. అభిధావృత్తి లక్షణావృత్తి వ్యంజనావృత్తి అని వాటి పేర్లు. ఒకానొక శబ్దం వ్యుత్పత్తినిబట్టి గాని, రూఢినిబట్టి గాని నిశ్చితంగా తెలిపే అర్థం అభిధేయం. సహస్రకిరణుడు, ధారిణి, మానవుడు, కుశలుడు, జలజము మొదలైన శబ్దాల అర్థాలు అటువంటివి. గంగయందు గొల్లపల్లె గలదు, గ్రామము సంతసించెను, కఱ్ఱలు లేచెను— అనే వాక్యాలలో గంగయందు అంటే గంగాతీరమున అనిన్ని, గ్రామము అంటే గ్రామమునందలి జనులు అనిన్ని, కఱ్ఱలు లేచెను అంటే కఱ్ఱలు ధరించినవారు వాటిని ఎత్తిరి అనిన్ని అర్థాలు వస్తాయి. ఇట్లా వచ్చే అర్థం లాక్షణికం. అభిధావృత్తి చేత వచ్చే అర్థం అసంగతమైనప్పుడు, ఆ అర్థానికి సముచితంగా సంబంధించే మఱొక అర్థాన్ని గ్రహిస్తాం. లేవడం అనేది చేతన ధర్మం. అది అచేతనమైన కఱ్ఱలయందు ఉండదు. కనుక అభిధేయార్థం అసంగతం ఐనది. కనుక కఱ్ఱలను ధరించినవారు అనే అర్థం తీసుకోవలసి వచ్చినది. ఇట్లాగే తక్కినవి కూడాను.

ఇక, అభిధచేత గాని లక్షణచేత గాని ప్రస్తుతార్థం సంగతమే అవుతూ ఉండగా, విలక్షణమైన మఱొక అర్థం స్ఫురిస్తుంది, మఱికొన్నిచోట్ల. అది వ్యంగ్యార్థం అవుతుంది.

"అంబోదయుడు రా
కొంచెం చెక్కు"

అన్న 'మినీ-కవిత'లో అటువంటిది ఉన్నది. "ధనికులు బాగా బలిసి ఉన్నారు. వారి ధనాన్ని ఊడలాగుము" అనే వ్యంగ్యార్థం ఉన్నది.

లాక్షణికార్థానికీ వ్యంగ్యార్థానికీ ఉన్న చమత్కార భేదాన్ని అనేకులు గుర్తించడం లేదు. గుర్తించక, వ్యంగ్యార్థం కోసం ప్రయత్నిస్తున్నాం అనుకొని, లాక్షణికార్థం కోసం తంటాలు పడుతున్నారు. ఆ యత్నం వ్యంగ్య లాక్షణికాలకు తేడా ఉన్నదని తెలిసి కాదు. తేడా తెలియకే, వ్యంగ్యార్థంలో ఉండే అందాన్ని గమనించి, అటువంటిది సాధించాలని ఆశించి,

అది చేతగాక, లాక్షణికార్థాలను కల్పించే పదాలనూ వాక్యాలనూ పుంఖానుపుంఖంగా చిమ్మివేస్తున్నారు.

కవి యశః ప్రార్థులైన యీనాటి 'మినీ-కవులు' - ఇంచుమించుగా అందఱూ - వ్రాసేవి తమకు నచ్చిన సిద్ధాంతాలను వాదాలను ధర్మాలను బోధించే మినీ వ్యాసాలే గనుక, వాటిని వ్యాసాలుగా వ్రాస్తే కవిత్వం కాకుండా పోతుందని తమకే తెలుస్తూ ఉన్నందువల్ల, భంగ్యంతరంగా చెపితే కవిత్వం అవుతుందన్న ఆశతో చేసే మరొకపని ఏమిటంటే, రూపకాలంకారాలను పుష్కలంగా కురిపించడం.

ఐతే, రూపకంలో ఉపమానోపమేయ భావానికి తగిన సాధర్మ్యం ఏ కొంచెమో ఉండాలనే గుర్తింపు మాత్రం ఉండడం లేదు. ఒకే సందర్భంలో రూపకాలంకారాలు అనేకం కూర్చినట్లయితే, మాలారూపకంగా, వాటికి స్పష్టమైన సంబంధము సమన్వయము ఉండాలి అనేది గూడా గుర్తించబడడం లేదు. ఆ సామ్యం గాని అన్వయం గాని చుట్టి చుట్టి సాధించి తెచ్చుకున్నది (ఫర్-ఫెచ్డ్) అనదగినట్లయినా ఉంటే సంతోషించవచ్చు ననిపిస్తుంది. ఈ క్రిందిది ఒక మోస్తరు ఉదాహరణం:

"ధనికవర్గం ఓ నక్క
ప్రభుత్వం ఓ కుక్క
ప్రజానీకం అనే కేసరి
విసిగి విసిగి వేసరి
గర్జించి దెగిరిపడి
ఇంకెన్నాళ్లీ దోపిడి?"

[పానకంలో పుడక :- అర్థం సక్రమంగా వచ్చేట్లు వ్రాసే అలవాటు గలవానికి అర్థం సరిగా లేకుండా వ్రాయడం దాదాపుగా అసాధ్యం. ఇతర కవులవి ఉపయోగిస్తే, వారితో తగాదా! అందుచేత వాటికి 'పేరడీ'లవలె ఉండేట్లు రచించడానికి ఈ ప్రయత్నం.] తీరూ తెన్నూ లేని రూపకాలకు మినీ-కవుల రచనలనుంచి యెన్ని ఉదాహరణలైనా చెప్పవచ్చును.

చెప్పదలచిన మాటను అట్లాగే చెప్పక యింకేదో విధంగా- అర్థం స్పష్టపడకుండా చేయాలనే ఉద్దేశించి - చెప్పడమే కవి కర్తవ్యం అనుకోడంవల్ల, ఆయా అర్థాలకు అన్నింటికీ పొందిక కుదురడం అసాధ్యం అవుతోంది. యోగ్యత, ఆకాంక్ష, ఆసక్తి అనేవి ఉన్న పదసముదాయం వాక్యం అని గదా, నిర్వచనం! వాటిలో ఏ ఒకటైనా లోపించకుండా ఉన్న రచనలు ఈ ఆధునిక కవితలలో అరుదు. అందుచేత, వాటికి అర్థం ఏమిటి అంటే, రచయితకే తెలియకుండా పోతోంది. ఈ క్రింది మినీ-కవితలు చూడండి :-

"1. సూర్యుడు నీళ్ల కారిపోతున్నాడు
నేలనుంచి కాంతులు పైకి ప్రసరిస్తున్నాయి
చెవికి చెవుడు లేదా
కుబేరుడు దీర్ఘనిశ్వాసం విడిచాడు.

2. మేఘం ఏడ్చింది
భూమి అమాంతం పైకెగిరింది
కొండ కత్తి దూసింది
రక్తం! రక్తం!"

వీటి భావం ఏమిటి అని కవిని అడిగితే, తియపులేకుడినే అడుగుమంటున్నాడు! 'ఆహా! మహాకవిత్వం!' అని మెచ్చుకొనేవారు మెచ్చుకొంటూనే ఉన్నారు. ఏడ్వడం, రక్తం అనేవి ఉన్నాయి గదా! కవితా సామగ్రిగా, అవి చాలును, వారికి!

ప్రస్తుతానికి వద్దాం. 'ధ్వని జీవము' అంటున్నారు గనుక, దాని భేదాలను స్థూలంగా చూద్దాం. వ్యంగ్యార్థాన్ని ప్రతిదానిని ధ్వని అని ఒప్పుకోలేదు, లాక్షణికులు. వ్యంగ్యార్థం ఉన్న అలంకారాలను రెండింటిని ఉదాహరణంగా చూద్దాం. ప్రస్తుత విషయాన్ని చెప్పగా, అప్రస్తుతమైన మరొక అర్థం స్ఫురించడం ఒక రకం కాగా, అప్రస్తుత విషయం చెప్పగా ప్రస్తుతార్థం స్ఫురించడం మరొక రకం. వీటిని సమాసోక్తి అనీ అప్రస్తుత ప్రశంస అనీ అలంకారాలలో పేర్కొన్నారు.

రాత్ర్యాగమ్యాన్ని కవి "చంద్రుడు నిశాముఖాన్ని చుంబిస్తున్నాడు" అని వర్ణిస్తే, నాయకుడు నాయకురాలిని ముద్దుపెట్టుకోడం అనే భావం వ్యంగ్యం అవుతోంది. ఇది సమాసోక్తి.

"ఖరమ, భరమ్ము మోసియును గడ్డియు గాదము మేయనేల, నీ
వరిగి నృపాశ్వశాలను హయావళితోడుత లెస్స గుగ్గిళుల్
కరము భుజింపరావె, యధికారులు తోఁకలు గట్టి నన్నిటిన్
వీరలు హాయమ్ము లందురు, నృపాలుడా నమ్మఁ, దీటస్థులే
పరుల్."

ఈ పద్యంలోని అప్రస్తుత ప్రసంగంవల్ల రాజాస్థానాలలో గుణదోష వివేచనం సరిగా లేకపోవడం వ్యంగ్యం అవుతోంది.

ఈ అలంకారాలలో ఉండే వ్యంగ్యానికంటె అతీతమైన మరొక వ్యంగ్యాన్ని 'ధ్వని' అని అంటారు, లాక్షణికులు. ఉండ

వలసినంత రమ్యంగా లేని వ్యంగ్యాన్ని గుణీకృత వ్యంగ్యం అన్నారు. ఇన్ని చెప్పినా, ఒక అప్రస్తుత విషయంచేత మరొక అప్రస్తుత విషయాన్ని స్ఫురింపజేయడం అనేదానిని గుణీకృత వ్యంగ్యాలలోనైనా చేర్చలేదు. ఈ కాలపు కవిత్వాలలో వ్యంగ్యం అనేది యెక్కడైనా ఉంటే, అది యీ రకపుది. కనుక ధ్వని సిద్ధాంతం ప్రకారం అవి కవిత్వాలు కావు.

కావ్యత్వం పొందదగిన రచనలో, సాధారణంగా, ప్రస్తుతార్థంచేత ప్రస్తుతార్థం గమ్యం అవుతుంది. [లాక్షణికులు దీనిని ఇట్లాగే చెప్పియుండకపోవచ్చును.]

"ఓపాంధ! పొత్తమ్ము నూనినవాఁడ!
క్షణ మాగు మిచట, వెజ్జవ యేమి నీవు?
మాయత్త కంటి కేమందు చూపిడునొ
చెపుమ, జోస్యుఁడ లేని, నెపుడు నా భర్త
పరదేశముననుండి తిరిగి వచ్చెడునొ!"

(పాంధ పంచకంలోని ఒకదానికి అనువాదం.)

ఇక్కడ గృహిణి పాంథునికి చెప్పిన అభిధేయార్థం స్పష్టమే. వ్యంగ్యార్థం కూడా ఒక విధంగా ప్రస్తుతమే.

వ్యంగ్యార్థం ఉన్నదెల్ల ఉత్తమ కవిత్వం కాదు - అనే యీ మాటను మరొక దృష్టితో గూడా పరిశీలించవలసి ఉన్నది. ఈ ఉదాహరణం చూడండి:

"బాబూ, ధర్మం!
*     *     *
నీ కడుపు చల్లగా!
*     *     *
కాని, యిదేమిటి?
పది పైసలా?
ఎవడేడ్వ మన్నాడయ్యా, పదిపైసలు!
నీ 'పర్సు'లో ఉన్నదంతా
నీ అబ్బ సొమ్మనుకున్నావా?
మా రక్తం పీల్చి కూర్చుకొన్నదే!
తెలుసుకో!"

ఇందులో వ్యంగ్యం ఉన్నది. కాని, యిది కవిత్వం అవుతుందా? కాదనే చెప్పాలి.

పూర్వాపర సందర్భ యుక్తం ఐన కథాంశం ఏదైనా ఉంటేనే తప్ప, ఉత్తమ కావ్యత్వం పట్టదు. 'శృంగారాది రసాల్ కావ్యానికి జీవం' అని అంగీకరించినివారు ఈ సిద్ధాంతాన్ని అంగీకరించకపోవచ్చును. అంతమాత్రాన రససిద్ధాంతం పరాస్తం ఐపోదు.

కథా సందర్భపు ప్రాముఖ్యాన్ని గురించి కొంచెం వివరించవలసి ఉన్నది. కవి హృదయానికీ, ఆతని కవిత్వాన్ని ఆస్వాదించడానికి ఉద్యుక్తుడైన సహృదయుని హృదయానికీ సాన్నిహిత్యం కలిగించే సర్వోత్కృష్ట సామగ్రి కథ; 'మీటింగ్ గ్రౌండ్' అంటామే! అటువంటిది కథ అనేది. ఇది గాయక కంఠస్వరానికీ (వాయులీన) వాద్యకారుని వాద్యపు నాదానికీ ఏకీభావం సాధించే 'శ్రుతి' వంటిది. కనుకనే, కథాగత పాత్రుల సుఖదుఃఖాదులను రసజ్ఞులు 'రసరూపంగా అనుభవించగలుగుతున్నారు. ఆ కథ - కల్పితమే ఐనా సరే, కల్పితం అని విస్పష్టంగా తెలిసినదే ఐనా సరే, చాలా చిన్నదే ఐనా సరే—పనికివస్తుంది; అది ఆవశ్యకం. అది లేనట్లయితే, ఉద్దండ ధ్వని మహనీయమైన వాక్యం సైతం సంపూర్ణ మనోహరత్వాన్ని పొందజాలదు.

కథారహితమై, అందువల్ల రసహీనమైన రచన యేదీ కావ్యం కాదని యీ చర్చనుబట్టి తేలుతోంది. ఏ కొద్దిగానో ధ్వనిమంతమైనా కాకపోతే, కావ్యత్వం అసలు సిద్ధించదని చెప్పినట్లు కూడా ఐనది, ఈ చర్చచేత.

అటువంటప్పుడు, ప్రచార ప్రధానమైన రచనల మాట యేమిటి? అంటే, అవి కావ్యాభాసాలు కావచ్చును గాని, కావ్యాలు కావు. ఇట్లా అనడం బోధ అనేది కవిత్వంలో అసలు ఉండ గూడదనడం కాదు. బోధ అనేది లేకుండా, రచన అనేది సంభవం కాదు. "కళ కళకొఱకే; బోధకొఱకు కాదు" అనే వాదం ఒకటి ఉన్నప్పటికీ, అది, ఆచరణంలో సహృదయ పరిగ్రాహ్య స్థితిలో లభ్యం కాదని చెప్పవచ్చును. కనుక బోధ అనేది ఉండక తప్పదు. కాని, అది కాంతా సమ్మితంగా ఉండాలి. రాజసమ్మితంగా గాని, మిత్రసమ్మితంగా గాని ఉండ రాదు. రాజకీయ ఆర్థికాది శాస్త్రాల సిద్ధాంతాలను గూర్చి రచించిన శాస్త్ర గ్రంథాలలో ఉండే బోధ రాజసమ్మితం అనదగినది. మిత్రసమ్మితం అనదగినది పత్రికలలోని వ్యాసాలవలెను రాజకీయోపన్యాసాలవలెనూ ఉంటుంది. అవి అన్నీ కవిత్వమే అనేవారితో చర్చ పెంచుకోడం అనావశ్యకం.

అట్లా అయితే, నీతిబోధమాత్రాత్మకాలైన సుమతి శతకాదులను ఏమనాలి! అంటే, వాటిలోగూడ ఒకవిధపు వ్యంగ్యం ఉంటుందనే అనవలసి ఉంటుంది. 'అక్కఱకు రాని చుట్టము' అన్న పద్యంలోని భావం అక్కఱకు రాని చుట్టాలవంటివారు ఏ దేశంలో ఉన్నా, ఏ కాలంలో ఉన్నా వారినందఱినీ స్ఫురింపజేస్తుంది. కాని ఆ వ్యంజనచే రసధ్వని రానందున కావ్యానందాన్ని కలిగించదు.

ఇట్లా బోధను గూర్చి ఆలోచించేటప్పుడు దాని స్వరూప స్వభావాల పరిశీలన కూడా ప్రసక్తికి వస్తుంది. భగవద్గీతాది గ్రంథాలలో శాశ్వత మానవధర్మాలు కొన్ని పేర్కొనబడ్డాయి; 'అహింసా సత్య మక్రోధః' ఇత్యాదులన్నమాట. రాజకీయ (=ప్రభుత్వ) శాసనాల రూపంలో తాత్కాలికధర్మాలు పేర్కొనబడుతూ ఉంటాయి. ఆ రెండింటిలోను ఇముడని సాంఘిక ధర్మాలు కూడా కొన్ని ఉంటాయి. అటువంటి అంగీకృత ధర్మాలవైపునకు మనస్సును అభిముఖం చేసే బోధయే కావ్యప్రయోజనం కాదగిఉంటుందని అనుకోవచ్చును. అంతేగాని, సంఘంలో ఉండే దురాచారాల కన్నింటికీ ఏవో కారణాలు - వాస్తవాలో అవాస్తవాలో వివరించి, వాటి ఉనికిని సమర్థించేదిగా ఉండరాదు. 'విశ్వశ్రేయః కావ్యమ్' అన్నారు గదా! సంఘానికి శ్రేయస్సును కూర్చేదే కవిత్వం అనిపించుకొనే గౌరవానికి తగియుంటుంది గాని, దురాచారాలను సమర్థించడంద్వారా ప్రోత్సహించేది కాదు.

అది అటుండగా. "పురాతనమైనదంతా నశించుగాక" అని ఒక కవి వ్రాయవచ్చునని ఒప్పుకొంటే, 'ఓల్డ్ ఈజ్ గోల్డ్' అని బోధించడానికి ఇంకొక కవికి హక్కు ఉంటుంది గదా! "గా కోకిల, బరసా పావక కణ్, నష్ట భ్రష్ట హో జీర్ణ పురాతన్" అని శ్రీ సుమిత్రానందనపంత్ వ్రాయవచ్చునంటే, శ్రీ విశ్వనాథ సత్యనారాయణ రామాయణ కల్పవృక్షం, వేయిపడగలూ రచించవచ్చునని ఒప్పుకోవాలి.

'విశ్వశ్రేయః' అన్న పదానికి ఎవరు ఎట్లా అర్థం చెప్పినా, ప్రపంచపు జనాళిలోని ఏ ఒక్కవర్గపు శ్రేయస్సు మాత్రమో ఐతే, అది విశ్వశ్రేయస్సు కాదు. అదంతా ఎట్లా ఉన్నా, 'జాతీయత'కు (=స్వదేశ భక్తికి) విరుద్ధమైన అంతర్జాతీయ శ్రేయస్సు మాత్రం విశ్వశ్రేయస్సు కాదు. బోధ అనేది ఉండక తప్పదనుకొన్నప్పుడు ఈ భావం కూడా ఉండక తప్పదు.

'బోధ' అనే విషయంలో ఇటువంటి వాద వివాదాలు ఉన్నప్పటికీ, రచనలలోని కవితా సౌందర్యాన్ని గమనించ గలగడం సహృదయతా లక్షణం అని యీ సందర్భంలో గమనించవలసి ఉంటుంది. శ్రీ సుమిత్రానందనపంత్, శ్రీశ్రీ వంటి వారు తమ రచనలలో చేసిన బోధ తమకు సమ్మతం కాకపోయినా, వాటిలోని కవితా సౌందర్యాన్ని అనుభవించి ఆనందించే శక్తి సహృదయులకు ఉండాలి. అట్లాగే 'విశ్వనాథ' ప్రభృతుల రచనలనుగూడా ఆస్వాదించగలగాలి.

ఈ విషయాన్నే మరొకవిధంగా మలచి చెప్పాలంటే, కవులు తమ బోధను మెచ్చుకొనేవారికే గాక, మెచ్చుకోజాలని వారికి గూడా ఆహ్లాదకరంగా ఉండేట్లు రచనలు చేయగలగాలి అనవచ్చును. తమ బోధను మెచ్చుకొననివారినెల్ల శత్రువులుగానో అసహృదయులుగానో యెంచడం ఉత్తమకవి లక్షణం కాజాలదు.

"ద్విపద కావ్యంబు ముదికాంత దిడ్డకంత
ఇయ్యనేఅని రాజు నాల్గేకరాశి"

అని ఒక కవి అన్నాడు. అంతమాత్రాన అతనిని ద్విపద కవులందఱూ శత్రువుగా పరిగణించనక్కఱలేదు.

ఇక ఛందస్సును గుఱించి కొంచెం చూతాం. ఛందస్సు అనేది అనావశ్యక బంధనం అని నేడు చాలామంది అనుకుంటున్నారు. దాని స్వరూప స్వభావ ప్రయోజనాలను గూర్చి బాగా తెలుసుకోనందువల్ల అటువంటి అభిప్రాయం కలుగుతోంది. గణఛందస్సులో రచన చేయడం కష్టం కావచ్చును. అది సాధ్యం కాకపోతే, మాత్రాఛందస్సులో రచించవచ్చును. అదీ కష్టం అనిపిస్తే, దానిని ఎక్కడకక్కడ స్వతంత్రంగా మార్చుకొంటూ ఏదో ఒకరకపు గేయంగా తయారుచేయవచ్చును. అదైనా చేతగాదంటే రచనా సామర్థ్యంలో నిస్సంశయంగా కొంత లోపం ఉన్నదని నిశ్చయించవలసి ఉంటుంది. భీష్మ ద్రోణాదులను జయించలేననే పిఱికితనాన్ని కప్పిపుచ్చి, అర్జునుడు ధర్మశాస్త్ర సిద్ధాంతాలు తయారుచేసినట్లు చేయడంలో ఘనతగాని అందంగాని యేమీలేదు.

ఛందస్సువల్ల రచనకు 'లయ' అనే గొప్ప 'శబ్దగుణం' అబ్బుతుంది. అది సంగీతానికి ఆధారం. గానానికి అసలు ఆధారం 'శ్రుతి'యే ఐనప్పటికీ, లయ కూడా దానికి ఆధారమే. సంగీతము కవిత్వము కళాత్వ సాధర్మ్యం గలవి. అందువల్ల వాటికి పరస్పర భూషణ భూష్యభావం ఉంటుంది; పోష్య పోషక భావం అన్నా అనవచ్చును. కనుక ఛందస్సువల్ల కవితాకళకు మెఱుగు వచ్చి తీరుతుంది. కొద్ది సౌందర్యమే ఉన్నా, అది హెచ్చుగా భాసిస్తుంది. ధ్వని రసాదికం ఏమీ లేకుండా, సామాన్య కథాకథనం మాత్రమే ఉన్నచోటగూడా దానికి ఒక ఠీవియో ఒక కులుకో మరొక అందమో వస్తుంది.

"ధారుణి రాజ్యసంపద మదంబున" అన్న (భారతోద్యోగ పర్వ) పద్యంలోని రసగుణాదులకు ఛందస్సువల్ల పుష్టి కలిగినది. 'మృగమద సౌరభ....' అన్న (మనుచరిత్ర) పద్యంలో (ఛందస్సువల్ల) కులుకు వచ్చినది. 'అల్లన మ్రొక్కి' అన్న (ఉత్తర రామాయణ) పద్యంలోను, "ఎన్నోయేండ్లు గతించి....' అన్న (జాషువా కవి) పద్యంలోను కరుణరసం ఇనుమడించినది. 'ఏరా తమ్ముడ నన్నుఁజూడ' అన్న (నిగమశర్మ అక్క) వాక్కుకూ, 'రాముం బుణ్యగుణాభిరాము' అన్న (ఉద్యోగపర్వ) పద్యపు భావానికి, అట్లాగే, గాంభీర్యం వచ్చినది. 'పుణ్యుడు రామచంద్రుడట వోయి' అన్న (భాగవత) పద్యానికి కర్ణపేయత్వం సమకూరినది. ఇట్లా ఎన్ని ఉదాహరణాలైనా చెప్పవచ్చును.

ఇట్లా పరిశీలించిన మీదట, 'ఛందోబద్ధంగా రచించడం కష్టసాధ్యం' అనే భావాన్ని 'అది అనావశ్యకం' అనే భావంలో పొదగ నక్కఱలేదని సహృదయులు గమనించగలరు. ఛందోబద్ధంగా ఉన్నంతమాత్రాన ఒకానొక రచన కవిత్వం ఐపోదు అనేవారితో నిరభ్యంతరంగా ఏకీభవించవచ్చును. కాని ఛందస్సు నిరుపయోగం అనేవారితో మాత్రం ఏకీభవించగూడదు.

కావ్యాలను ఉత్తమ మధ్యమాధమాలుగా విభజిస్తూ, కేవల శబ్ద సౌందర్యంమీద - అంటే శబ్దాలంకారాలమీద - ఆధారపడిన దానిని అధమకావ్యం అన్నారు, అభిజ్ఞులు. ఈ మాటను ఏనాటినుంచో యీనాటివఱకు అందఱూ ఆమోదిస్తూనే ఉన్నారు. కాని, అందఱూ శబ్దసౌందర్యంకోసం తంటాలు పడుతూనే ఉన్నారు. అర్థ సౌందర్యం ఉండి, దానితోపాటు శబ్దసౌందర్యం కూడా ఉంటే తప్పేమీ కాదు. బాగానే ఉంటుంది. కాని, అంత్యానుప్రాసంవంటి శబ్దాడంబరం తప్ప ఇంకే అందమూ లేని రచనలను నేడు మహాకవిత్వంగా ఆదరించి పత్రికలలో ప్రచురిస్తున్నారు.

1. "ఆకాశమంత నోరు
జీవితమంతా బోరు (ఇంగ్లీషు పదం బోర్)
లే దెక్కడా పేరు
ఇంకోదారికి పోరు"

2. "వస్తున్నావా, రక్తాక్షీ
స్వాగత మిదిగో కీలాక్షీ
ఫాలాక్షీ, శ్వేతాక్షీ."

అని వ్రాస్తే, ఇదేమి కవిత్వం అనేవారు లేరు నేడు. 'బోరు' ఏమిటి అంటూరా? అంత్యానుప్రాసం కోసం వచ్చిన మాటకు అంతగా అర్థం ఉండనక్కఱలేదు. అన్ని పంక్తులకూ పరస్పర సంబంధంతోడి అన్వయం గూడా అంత ముఖ్యంకాదు! కనుకనే ఇందులో 'ఫాలాక్షీ యేమిటి' 'శ్వేతాక్షీ యేమిటి' అని అడుగబోకండి!

కవిత్వపు లక్షణాన్ని గూర్చి అందఱికీ ఐకమత్యం ఎప్పుడూ లేదు. కాని ఒకవిధపు ఐకమత్యం మాత్రం అభిజ్ఞులలో ఉన్నది. అది నిజమైన సౌందర్యధాతుకత్వం. ఈ వ్యాసంలో చెప్పబడిన భావాలనే అందఱూ యథాతథంగా ఆమోదిస్తారని యెట్లాగూ ఆశించలేము. కాని, స్థూలంగానైనా ఆమోదించవలసి ఉంటుందనుకోవచ్చును. కవితా సౌందర్యపు తరతమ భేదాలను విచక్షణతతో వివేచించి చూడజాలకపోతే, ప్రతి రచయితా తానొక మహాకవిననీ, అట్లని అంగీకరించనివారందఱూ అసహృదయులో దురుద్దేశ్యపూరితులో అని తలంచే 'ప్రమాదం' ఉంటోంది గనుక, దానిని తొలగించడానికైనా ఈ చర్చ ఉపయోగపడుతుందని ఆశిద్దాం.

# అమృతాంజన్ లిమిటెడ్‌వారి విశిష్ఠమైన ఆముదము




శుద్ధి
చేసినది,
వాసన
లేనిది.

అమృతాంజన్ లిమిటెడ్ 42-45, లజ్ చర్చ్ రోడ్డు, మద్రాసు 600 004

**Amrutanjan Limited** 

# "...నేనెవరిని"

## శ్రీ మేకా సుధాకరరావు

ఆ పెట్టెలోనికి ఎవరు ఎక్కుతున్నారో, ఎవరు దిగిపోతున్నారో అతనికి అవసరంలేదు. కిటికీ దగ్గర ఒంటరి సీటులో కూర్చుని, అలా శూన్యంలోకి చూస్తున్నాడు రఘు. తన జీవితపు స్మృతి తరంగాలలో ఉక్కిరి బిక్కిరవుతున్న అతని కనులు అశ్రుధారలైనాయి! ఆలోచనలతో అంతకంతకు భారతరమైపోతున్న అతన్ని మోయడం కష్టంగా వున్నదున్నట్టు, క్రిక్కిరిసి వ్రేళ్లాడుతున్న జనంతో రైలు నడవలేక నడుస్తూంది. సుందరమైన సరస్సులవంటి అతని కళ్ళలోని నిరాశా, విస్పృహ గమనించిన కనులు ఎవరివైనా చెమ్మగిలక మానవు! రైలు ఆగినా నడచినా అతని ఆలోచనలూ అశ్రుధారలూ సాగుతూనే ఉన్నాయి. రాత్రి తొమ్మిదిన్నరకు తాను అనకాపల్లిలో ఎక్కిన రైలు అప్పుడే అన్నవరం వచ్చిన విషయం అతనికి తెలియదు.

తాను 'కౌముది'ని కోరి పెళ్లి చేసుకోవడం – ఆ సందర్భంగా తనను ఎంతో ప్రేమతో పెంచిన తనకు పూజ్యులైన తలిదండ్రులను సైతం కాదనవలసి రావడం – అయితే, తమ పుత్రుని సౌఖ్య సంతోషాలే ప్రధానమని భావించి వారు కౌముదితో తన వివాహానికి సమ్మతించి వైభవంగా జరిపించడం, ఆదిగాగల తన జీవితవాహిని, చలనచిత్రంలోవలె తన మనోనేత్రం ముందు పరుగు పెడుతూంది:

"కౌముది! ఎంత చక్కని పేరు!" అనుకున్నాడు తొలిసారిగా ఆమె పేరు విన్నపుడు. ఆమెలోని వినయం, వివేకం, చురుకుదనం చక్కని అలవాట్లూ అతన్ని ఆకర్షించాయి. తనకు అటువంటి సుందరి జీవిత సహచరిగా లభిస్తే జీవితంలో ఇక ఆశించతగ్గదేదీ ఉండదని ఊహించాడు. ఆమెకోసం కలలు కన్నాడు-పలవరించాడు. అదృష్టం కలసివచ్చి ఆమెయే తన అర్ధాంగయింది.

అయితే, ఆమె ఇప్పుడు లేదు! అయిదేళ్లమించి ఆమెతో వుండే అదృష్టం తనకు లేకుండా పోయింది. ఆ అయిదేళ్లూ తన జీవితానికి అయిదు యుగాల ఆనందం! మరపురాని, మరవలేని మధురానుభవం. ఆమె తన జీవితం అంధకారంచేసి, నాలుగేళ్లై విడిచిపోయినా, తన మనసు మాత్రం ఆమె తలపును మరచి ఉండలేదు.

అప్పటికే దీర్ఘ అనారోగ్యంతో వున్న తనతండ్రి, తన పెళ్ళయిన సంవత్సరంలోనే పోయేడు. మరో రెండు సంవత్సరాలకు తల్లి మరణించింది. ఇక తనకు కౌముదితప్ప కావలసిన వారెవ్వరూ లేరు. అత్తమామలకు ఉన్నంతవరకూ ఎంతగానో సేవలు చేసింది కౌముది. "మాకు కూతురు లేకపోయిన కొరత తీర్చేవు కోడలా" అంటూ ఆనందం వెలిబుచ్చుకుంది ఆ అత్త. అన్యోన్యంగా, అనుకూలంగా ఆనందంగా సాగిపోయింది దాంపత్యం. భోజనం దగ్గర తల్లిని మరపించేది కౌముది. రాత్రి పూట తను ఎప్పుడైనా కాస్త ఎక్కువసేపు చదువుతూంటే చాలు-ఆ పుస్తకం లాక్కుని 'అబ్బ-ఎంత టైమయిందో! మళ్ళీ పొద్దుటే లేవాలా? మధ్యాహ్నం విశ్రాంతి లేదు' అంటూ వారించేది. ఈనాడు తానేమైపోతే ఎవరికి కావాలి? నిజానికి ఆమె పోయినప్పట్నుంచీ సుఖనిద్రకు మొహం వాచిపోయాడు తాను.

బ్రహ్మముహూర్తానే లేచి స్నానాదులు ముగించుకుని, ప్రార్థనలో కూర్చునేది కౌముది. పూజగదిలోనుండి బయటకు రావడంతోనే కాఫీ ఫలహారాలు తయారుచేయడం – ఈ లోపులో తనను లేపి, స్నానాదులకు అమర్చి, తన పూజకు పూలవీ సిద్ధం చేసేది. అన్నీ చకచకా చేసేసేది. తను బయటకు వచ్చేసరికి కాఫీ టిఫిన్లు ఎదురు చూస్తుండేవి. తను కాలేజీ టైమయ్యేవరకూ పాఠాలు సిద్ధం చేసుకోవడం, ఆమె తనకు వంట సిద్ధం చేయడం- అలా చక్కని జీవిత విధానానికి అలవాటుపడడానికి తనకెంతగానో సహకరించింది కౌముది-సహచరించింది.

ఆమె పోయిన తరువాత తన జీవితవిధానమే మారిపోయింది. ఆ ఆరోగ్యకరమైన అలవాట్లే తప్పిపోయినాయి. కౌముది పోగానే తన జీవితం ఎంత శూన్యమైపోయింది! కలలా కరిగిపోయినా, ఆమెతో తన జీవితంలోని కొన్ని సంఘటనలు ఎన్ని జన్మలకూ మరచిపోలేదు:

తాను టైఫాయిడ్ జ్వరం పడ్డపుడు, తన కౌముది రోగంతో పోరాడి తనను తేలదీసుకుంది. ఆ ఇరవైరోజులూ తన చెంతనే వుంటూ, కావలసిన మందులూ, ఆహారం సకాలంలో యిస్తూ సపర్యలు చేసింది. ఎప్పుడు తినేదో ఏం

చేసేదో, తను మెలకువగా వున్నపుడు ఎప్పుడు చూసినా, ప్రక్కనే విసురుతూనో, తల వదుతూనో వుండేది. ఆమె సేవలకు అచ్చెరువొందిన డాక్టరు కూడ, తాను తేరుకున్నాక ఒకసారి తనతో, "నీవు ఇంత త్వరలో తేరుకోడానికి నా తెలివి తేటలు కాదు రఘూ కారణం - నీ అదృష్టదేవత, ఆమె నిండు మనసుతో ఆమె చేసిన సేవలు" అన్నాడు.

ఆ సందర్భంగా మందులకూ వాటికీ డబ్బు కావలసివచ్చి, తనకు చెపితే తన మనస్సుకు శ్రమ కలుగుతుందేమోనని, ఆ విషయం తనవరకూ రానీయకుండా, మెడలోని నెక్లసు తాకట్టు పెట్టి డబ్బు తెప్పించి, ఖరీదైన మందులూ బలమైన ఆహారం చేకూర్చింది. తాను మామూలు జీవితంలో పడ్డాక చెప్పింది, ఆ తాకట్టు విషయం. "అలా ఎందుకు చేశావు! నీ మెడ బోసిగా ఉంచుకున్నావా - నేను చూడనేలేదు" అని, తానంటే, మెడ బోసిగా వుంటేనేం? నా మనసు నిండుగా వుంది - మనమే విడిపించుకుంటాం" అంటూ, అతి తేలికగా సముదాయించేసింది తనను. ఆ కౌముది ఈనాడు తనకు లేదు!

* * *

వెన్నెల సన్నజాజులు కురుస్తున్న చల్లని తెల్లని రాత్రి. వాకిట్లో సురభిళాలు వెదజల్లుతూన్న మల్లిపందిరి దగ్గరగా తెల్లని మెత్తని శయ్యపై తాను. పక్కన కూర్చుని తమలపాకులు రాస్తున్న తన కౌముది. సినిమానుంచి తిరిగివచ్చి అప్పుడే భోజనం చేశాడు. కౌముదిని తీసుకెళ్ళకుండా తాను స్నేహితులతో సినిమాకు వెళ్ళినందుకు, రాగానే ఆమెకు కారణం వివరించాడు. కాని అది ఆమెను తృప్తిపరచినట్టు లేదు. తనూ ఆమెకు బాధ కలిగించేననే భావించాడు. చెప్పకుండా ఉండివుంటే అది వేరు. కాని ఆ రోజు సినిమాకు వెళదాం సిద్ధంగా వుండమని చెప్పి వెళ్ళాడామెతో. ఆమె ఎంతో ఉత్సాహంతో ఎదురుచూచింది. తమలపాకులందిస్తూన్న ఆమెతో అన్నాడు, "నీకు ఆశాభంగం చేసినందుకు బాధపడుతున్నాను కౌముదీ" అని.

"బాధపడడం దేనికి - తెలిసుండి చేసిన పనే కదా——" అన్నదామె, ఉడుకుమోతుతనాన్ని వెల్లడి గాకుండా వాల్చిన ముఖంతో——

"అదేమిటి కౌముదీ - వాళ్లెంత పట్టుబట్టారో చెప్పేనుగా - లేకపోతే...." తానింకా ఏదో చెప్పబోయాడు.

"ఎవరైతేనేం - నీకు నాకన్న ముఖ్యమైనవాళ్లు - వాళ్ళను సంతోషపెట్టేవుగా - నా మాటకేం...." చెప్పుతున్నట్టుగా మనసులో బాధను ఇక అణుచుకోలేనివిధాన అన్నది.

నిజమే - తాను ఇలా ఆమె ఆశను భంగపరచడం ఇది మొదటిసారి కాదు. ఇదివరలో ఒకసారి ఇలానే జరిగింది. తన కౌముది మనసుకింత బాధ కలిగించానన్న ఆలోచన సోకినంతనే అతని కళ్ళు చెమ్మగిలినాయి! అధరాలు వణకజొచ్చాయి. ఆకులు అందిస్తున్న ఆమె చేతిపై వెచ్చని కన్నీటిబొట్టు రాలి, ఆమె హృదయం 'చుర్ర్'మంది! తృళ్ళిపడింది తన కౌముది! చల్లని మృదువైన వేళ్ళతో తన రెండు కళ్లూ తడిమింది! "రఘూ! నన్ను క్షమించు రఘూ! బాధపడుతున్నావా - నీకింత బాధ కలుగుతుందనుకోలేదు-" అంటూ, కొంగుతో తన ముఖం తుడిచి, తన హృదయంపై వాలిపోయింది. అంతవరకూ తనలో అణగివున్న దుఃఖం దిగమింగలేకపోయాడు తాను - చంటిపిల్లవానిలా వెక్కి వెక్కి ఏడ్చాడు! కన్నీరు ధారగా కురిసింది! ఆమె దెబ్బతిన్న లేడిలా బెదిరిపోయింది. శరీరమంతా కంపించిపోయింది. "రఘూ, ఇంకెప్పుడూ నిన్ను ఏమీ అనను - నన్ను క్షమించు. నీ హృదయపు సౌన్నిత్యాన్ని బాధపడితే నేను భరించలేను - నా గుండె పగిలిపోతుంది" అంటూ ముఖం తన హృదయంలో దాచుకుని దుఃఖించింది. అంతా కొద్ది నిమిషాలు. తుఫానులో నావలా రెపరెపలాడిపోయినాయి వారి హృదయాలు. ఆ సంఘటన తరువాత ఎప్పుడూ, మాటవరసకైనా ఏ విషయంలోనూ తనను నొప్పించలేదు. ఆ మధురానుభం తన స్మృతిపథంలో వీచినపుడు అతనిలోని బాధ అధికమై కన్నీరు కట్టలు తెంచుకుని పొరలింది. ఆ కౌముది తనకు లేకుండా పోయింది గదా అని కృంగిపోయాడు. 'నేనెవరికోసం జీవించాలి?' అన్నంత విరక్తి పొందేడు!

రైలు సామర్లకోటలో ఆగటంకాని, మళ్ళీ బయలుదేరటం కాని అతనికి తెలియదు. అలా కన్నీటిలోనే, కలతలోనే ఉండిపోయాడు.

రఘు ఆలోచనాస్రవంతి కౌముదితో తన జీవితపు ఆఖరి సంవత్సరంలో ప్రవేశించింది:

కాలేజీనుంచి ఇంటికి వస్తూ తోవలో పచ్చరటిపళ్ల ద్రాక్షపళ్లూ కొని తీసుకువచ్చాడు తాను. ద్రాక్షపళ్లు చూసి ఆనందపడిపోయింది కౌముది. గబగబా విప్పి ముఖం పుల్లగా చిట్లించుకుంటూ, ఆప్యాయంగా తింటూ, "ఎక్కడైనా మామిడికాయలు దొరికితే తీసుకోండి - రేపు పప్పులో వేసుకుందాం" అంది. "ఇప్పుడు మామిడికాయలా!" ఆశ్చర్యంగా చూస్తూ అడిగేడు తను. కౌముది ఆ ద్రాక్షపళ్లు తింటున్న తీరూ, ప్రొద్దుట చింతకాయ పచ్చడి చేయడం, ఇప్పుడు మామిడికాయలు అడగటం తలుచుకునే సరికి తనలో ఒక ఊహ మెరుపులా మెరిసింది. "ఏమిటి కథ"

అంటూ, కొంటెగా ఒకసారి ఆమెను ఆపాదమస్తకం పరికించి చూచాడు. ఏదో చెప్పలేని సిగ్గు వెదజల్లుతూ, ఒళ్లు కప్పేసుకుని చటుక్కున తిరిగి, "స్నానానికి నీళ్ళు తోరిపేస్తాను" అని, తన సమక్షం తప్పించుకుపోతుంది.

ఆ మర్నాడే కౌముదిని లేడీడాక్టరుకు చూపించాడు. తన కౌముది రెండు మూడు నెలల తల్లి! వెంటనే వాళ్ళమ్మకు ఉత్తరం రాయడం ఆవిడ రావడం జరిగింది. మూడోనెల వచ్చింది కనుక కూతుర్ని తీసుకువెడతానంది, ఆమె. అమ్మో - కౌముదిని విడిచి ఉండడమే!" భయపడ్డాడు తాను.

"అదెలా కుదురుతుందమ్మా-ఆయనకు భోజనమదీ ఎలాగ? ఒకరోజా రెండురోజులా?" రఘుని ఉండలేని కారణం మధ్యపెట్టి తెలివిగా తప్పించుకుంది కౌముది.

"అవునండత్తగారూ-ఇక్కడ లేడీడాక్టరు దగ్గర మందులు వాడుతున్నాం" అంటూ, తానూ తప్పించుకున్నాడు. మొత్తానికి ఏడో మాసంలో తీసుకువెళ్ళడానికి నిర్ణయించి ఆమెను పంపేశారు.

ఆ రోజుకారోజు తన కౌముదిలో మార్పు చూసుకుంటూ మురిసిపోతున్నాడు తాను. ఆమె గర్భంలోని శిశువుతోపాటు, ఇన్ని నెలలూ తన హృదంతరాళంలో ఆశలు పెరుగుతున్నాయి!

తన కొడుకు ఎంతో అందంగా ఉంటాడు - ఎవరికీ లేని అందమైన పేరు పెట్టాలి-చిన్న వయసులోనే పెద్ద విద్యావంతుణ్ణి చేయాలి-మంచి సాహితీపరుడూ సజ్జనుడూ కావాలి - సంఘంలో ఘనమైన కీర్తి, స్థాన్యం పొందాలి - వాడి ఔన్నత్యంతో తనకూ తన వంశానికీ శాశ్వతమైన కీర్తి రావాలి.... ఇలా ఏవేవో ఆశలూ ఆశయాలూ పెరిగిపోతున్నాయి తనలో!

ఒకనాడు చటుక్కున "మనకు ఆడపిల్ల పుడితే ఏం పేరు పెడదాం" అని ఆనందంగా అడిగింది కౌముది. "ఎక్కడా లేని చక్కని పేరు పెడదాం" అన్నాడు. అన్నాడేకాని, ఆడపిల్ల విషయం ఇంతవరకూ ఊహించనేలేదు తాను. కౌముది ప్రశ్న మూలంగా ఇప్పుడీప్రశ్న తలెత్తింది—

తన కూతురు అచ్చు తల్లి పోలికనుంటుంది - చిన్నప్పట్నుంచీ సంగీతం నృత్యం నేర్పించి అందరూ మెచ్చుకునేలా పెంచాలి - మహిళాలోకానికే మణిపూసలా తీర్చిదిద్దాలి-దేశంలో ప్రముఖమైన స్థానం అలంకరిస్తుంది తన కూతురు!.... ఆ ఆలోచనలకు ఆశలకూ అంతులేదు.

ఏడోనెల వచ్చేక కౌముదిని తీసుకెళ్ళడానికి వాళ్ళమ్మ వచ్చింది. కౌముదీ తానూ పరస్పరం విడిచి ఉండలేరు. ఇద్దరూ కలిసికట్టుగా, "ఆ గ్రామంలో వైద్యసదుపాయం ఉండదనీ, మొదట్నుంచీ చూస్తున్న లేడీడాక్టరు ఇక్కడవుంది గనుక పురుడు ఆమె దగ్గర పోసుకోవడం క్షేమకరమనీ" ఆమెకు నచ్చజెప్పి పంపేశారు.

ఆ రోజు చంద్రగ్రహణం. ఇరుగు పొరుగువాళ్లు చెప్పిన మీదట కౌముది కదలకుండా మంచంమీద పడుకుని ఉంది. బయటనుంచి వస్తూనే, ఆమె కనపడని కారణాన 'కౌముదీ' అంటూ పిలుస్తూ గదిలో ప్రవేశించాడు తను. "ఏం అలా పడుకున్నావు - ఒంట్లో బాగాలేదా?" అంటూ ఆత్రుతగా అడిగేడు. "అబ్బే ఏమీలేదు - ఇప్పుడు గ్రహణం కదూ - గర్భిణీ స్త్రీలు కదలకూడదు - మరో గంట పోయేక, మామూలే" అంది. "చంపేశావు - అంతేకదా" అంటూ తాను బయటకు వెళ్ళబోతున్నాడు. "రఘూ, రఘూ!" అంటూ ఆందోళన పడుతున్నట్టు కేక పెట్టింది. చటుక్కున వెనుకకు చూశాడు. చేతులు చాచిన ఆమెవైపు రెండడుగులు వేశాడు. తనని బాహుబంధంలో చిక్కించుకుని, "ఆ రాహువు బహు చెడ్డవాడు - నీ వదన బింబాన్ని చూచి చంద్రుడని మింగినా.... ఏమో బాబు - నీవు బయటకు కదలవద్దు-" అంటూ తనతోపాటు మంచానికి కట్టేసింది. ఆ ప్రేమా, ఆ శృంగార చతురతే తలుచుకుంటే తన హృదయం తరుక్కుపోతూందీనాడు!

కౌముదికి ప్రసవవేదన ప్రారంభమయింది. ఆ బాధ తను చూచి భరించలేడు. వాళ్ళమ్మకూడా వచ్చి దగ్గిరే వుంది. లేడీ డాక్టరు చాలాసేపటినుంచి అక్కడే ఉండిపోయింది. కాన్పు కష్టంగా గోచరించి మరో డాక్టర్ని కూడా సహాయం తీసుకు వచ్చింది. ప్రసవం చాలా శ్రమయింది. శిశువు ప్రాణంతో బైట పడింది. అయితే తన కౌముదికి స్పృహలేదు! ముద్దుబిడ్డను చూచుకోనేలేదు! తాను చూచాడు. కాని తన మనసు మనసులో లేదు - తన కౌముదిమీదనే నిలిచిపోయింది. ఇద్దరు డాక్టర్లూ చేయవలసినదంతా చేశారు. కౌముది బ్రతుకుతుందనే ఆశించాడు. అయితే రెండురోజుల అనంతరం వారి ఆశ నిరాశైపోయింది. తను పిచ్చివాడైపోయాడు. కౌముదిపైబడి బోరున ఏడ్చాడు.... అంతా తాను ఊహించనివిధాన జరిగిపోయింది!

తన జీవితం తుత్తునియలైపోయింది. ఆరని శోకంతో కంటికీమంటికీ ఏకధారగా కన్నీరు కురుస్తూ, నిద్రాహారాలు లేక సొక్కి సోలిపోయాడు. కౌముది అక్క శకుంతల వచ్చి ఉంది.

ఆ చంటిగుడ్డును ఆవిడే చూస్తోంది. తరువాత ఆమె భర్త కూడా వచ్చేడు. కర్మకాండ అంతా పూర్తయింది. తనొక్కణ్ణీ విడిచి ఎవరింటికి వారు వెళ్ళిపోయే రోజు——

తన అత్తగారూ, వదినెగారూ, మిగతా బంధువులూ కలసి తనకేవేవో నచ్చజెప్పేరు. తన చిట్టితల్లి శకుంతల దగ్గర పెరుగుతుంది. తానెప్పుడు కావాలంటే అప్పుడు చూడవచ్చు — 'సరే' అని పంపివేయడానికి అంగీకరించాడు. అందరూ వెళ్ళిపోయారు. తానొంటరియై పోయాడు. తన ఆలోచనలన్నీ కౌముదే ఆక్రమించుకుంది.

రెండేళ్ళయింది తన పాపను చూచి. ఈపాటికి ముచ్చటగా పరుగెడుతూ పడుతూ లేస్తూ ఉంటుంది. అచ్చు వాళ్ళమ్మ పోలికేనని రాసింది, శకుంతల. పుట్టినరోజుకని మంచి గౌన్లవీ తీసుకుని వెళ్ళాడు. చిట్టిని చూడగానే తన మనస్సు ఉప్పొంగి పోయింది! అచ్చు వాళ్ళమ్మ పోలికే - కౌముదిని తన చిట్టితల్లిలో చూచుకుంటూ బ్రతకగలననుకున్నాడు. అయితే, తనను చూడగానే భయపడిపోయినట్టు పారిపోయింది! శకుంతల తీసుకువచ్చి "ఎవరే చిట్టీ" అంటూ తనను చూపితే, "చిన్న-నాన్న" అంటూ నట్టుతూ పలికింది, తన ప్రాణం చివుక్కుమంది!

రాత్రి బండికి తిరిగి ఇంటికి బయలుదేరాడు, రఘు. మళ్ళీ తన చిట్టితల్లి "టా-టా-చిన్న నాన్నా" అంది. తన హృదయం చితకపొడిచినట్టయింది! "నేను చిన్న నాన్ననా! నా కన్నతల్లికి నేను చిన్ననాన్ననా! నాన్న అనిపించుకునే అదృష్టమే లేదా నాకు! నా కౌముదితోపాటు నా కన్నకూతురు కూడా నాకు లేకుండా పోయినట్టేనా!" అనుకుంటూ, స్టేషనుకువచ్చి రైలులో కూలబడ్డాడు——

సాగిపోతున్న రైలుతో తన ఊహలు సాగుతున్నాయి. "నేనెవరిని? నా చిట్టితల్లికి నేనెవరిని!" ఆలోచనలలో, గత జీవితపు జ్ఞాపకాల ఊహాలలో, కన్నీటిలో, అలా ఉండిపోయాడు!

రైలు కూతకూసి మళ్ళీ కదిలిపోయేవరకూ తాను దిగవలసిన రాజమండ్రి వచ్చేసినట్టే తెలియదు!!

---

# కాంక్ష

## శ్రీ తిరునగరి

అందాల అడవుల్లో చెట్లనీడల్లో కూచొని
పద్యాలు రాసుకోవాలని ఉంది
సంధ్యవేళల్లో నదీతీరాల్లో నించొని
గీతాలు పాడుకోవాలని ఉంది
చల్లగాలులు శరీరాన్ని స్పృశించగా
సంసార బాధల్ని మరచిపోవాలని ఉంది
తీయని ప్రకృతి లాలనలో
గాయాల్ని మరచిపోవాలని ఉంది
ఈర్ష్యాద్వేషాలలౌకిక జగత్తుకి దూరంగా
ఏకాంతంగా అక్షరజగత్తులో విహరించాలని ఉంది
కమ్మని భావాలు హృదయంలో ఉదయించగా
రసలోకాల్లో తేలిపోవాలని ఉంది
అందాల అడవుల్లో చెట్లనీడల్లో కూచొని
అక్షర కవిత్వం రాసుకోవాలని ఉంది
సంధ్యవేళల్లో నదీతీరాల్లో నించొని
అమృతగీతం పాడుకోవాలని ఉంది
నాకు
రసలోకాల్లో
తేలిపోవాలని ఉంది.

కీ. శే. కె. కోదండరామయ్య

# అచ్యుతరాయశతకము: పరిశోధనలో లభ్యమైన కొన్ని నీతిపద్యములు

ఆంధ్ర భాషలోని వివిధ సాహిత్య ప్రక్రియలలో శతక వాఙ్మయ మొకభాగము. ఆంధ్ర భాషలోనున్నన్ని శతకములు భారతీయ భాషలలో దేనియందును లేదని చెప్పవచ్చును. ఈ శతకములు పెక్కు విధములుగ నున్నవి. అవి భక్తి శతకములు, వేదాంత శతకములు, నీతి శతకములు, శృంగార శతకములు, దూషణ వతకములు, హాస్యశతకములు మొదలైనవి. ఈ తెగకు చెందిన గ్రంథములలో రాజనీతి శతకములొకటి. ఆంధ్రభాషలోని శతకముల సంఖ్య యిన్ని యని కచ్చితముగా జెప్పుటకు కాదు. కాని, ఈ శతక వాఙ్మయమును గురించి, బ్రహ్మాండమగు పరిశోధనలను గావించి "శతక కవుల చరిత్ర"మను గ్రంథమును తొట్టతొలుత ప్రచురించినవారు మాన్యులు, ఆంధ్రభాషాభిమానులు కీ.శే. పండిత వంగూరి సుబ్బారావుగారు వారు దాదాపు ఆరు వందల శతకములను పరిశీలించినారని తెలియుచున్నది. కాని, యింకనూ ఎన్నో శతకములు వెలుగులోనికి రాక, మారుమూల గ్రామములందు శిధిలాతి శిధిలములగుచున్నవి. ఇవియేగాక లెక్కలేనన్ని ఆంధ్ర సాహిత్య తాళపత్ర గ్రంథప్రతులు క్రిముల కాహారమగుచు నశించుచున్నవి. తమిళ, కర్నాటక రాష్ట్రములలో వీనిని సేకరించు కార్యక్రమమును ప్రభుత్వ స్థాయిలో నిదివరకు ప్రారంభము జరుగుచున్నట్లు లేదు. కాని, యచ్చటచ్చట భాషాభిమానులు కొందరు, మాతృభాషయందలి గాఢమైన అభిమానముచే పురికొల్పబడి ఈ తాళపత్ర గ్రంథ సేకరణ గావించుచున్నారు కాని, యిదియొక బ్రహ్మాండమైన కార్యము. ధనైక సాధ్యమైనది. దీనికి ఆంధ్ర ప్రభుత్వమువారు ఆలస్యము చేయక దోడ్పడవలపియున్నది.

నేను హోసూరు, కోలారు మొదలగు ప్రాంతములందు సంచరించి, కొన్ని సంవత్సరములుగ ప్రాచీన తాళపత్ర గ్రంధములను సేకరించుచున్నాను. నా యీ ఉడుతభక్తిని, కృషిపీ "విద్యారత్న, పరిశోధనా పరమేశ్వరాది బిరుదాంకితు లగు శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు గుర్తించి, ప్రోత్సహించి యున్నారు. వారు తమ "దక్షిణదేశీయ వాఙ్మయమ"ను గ్రంథమున నిట్లు వ్రాసియున్నారు.

"ప్రస్తుతము గ్రంథము ద్వితీయ ముద్రణము, విషయ సేకరణమందేమి, విమర్శనాపథకము నందేమి, సాధ్యమగునంత వరకు సమగ్రముగ నుండురీతిని రచితమైనది. అయిన నింకను తాళపత్ర గ్రంథ పరిశోధన జరుగవలసియున్నది. నేడట్టి పరిశోధనము చేయుచున్నవారిలో నగ్రగణ్యుడు సేలము జిల్లా హోసూరు వాస్తవ్యులు శ్రీ కె. యస్. కోదండరామయ్యగారు. దక్షిణ ప్రాంతముల కవులీవర కపరిచితుల నెందరినో గురించి తెలిపిరి....వారి లేఖలనుబట్టి చూడగా నింకను దక్షిణప్రాంతమున, మైసూరు సీమలోను తెలుగు గ్రంథముల గూర్చి ఆన్వేషణ చేయవలసిన యావశ్యకమున్నట్లు స్పష్టమగుచున్నది. ఇట్టి యపూర్వ విషయముల దెలిపిన శ్రీ కోదండరామయ్యగారికీ పీఠిక మూలమున నా కృతజ్ఞతను దెలుపుకొనుచున్నాను. వారింకను తమ పరిశ్రమము నితోధికముగ కొనసాగింతురని యాశించుచున్నాను."

[చూ. ద. దే. ఆంధ్ర వాఙ్మయము. పీఠిక. పు. 7]

నేను సేకరించిన తాళపత్ర గ్రంథములలో గొన్ని యపూర్వ గ్రంథములు, కొన్ని గ్రంథ భాగములు, శతకములు, శతక భాగములు, దండకములు, చాటుపద్యములు మొదలగునవి యున్నవి. వీనినన్నిటిని జేర్చి, మా "సాంస్కృతిక సమితి" యధ్వర్యమున నొక పరిశోధనా విభాగను నేర్పరచి, ఆయా తాళపత్ర గ్రంధములను పరిశీలించుచున్నాము. ఈ పరిశీలనలో, కృష్ణదేవరాయలనాటి ఆ మహాచక్రవర్తి భువనవిజయ సాహిత్య గోష్ఠికి సంబంధించిన, మంచి పద్యములను రెంటిని "రాయలనాటి కొన్ని చాటు పద్యముల"ను శీర్షికక్రింద గత సంవత్సరమున

ప్రచురించినాము. మిక్కిలి కఠినముగా నుండు నీ పద్యములకు, పూజ్యులు శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు చక్కని వ్యాఖ్య వ్రాసియున్నారు.

ఆ తర్వాత, మా పరిశోధనలో అచ్యుతరాయలకు సంబంధించిన కొన్ని అపూర్వములైన పద్యములు లభించినవి. ఈ పద్యము లింతవరకు నెవరికిని లభించినట్లు గనబడదు. కాన, వానిని బ్రకటింపదలచినాము.

ప్రస్తుతమీ పద్యములలో ఏడు పద్యములు మాత్రము లభించియున్నవి. శతక పద్యములకు గడు ముఖ్యమగు మకుటమీ పద్యములకు గలవు. ఇవి సీసపద్యములు, "రాయదేవేంద్ర అచ్యుత రాయచంద్ర" యను చక్కని మకుటముతో నొప్పారుచున్నవి. ఆంధ్రభాషలో రాజులకు నీతులను దెలియజేయు పద్యములు గొన్ని చాటుపద్యములవలె లభించియున్నవి. కాని, ప్రత్యేకముగ శతకములున్నట్లు దెలియదు. విజయనగరమును క్రీ.శ. 1486 నుండి 1492 వరకు పాలించిన నరసింహరాయలకు రాజనీతులను దెలియజేయుచు వ్రాయబడిన కొన్ని పద్యములు "గుండభూపాల నరసింహ మండలేంద్ర" అను మకుటము గలవి లభించియున్నవి. వీనిని కీ.శే. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రులుగారు, తమ 'చాటుపద్య మణిమంజరి' (ప్రథమ భాగము)లో ప్రకటించినారు. పై మకుటమునుబట్టి జూచిన పై పద్యములొక శతకములోని భాగములని స్పష్టముగా దెలియుచున్నవి. ఇటీవల, పై శతకమునకు సంబంధించిన మరి రెండు పద్యములు నాకు లభించినవి. పిల్లలమఱ్ఱి పినవీరనకవి యీ పద్యములను రచియించి యుండవచ్చునని, పండితలోకము దలంచియున్నది.

దీనికి బిదప, కృష్ణదేవరాయలు ఆముక్తమాల్యదలో జెప్పియుండు రాజనీతి పద్యములున్నవి. ఇవి వేర్వేరు ఛందస్సులలో వ్రాయబడియున్నందున దానిని శతకమని చెప్పుటకు గాదు.

దీనికావల రాజనీతి శతకములోనివి యని చెప్పుటకు దగినవి ప్రస్తుతము లభించియుండు అచ్యుతరాయలను సంబోధించుచు చెప్పియుండు పద్యములు. నేడు కొన్ని పద్యములే దొరకియున్నను, మున్ముందీ ప్రాంతములందు దీనికి సంబంధించిన తతిమ్మా పద్యములు కూడ లభించవచ్చునను నమ్మకమున్నది. ఈ పద్యములను వ్రాసిన కవి యెవ్వరో నేడు లభించియుండు పద్యములనుండి తెలియదు. కాని, అచ్యుతరాయల కాలమున నతని ఆస్థాన పండితుడుగా నుండిన చింతలపూడి ఎల్లన కవీంద్రుడు రచియించియుండునని తలంచవచ్చును. ఈ కవి కృష్ణదేవరాయల అంత్యకాలమున, ఆతని యాస్థానమునకేగి, తాను రచించియుండిన 'రాధామాధవము' అను గ్రంథమును జూపి ఆ రాయల ప్రశంసలను, సత్కారమును గడించుటయేకాక, ఆతనినుండి, 'రాధా మాధవ కవి' యను బిరుదును గూడ గడించెనని తెలియుచున్నది. రాయల కాలమునకు తర్వాత, అచ్యుతదేవరాయలు పరిపాలించుచుండినపు డాతని ముఖ్యమంత్రియైన నంజయ తిమ్మయగారి అభిమానముకా కవి బ్రాత్రుడాయెననియు, ఆ సమయమున నతడు "తారకబ్రహ్మ రాజీయము", "విష్ణుమాయ నాటకము" అను గ్రంథములను రచించినట్లును తెలియుచున్నది. రాధామాధవ కావ్యమును రచించుటకుముందీ కవివర్యుడు కొన్ని శతకములను గూడ వ్రాసియుండెనట. ఈ విషయమును గురించి, "విమర్శకాదర్శక" బిరుదాంకితులు కీ.శే. నడకుదుటి వీరరాజు పంతులుగారిట్లు వ్రాసియున్నారు. "..........రాధామాధవ కావ్యము నందు గోచరించు "వల్లనీవల్లభా", "అంబికాధవా" అను మకుటములను గలిగిన పద్యములనుబట్టి చూడగా, నిక్కవి చంద్రుడు చిన్ననాడు హరిహర స్తవ రూపములగు శతకములను గూడ రచియించెనా యను భావము గలుగుచున్నది. ఈ ఆధారమును బట్టి, ఎల్లనార్యుడే యీ అచ్యుతరాయ శతకమును రచియించి యుండవచ్చునని తోచుచున్నది. "రాయదేవేంద్ర" అని ఈ కవి అచ్యుతరాయలను సంబోధించి యుండుటనుబట్టి, యీ శతకము క్రీ.శ. 1531-32వ సంవత్సరమున రచియింపబడియుండునని చెప్పవచ్చును. అచ్యుతరాయలు క్రీ.శ. 1530 నుండి 1542 వరకు విజయనగర సామ్రాజ్యమును పాలించెను. ఇతడు సైతము కవి పండిత పోషకుడని తెలియుచున్నది. ఈ విషయమును గురించి శ్రీ ఆరుద్రగారిట్లు వ్రాసియున్నారు. "అచ్యుత దేవరాయలు కూడ సాహిత్యపోషకుడే. ప్రతియేడూ ఒక గ్రంథం వ్రాయించి తిరుపతి వేంకటేశ్వరునికి సత్కావ్య పుష్పాంజలిగా సమర్పిస్తూ ఉంటాడు. తన ఉద్యోగులు కూడా తనలాగే కావ్యాలు వ్రాయించి దేవునికి అంకితం చేయిస్తే అచ్యుతరాయలు మెచ్చుకొంటాడు...." (చూ. స. ఆం. సా. భాగం 7-పుట 237, 238)

అచ్యుత శతకకర్త, పోతనామాత్య విరచితమైన భాగవతము, కవిసార్వభౌముడైన శ్రీనాథుని గ్రంథములలోనివి కొన్ని కొన్ని పద్యములను అనుకరించెనని, రాధా మాధవ కావ్యమునుండియేగాక, నేడు లభించియుండు అచ్యుతరాయ శతకమునుండియు దెలియుచున్నది. ఇంతేకాక, రాయల కృతి యగు ఆముక్తమాల్యదను కూడ నీకవి చదివియుండెననియు,

ప్రస్తుతము లభించియుండదు. పద్యములతో నొక పద్యమునుండి తెలియుచున్నది. "తానొచ్చియుండియు" సను సీసపద్యము తుద గల గీతపద్యములో కవి "వేడుకయ మున్నె యిచ్చుట వితరణంబు" అని చెప్పియున్నాడు. ఆముక్తమాల్యదలోని రాజనీతులలో కృష్ణరాయలు దానము చేయవలసిన విధమును గురించి యిట్లు చెప్పియున్నారు.

గీ॥ పాత్ర రీతులెన్న పరికించి, యతడడు
గకయు నొకడు సెప్పకయు మునుపుగ
నెఱిగ నొసగి పెఱుగు పఱచుటొప్పు".
(చూ. ఆము. ఆ. 4. ప. 274)

అచ్యుతరాయ శతకములో లభ్యమైన పద్యములు :

(1) సీ॥ కార్య నిర్వహణంబు - గలవాని దిగ ద్రోచి,
పందను పిలిచి చె - బట్టరాదు
పంద చేబట్టిన - ప్రభువు చిత్తంబెల్ల
గలగించు, ధైర్యంబు - మొలవనీడు
ప్రభువు మెత్త
బలముడిగిపోవుట - బంటుతనము
బలమును, శౌర్యంబు - పాటించకుండంగ
పగవారలకు నెక్కు - పౌరుషంబు
గీ॥ కాన, పందల దిగద్రోచి - మానఘనుల
పలుకు విని రాజు ధీరత - నించెనేని
బలము, శూరత పాటించు - పరుల గెల్చు
రాయ దేవేంద్ర అచ్యుత - రాయచంద్ర.

పిల్లలమఱ్ఱి పినవీరన కాబోలు, రాజనీతులను శతక రూపముగ వ్రాసి యాతని కొసంగెనని తెలియుచున్నది. ఆవల కృష్ణదేవ రాయలు తానే ఆముక్తమాల్యదలో ననుసరించిన రాజనీతులను వ్రాసియున్నాడు. ఆ తర్వాత కూడ యీ పద్ధతి సాగి, అచ్యుత రాయల కాలమందు కూడ రాజనీతులు వ్రాయబడి ఆతని కొసగ బడెనని నేడు వ్రాసుకొన్న పద్యములనుండి తెలియుచున్నది. నేను హోసూరు - కోలారు ప్రాంతాలలో తాళపత్రములను సేక రించుచుండగా, అచ్యుతరాయల కాలమున వ్రాయబడిన శతకము లోని కొన్ని పద్యములున్న తాళపత్రములు లభించినవి. ఈ ఆకులో 9 పద్యములు మాత్రమున్నవి. ఆ తాళపత్రములోని పద్యములను సుమారు 80 యేండ్లముందు ఎవ్వరో భాషాభిమాని యొకచోట కాగితాల పుస్తకములో వ్రాసియుంచుకొనియుండెను. ఈ పద్యములలో వాటి తుదను "రాయదేవేంద్ర అచ్యుతరాయ చంద్ర" అను మకుటమున్నది. అచ్యుతరాయ శతకములోనిది యైన నిది ఆతనికే అంకితమివ్వబడెను.

(2) ఆప్తుల పట్టున - నవనమ్మికలు బుట్ట
పలుకు వంచకుల చేబట్టరాదు,
అత్యంత హితులెడనప్తుల పట్టున
మది నొవ్వ పలుకుట మతము గాదు
వేళవచ్చినదాక విశ్వాసములు జూపు,
కపటాత్ము నెవ్వేళగాదు నమ్మ
ప్రబలి మీదను సహం-బ్రహ్మత్వ మనుచును
తలచువారల బెంచ దగదు మిగుల
గీ॥ కార్యదక్షుని గాజేయ - గాదుఖలుని
భోగ భాగ్యంబులిచ్చిన - పొసగుగాని
పుత్రులకునైన వినయంబు - ప్రోదివలయు
రాయదేవేంద్ర - అచ్యుతరాయచంద్ర.

సంజరాజు ఆ ఎల్లయకవిని రాజనీతులను వ్రాసియిమ్మని కోరి యుండును కాన, ఈ శతకము క్రీ.శ. 1534-35 సంవత్సరముల ప్రాంతమున రచయింపబడుయుండునని తలంపవచ్చును. నేడు నాకు 9 పద్యములు మాత్రము లభించియున్నవి. ఇంకను తక్కిన పద్యములు వివిధ ప్రాంతములలో పరిశోధించిన పక్షమున లభించగలవని చెప్పవచ్చును. హోసూరు తాలూకా ఆంధ్ర సాంస్కృతిక సమితి ప్రాచీన సంస్కృతాంధ్ర తాళపత్రములను సేకరించి, వానియందు పరిశోధనా కార్యమును కొనసాగించు చున్నది. ఇది చాలా కష్టమైన పని. ధనైకసాధ్యమైనది. కాన ఈ సమితి చేబట్టియుండు ఈ కార్యము నిరాటంకముగ కొనసాగు టకు ఆంధ్ర మహాశయుల ఆదరాభిమానములు, చాలా అవసర మగుచున్నవి. అవి లభించగలవని ఆశిస్తున్నాను.

సీ॥ ప్రజలెల్ల తమపాలి - భాగ్యదేవత యన
రాజ్యంబు పాలించు - రాజు, రాజు
ఫలసిద్ధి యగుదాక - పల్లెత్తకుండగ,
మంత్రంబు రక్షించు - మంత్రి, మంత్రి
దేవ విప్రార్చన - దీనుడై శుభమొన
ర్చు పురోహితుండు, పురోహితుండు
పనికల్గు వేళల - ప్రాణంబు నిత్యంబు
పతి కర్పణముజేయు - భటుడు, భటుడు

తే॥గీ॥ ఆతడప్పుడు ధరపాలు - డతడు మంత్రి
అతడు సుమ్మె పురోహితుం - డతడు బంటు
ఇట్టి వారికి శుభము చేపట్టు టరుదె
రాయ దేవేంద్ర అచ్యుత - రాయచంద్ర!

ఇట్లనుట సహజమే.

కా ల ము :

కృష్ణరాయలు 1530లో మరణించిన వెంటనే అచ్యుత రాయలు రాజ్యమునకు వచ్చినను కృష్ణరాయల అల్లుడగు అళియ రాజునకు ఆతనికి సరిపడనందున, సింహాసనమునకై పరస్ప రము కలహించుచుండిరని తెలియుచున్నది. కాని, తుదకు వారిరువురును సర్దుకొనినందున అచ్చట ఈ అలజడులు 2-3 సంవత్సరములలో సమసిపోయి అచ్యుతరాయలు నెమ్మదిగ పాలించసాగెను. ఇట్లు అచ్యుతరాయలు నెమ్మది గలిగిన

ననిన, ఆతడా రాయల సమీపస్థుడుగను, పోషితుడుగను నుండవలయును. క్రొత్తగా వచ్చిన కవి ఆ కార్యమును చేయ జాలడు. మనకు తెలిసినంతవరకు, నంజమంత్రి పరమాభిమానము నకు పాత్రుడైనవాడును, తద్వారా అచ్యుతరాయలకు చిరపరిచితు డైనవాడును అగు రాధామాధవ బిరుదాంకితుడగు ఎల్లయకవి యొకడే. ఈతడతని కవితాచాతుర్యముచేత, రాయల భువన విజయ విద్వత్సభా భవనములో, అష్టదిగ్గజ కవుల సమక్షమున రాయలను మెప్పించి బిరుదు గడించినవాడైనందున, అచ్యుత రాయలు కూడ నాతనిపట్ల ఆదరాభిమానములు, గౌరవమును గలిగియుండెనని చెప్పవచ్చును. ఇట్టి పరిస్థితినిబట్టి ఎల్లయ కవియే పై శతకమును రచియించి ఆతని కొసగి సన్మానింపబడి యుంటాడని చెప్పవచ్చును.

సాధారణముగా నొకరాజు సింహాసనమునకు వచ్చినప్పు డొక కవి ఆ రాజు తన రాజ్యమును చక్కగా, ప్రజారంజకముగ పరిపాలించుట కవసరమైన రాజనీతులను పూర్వకాలమున తెలియజేయుచుండిరని ఆ కారణమునుబట్టియే కాబోలు అచ్యుత రాయల మంత్రియైన నంజవిభుడు అచ్యుతరాయలు సింహాసనము నకు వచ్చిన పిదప తన ఆశ్రితకవియైన ఎల్లయకు జెప్పి రాజ నీతులను పద్యరూపమున వ్రాయించి యిచ్చియుండునని చెప్ప వచ్చును. ఈ విషయమును గురించి వివరము లింతవరకూ సరిగా దెలియలేదు. ఆతని యాస్థానకవి గాకున్నను, ఆతని మంత్రియైన నంజవిభుని ఆశ్రయించి ఆతని కోరిక ననుసరించి వ్రాసిన "తారకబ్రహ్మ రాజీయము" అను గ్రంథమునుండి అచ్యుతరాయల సాహిత్య పోషణమును గురించి కొంత తెలియు చున్నది. దీనినుండి అచ్యుతరాయలు ప్రతి సంవత్సరము శ్రీ వేంకటేశ్వరునకు సత్కావ్య ప్రబంధ పుష్పాంజలి సమ ర్పించుచుండెనని తెలియుచున్నది. ఇంతేకాక, నంజరాజు తన కొక పుణ్యప్రబంధమును రచియించి యిమ్మని యల్లయకవిని కోరుటకు ముందు తన అభిప్రాయమును అచ్యుతరాయలకు చెప్పి, ఆతని అనుమతిని గొనెనను విషయమునుండి ఆ చక్రవర్తికి సాహిత్యాభిమానమే కాక విశాల భావములుండినవని కూడ తెలియుచున్నది కాని ఆతడు వ్రాయించి, మరియు అంకితము గొన్న గ్రంథమొక్కటి గూడ నేడు మనకు లభించలేదు.

ఆంధ్రభాషయందు రాజనీతులను దెలియజేయు శతక రచన విజయనగర సామ్రాజ్యము నేలిన (1486-1492) సాళువ నరసింహరాయల కాలమందే ప్రారంభమైనదని చెప్పవచ్చును. అతని యాస్థాన ప్రముఖ కవియైన పిల్లలమఱ్ఱి పినవీరన కాబోలు, రాజనీతులను శతక రూపమున వ్రాసి యాతని కొసంగె నని తెలియుచున్నది. ఆవల కృష్ణదేవరాయలు తానే ఆముక్త మాల్యదలో తాననుసరించిన రాజనీతులను వ్రాసియున్నాడు. ఆ తర్వాత కూడ యీ పద్ధతి సాగి, అచ్యుతరాయల కాలమందు కూడ రాజనీతులను వ్రాయబడి ఆతని కొసగబడెనని నేను వ్రాసు కొన్న పద్యములనుండి తెలియుచున్నది. నేను హోసూరు మరియు కోలారు ప్రాంతాలలో తాళపత్రములను సేకరించుచుండగా, అచ్యుతరాయల కాలమున వ్రాయబడిన శతకములోని కొన్ని పద్యములు గల తాళపత్రములు లభించినవి. ఇందులో 9 పద్య ములు మాత్రమున్నవి. ఈ తాళపత్రములోని పద్యములను సుమారు 80 ఏండ్లముందు ఎవ్వరో భాషాభిమాని యొకడు మోటు కాగితాల పుస్తకములో వ్రాసియుంచుకొని యుండెను. ఈ పద్యము లన్నింటి తుదను "రాయదేవేంద్ర అచ్యుతరాయచంద్ర" అను మకుటముతో రచియింపబడినది. ఇది అచ్యుతరాయ శతక మందలిది. అచ్యుతరాయలకిది అంకితమివ్వబడెను. అచ్యుత

రాయలకు మంత్రిగా నుండిన నంజరాజు, ఆ ఎల్లయకవిని రాజ నీతులను వ్రాసియిమ్మని కోరియుండును కాన ఈ శతకము క్రీ.శ. **1534-35** సంవత్సరముల ప్రాంతమున రచియించబడియుండునని తలంపవచ్చును.

నేడు నాకు 9 పద్యములు మాత్రము లభించియున్నవి. ఇంకను తక్కిన పద్యములు వివిధ ప్రాంతములలో పరిశోధించిన పక్షమున లభించగలవని చెప్పవచ్చును.

(4) సీ॥ హరికథామృతసార - మనిశంబు గ్రోలని,
చెవులు రాట్నంబుల - చెవులు గాదె
హరినామ కీర్తనం - బందంద మెదలని
పలుకది కలుబంద - పలుకుగాదె
హరియు విశ్వాత్మకుం - డని బుద్ధి తెలియని
తెలివది శవశక్తి - తెలివిగాదె
హరియు జగత్కర్త - యనుచు బోధింపని
చదువెన్నదది - చిల్కచదువు గాదె

గీ॥ గానహరి భక్తి గల్గిన - కలిమి కలిమి
లేకయుండిన సకలంబు - లేదు గాన
జనుల కెల్లను నిదిగాదె - జన్మఫలము
రాయదేవేంద్ర యచ్యుత - రాయచంద్ర

(5) సత్యంబు హరికథా - సంకీర్తనంబును,
జిహ్వాకమృతసం - సేవనంబు,
కాశీపురంబును - గంగాతరంగిణిన్
కనుగొంట కన్నులు - గల ఫలంబు,
సద్గురు మంత్రంబు - శాస్త్ర రహస్యంబు,
వినుకర్ణములకును - వింతతొడవు,
అర్థుల కిచ్చుట - యరుల మర్దించుట
కరయుగంబున కలం - కార మహిమ

గీ॥ పరుష భాషల వర్జించి - పరుల సతుల
దిక్కు చూడక కొండెంబు - తివిరి వినక
పరుల ధనములు గైకోక - భవ్యమతిని
రాయదేవేంద్ర అచ్యుత - రాయచంద్ర.

(6) సీ॥ బలతంత్ర సంపద - గలవాని కిరవుగా
విడిచిన చోకెల్ల - వీడుగాదె,
తన భుజశక్తి నమ్మిన యట్టివానికి
తురగంబు, ఖడ్గంబు - తోడుగాదె
ఆహవసంరంభి - యగువాని కుత్సాహ
శూరత్వములు రెండు - జోడుగాదె
పరబల గ్రహణైక - బలతంత్ర వృత్తికి
ధైర్యకీర్తులు నల్లె - త్రాడుగాదె

గీ॥ ఆత్మసైన్యంబు దివిచిన - యట్టివేళ
వెరవ కరులను మర్థించు - వీరవరుని
కీశ్వరుండును రఘురాము - డీడుగారె
రాయదేవేంద్ర అచ్యుత - రాయచంద్ర॥

(7) సీ॥ తానొచ్చియుండియు - దీనత జూపక
గంభీరుడై యుంట - గౌరవంబు
బలశౌర్యములు గల - పగవారి మీదట
శంకింపగ దగుట - సాహసంబు
సరివారి కెప్పుడు - సంపద గలదని
లజ్జింప కరగుట - లాఘవంబు
పగవాడు చిక్కచే - పడిన దండింపక
పాలింప నేర్చుట - పౌరుషంబు

గీ॥ ప్రజల దూషింపకుండుట - ప్రాభవంబు
వేడకయ మున్నెయిచ్చుట - వితరణంబు
.... .... .... .... .... .... .... ....
రాయదేవేంద్ర అచ్యుత - రాయచంద్ర!

(ఈ వ్యాసాన్ని సేకరించి పంపినవారు శ్రీ కారుపల్లి విశ్వనాథంగారు)

# కలగూరగంప

## తెలుగులో మరో 'ఊర్వశి'

మార్చి '89 'భారతి' కలగూరగంపలో భారతీయ సాహిత్యంలో 'ఊర్వశీ తత్వము'ను గురించి డా॥ కట్టూరి శ్యామలగారు వ్రాశారు. తెలుగులో ఊర్వశిని గురించి దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి కవితలను, చలంగారి 'పురూరవ' నాటకమును గురించి క్లుప్తంగా విశ్లేషించారు. శ్రీ చాగంటి గోపాలకృష్ణ మూర్తిగారు మరో 'ఊర్వశి' సృష్టించటానికి అంకురార్పణ చేశారన్నారు. వీరుకాక 'ఊర్వశి' కావ్యకర్తలుగ శ్రీ పొట్లపల్లి సీతారామరావుగారు పేర్కొనదగినవారు.

వారు తమ కావ్యాదిలో 'ఒక్కమాట....' అంటూ "ఊర్వశి. ఒక కాంతిమూర్తి. తన్మూర్తిభావనలో పరబ్రహ్మ స్వరూపిణిగా గోచరించినది. నాలో నొక యుత్కంఠ రేకెత్తించినది." పరమాత్మలో నంతర్లయించుటకు జీవుడు పొందెడి యుత్కంఠ యిందలి ప్రధాన వ్యంగ్యము. పురూరవునిగా నారో పించుకొనిన కవి స్వీయ వేదనానుభవము - ఇందు వాచ్యార్థము. కావ్యములోని ప్రత్యణువు నొక యపూర్వ సౌందర్యవతిని-ఆమె కొరకు పురూరవుడు కవిగా పొందెడు రసానుభూతిని-విని గమకము చేయుట యీ కావ్యములోని మరొక విశిష్టత" అని వ్రాశారు.

ఆత్మాశ్రయ కవితాధోరణిలో వ్రాసిన యీ కావ్యము రసప్లావితమైనది.

'ఊర్వశి' తమకు ప్రత్యక్షమైన తీరును శ్రీ సీతారామ రావుగారు యిలా చిత్రించారు.

> "గాలి యీలలు వెన్నెల గలసి యాడు
> వేళ, గజ్జియరవళి విన్పించి పాద
> చాలనావేళ నృత్యసంచారి, సన్న
> తాంగి యూర్వశి నాకు బ్రత్యక్షమయ్యె"

> "ఏలాలతాజాల డోలా విహారాల
> బాలాహుణుల యేలపాటవోలె
> గాలిలో సుమరాజ పాళిలో విహరించు
> దేటి బోటుల గొంతు తేటవోలె
> మావిపై తన గొంతు క్రోవియై ప్రలపించు
> కొాదమ కోయిలలేత కూతవోలె
> విలవిలై సెలయేటి యలలపై దూగాడు
> గాలి గాయనుని రాగాలు వోలె

> ఎదొ మధురమైన యనుభూతి, ఎదొ మహోజ్వ
> లానుభవంబు, రసభావ మభిసురించి
> నా యెడద లోతులందు స్పందనము జెంది
> నిలుపు నిలువున బులకించి నిలిచిపోతి"

'ఊర్వశి' తనను కవిని జేసినదంటూ:

> నన్ను గవిని జేసినావు నా హృదయాన
> నులికి పైకిరాని గుబులు మార్చి
> గొంతు పెగులు చిన్నికోయిల కూతగా
> కావ్యమార్గ మొలయ గదిపినావు' అన్నారు

ఈ కావ్యరచనలో విశ్వనాథ, దేవులపల్లివార్ల ప్రభావం అనివార్యమైనదిగా వున్నదని శ్రీ రావుగారే చెప్పికొన్నారు. తెలుగులో 'ఊర్వశి' నాయికగా వెలువడిన కావ్యాలలో గణనీయమైనదీ కృతి.

—జానమద్ది హనుమచ్ఛాస్త్రి

## ప్రతీకవాదం

ఏప్రిల్, 1989 'భారతి'లో శ్రీ పెన్నా శివరామకృష్ణగారి 'ప్రతీక : పరిశీలన' అనే వ్యాసం చదివాను. అది చాలా విశిష్టము, ప్రయోజనాత్మకము అయిన రచన. భావప్రేరకము. అందులో ప్రతి విషయము ఇంకా నిశితంగా అధ్యయనంచేసి, విమర్శించవలసిందే. ఇంత చక్కని వ్యాసం రాసినందుకు వారి నభినందిస్తున్నాను. ప్రస్తుతం వారి వ్యాసం చదివాక నాకు తోచిన రెండు మూడు విషయాలపై నా అభిప్రాయాలను క్లుప్తంగా వివరిస్తాను.

జటిలమైన శాస్త్ర సిద్ధాంతాలను చర్చించే సందర్భంలో భావాభివ్యక్తి విషయంలో ప్రత్యేక శ్రద్ధ తీసుకోవాలి. భాష, వాక్య నిర్మాణం సాధ్యమైనంత సుగమం, సుబోధకం కావాలి.

శ్రీరామకృష్ణగారు ఈ వ్యాసాన్ని ఎంతో శ్రద్ధతో రచించారు. అయినా పునఃపరిశీలన చేసినట్లు కనిపించదు. ఒకటి రెండుచోట్ల వాక్యాలు దురవబోధకంగా ఉన్నాయి. ఉదాహరణకు ఈ క్రింది వాక్యాలు పరికించండి:

"భావానికి సంకేతమైన భాషద్వారా సమస్త సృష్టిని మానవుడు అభీష్టానుగుణమైన వస్తునిర్మాణంచేత నింపివేశాడు. సమస్త విశ్వానికి ప్రతీక మనిషి అయితే మానవుని భావాలకు ప్రతీకలే నిర్మిత వస్తుజాతం. ఈ విధంగా ప్రాథమికావస్థనుండి మానవ సంస్కృతి వికాసానికి ప్రతీకాత్మక ప్రవృత్తి దోహదం చేసినట్లు తెలుస్తుంది." ఇక్కడ 'సంకేతము' 'ప్రతీక' ఒకే అర్థంలో వాడినట్లు కనిపిస్తోంది. వస్తువు, భావం, ప్రతీక-వీటి మధ్య సంబంధం ఇక్కడ ఉద్దేశించబడినా, సుష్ఠుగా వ్యక్తం కాలేదు.

ఇంకో ఉదాహరణ: "అదేవిధంగా వారు ప్రస్తుతీకరించిన కర్మకాండలు కేవలం భౌతిక ప్రక్రియలు కావు." ఇక్కడ 'ప్రస్తుతీకరించగం' సద్యఃస్ఫూర్తి నివ్వడంలేదు.

మరొకటి : "అనుభూతికి ఆకరమైన 'అంశం' ఆ అనుభూతి గాఢత వలన అచేతన స్థాయికి చేర్చి దాని భౌతికమైన ఆకృతిని కోల్పోతుంది." 'చేర్చి' ముద్రణా స్ఖాలిత్యమనుకుంటా. ఈ వాక్యం బహుశా ఫ్రాయిడ్ సిద్ధాంతాన్ని మనసులో పెట్టుకొని రాసిఉంటారు. కార్ల్‌యుంగ్ ప్రతిపాదించిన 'సామూహిక చైతన్యం' [కలెక్టివ్ అన్‌కాన్షస్]ను కూడా తడవి ఉంటే తరువాత 'ప్రతీకవాదం' పౌరాణిక, ప్రాగ్రూప విమర్శ (మిక్ అండ్ ఆర్కిటైప్)కు ఎలా దోహదం చేసిందో స్పష్టమై ఉండేది.

పునఃపరిశీలన లేకపోవడంవల్లనేనేమో, ఒక వైరుధ్యం కూడా ఈ వ్యాసంలో చోటుచేసుకుంది. సింబలిస్టు ఉద్యమ నేపథ్యాన్ని వివరిస్తూ ఆంగ్ల కాల్పనిక కవులు, వాగ్నర్ మొ॥ జర్మన్ రచయితలు ఈ ఉద్యమానికి స్ఫూర్తినిచ్చి ఉండవచ్చని బెజామిన్ అభిప్రాయాన్ని ఉట్టంకించారు. కొన్ని పేరగ్రాఫుల తరువాత వారే మళ్ళీ ఇలా రాశారు. "ప్రపంచ సాహిత్యాలన్నిటి మీద ప్రతీకవాద ప్రభావముంది. బర్క్‌లీ, కీట్స్, కార్లైల్, షెల్లీ, రస్కిన్, రోజెట్టీ, మోరిస్, స్విన్‌బర్న్, వాల్టర్ పేటర్ మొదలైన బ్రిటిష్ రచయితలమీద, షెల్లింగ్, ఫిక్టె, హెగెల్, హోల్డరిన్, హాఫ్‌మన్, షాపెన్ హావ్వర్, వాగ్నర్ మొదలైన జర్మన్ రచయితలమీద ప్రతీకవాద ప్రభావముంది." పందొమ్మిదవ శతాబ్ది చివరి రెండు దశాబ్దాల్లో ప్రవర్తిల్లిన 'ప్రతీకవాదం' తత్పూర్వులు మార్గదర్శకులు అయిన కవులను, రచయితలను ఎలా ప్రభావితం చెయ్యగలదు? ఇక ఏట్స్‌కు సింబలిస్టు ఉద్యమంతో బాగా పరిచయం ఉన్నా, వారినుండి నేర్చుకున్నది తక్కువే. డిలాన్‌థామస్ పై రాంబో ప్రభావం ఉందని చాలామంది అభిప్రాయపడ్డా, థామస్ మాత్రం రాంబో కవితను తాను చదవలేదన్నాడు. అయితే అతడు సింబలిస్టు పద్ధతిలోనే భాషను ఉపయోగించడం. భావచిత్రాలు (ఇమేజి) నిర్మించడం మాత్రం స్పష్టం.

ఈ వ్యాసంలో సింబలిస్టులు ప్రతిపాదించిన 'సింబల్'ను తాత్త్వికదృష్టితో ఆవిష్కరించారు. ముఖ్యంగా వైదిక ప్రతీకలతో సామ్యం సూచించారు. "అది సింబలిస్టు అనే ఒక ద్రష్ట చూసిన దృశ్యాలు. ఆ ద్రష్టకు సిద్ధించిన దార్శనిక అనుభూతులు" అన్న గుంటూరివారి అభిప్రాయాన్ని ఉట్టంకించారు. బాగుంది. కాని సింబలిస్టు కవులకు కలిగిన దార్శనికానుభూతి, మంత్రద్రష్టలైన మహర్షుల దార్శనికానుభూతి ఒక కోవలోనివేనా అని సందేహం మన మంత్రద్రష్టలు బుద్ధిని నియంత్రించి, మనోలయం చేసుకుని, సత్యాన్ని దర్శించారు. సింబలిస్టులు తద్భిన్నమైన మార్గంలో సత్యదర్శనం చేశారు. మద్యపానం, మాదకద్రవ్యాల వాడకం, లైంగిక వ్యాపారం మొదలైన పద్ధతులద్వారా మనస్సును బుద్ధిబారినుంచి తప్పించారు. కాని మనోలయం లేదు. సుప్త చైతన్యంనుంచి 'సింబల్స్' వెలువడ్డాయి. ఈ సృజనాత్మక వ్యాపారంలో 'సింబలిస్టు'లకు లభించిన జ్ఞానం వారికి నైరాశ్యాన్నే మిగిల్చింది. వారిని జీవిత పరాఙ్ముఖులను చేసింది. వైదికఋషుల విషయంలో మానసికస్థితి వేరు. వారు దర్శించింది పశ్యంతీ వాక్కు. వారు విన్నవీ, కన్నవీ అతి మానసికానికి సంబంధించినవి. అందుచేత దార్శనికత్వ, అనుభవంలో సింబలిస్టులకు, వైదిక ఋషులకు మధ్య సామ్యం కనిపించినా, వైషమ్యమే ఎక్కువ. ఋషులలో నైరాశ్యం లేదు. నిండుగా జీవించారు.

'సింబలిజం'కు సృజనశక్తి నాపాదించి, ధ్వనికన్న చాలా విశిష్టమైనదని వైయక్తిక వ్యాపారమని వ్యాఖ్యానించారు గుంటూరివారు. ఈ వ్యాఖ్య కొంతవరకైనా 'సింబలిస్టు'ల 'సింబలిజా'నికి వర్తిస్తుంది కాని, 'సింబలిజం' అంతకీ వర్తించదు. 'సింబల్' (ప్రతీక) సర్వ సాహిత్య సామాన్య లక్షణం. పందొమ్మిదవ శతాబ్ది చివరిభాగంలో ప్రవర్తిల్లిన 'సింబలిస్టుల' 'సింబల్' ప్రత్యేకమైనది. అనన్యమైనది. అయినా

దీనికి కూడా సృజనాత్మకత నాపాదించడం సర్వసమ్మతం కాదు. ఇది ఒక 'సూపర్‌స్టిషన్' [అంధ విశ్వాసం] అంటాడు ప్రఖ్యాత విమర్శకుడు అలెన్‌టాటే - "ఎ సూపర్‌స్టిషన్ దట్ కమ్జ్ డౌన్ ఇన్ ఫ్రెంచ్ ఫ్రమ్ ఋంబ్రెమో, రాంబో, మలార్మే టు ది సర్రియలిస్ట్స్, అండ్ ఇన్ ఇంగ్లిష్ టు హార్ట్‌క్రేన్, విలియం వేలస్ అండ్ డిలాన్ థామస్." [లిటరరీ క్రిటిసిజం : ఎ షార్ట్ హిస్టరీ - విలియం వింసెట్ అండ్ క్లెన్త్ బ్రూక్స్, పేజీ 584.]

—డాక్టర్ గంటి శ్రీరామమూర్తి

# అనేక అపవాదాల నిత్యవిధి

చిన్నయసూరి బాలవ్యాకరణం సంధి పరిచ్ఛేదంలోని మొట్టమొదటి సూత్రం ఉత్వసంధికి సంబంధించినది. అది **"ఉత్తున కచ్చు పరంబగునపుడు సంధియగు"**. ఈ సూత్రాన్ని పాఠశాలల్లో, కళాశాలల్లో అధ్యాపకులు సర్వసాధారణంగా 'ఉత్తున కచ్చు పరంబగునపుడు సంధి నిత్యము" అనేవిధంగా వల్లెవేయించడం కద్దు. 'సంధియగు' అని అనడం ద్వారా చిన్నయసూరి నిత్యం అని ఉద్దేశ్యించాడుగానీ వాచ్యం చేయలేదు. నిత్యవిధి ఉన్న మరికొన్ని సందర్భాల్లో కూడ 'సంధియగు' అనే అన్నాడు. ("మధ్యమపురుష క్రియల యందిత్తునకు సంధియగు" మొదలైనవి)

అకారాదిక్రమాన్ని పదిలిపెట్టి, ప్రారంభంలోనే ఉత్వ సంధిని చిన్నయసూరి చెప్పడంలోని ఉద్దేశ్యం మొదలుపెడుతూనే వైకల్పిక, బహుళ విధుల బదులు నిత్యవిధిని చెప్పాలనే ఔచిత్యదృష్టి మాత్రమే. కాబట్టి ఉత్వసంధి నిత్యవిధి అనడంలో సందేహం లేదు. కానీ, ఈ నిత్యవిధి విషయంలో ఉన్నన్ని అపవాదాలు మరే యితర సంధిలోనూ కనిపించవు.

ఉత్వసంధికి పేర్కొన్న ఉదాహరణలలో

రాముడు+అతడు → రాముడతడు

అతడు+ఎక్కడ → అతడెక్కడ

-ఇత్యాదులతోబాటు, మనము+ఉంటిమి → మనముంటిమి అనేది కూడా ఉన్నది. ఇందులో ఉత్తరపదం క్రియాపదం. అంటే కేవలం ఉత్తున కచ్చు పరమవడమే ముఖ్యంగానీ, ఆ పరాచ్చు నామబంధానికి చెందినదా, క్రియాపదానికి సంబంధించినదా అనే నియమమేమీ లేదని స్పష్టం. సూత్రం చెప్పిన తరువాత సంధి అంటే ఏమిటో నిర్వచించాడుగానీ, అసలైన సూత్రానికి ఏ వార్తికమూ, అపవాదమూ లేకుండా పటిష్టంగా సూత్రం చెప్పాడు సూరి. ఇంతటి పటిష్టమైన సూత్రానికి ఎన్ని అపవాదాలున్నాయో పరిశీలిద్దాం.

కుఱు — ఉసురు

చిఱు — ఎలుక

నిడు — ఊరుపు

-ఇత్యాదిగా కుఱు, చిఱు, కడు, నడు, నిడు శబ్దాలలో ఱ, డ, లకు అచ్చు పరమైనపుడు ద్విరుక్తటకారం నిత్యంగా ఆదేశమై కుట్టుసురు, చిట్టెలుక, నిట్టూరుపు వంటి రూపాలేర్పడుతున్నాయి. ఇక్కడ కూడా ఉత్తున కచ్చు పరమయింది. కానీ ఉత్వసంధి జరగలేదు. ఈ ఐదు శబ్దాలకు మరో సూత్రం ఆవశ్యకమయింది.

కఱకు — అమ్ము

నిగ్గు — అద్దము

-ఇత్యాది కర్మధారయ సమాసాలలో టుగాగమం నిత్యంగా ప్రవర్తిస్తున్నది. ఇక్కడ ఉత్వసంధి జరిగితే 'కఱకమ్ము', 'నిగ్గద్దము' వంటి అనిష్టరూపాలు సిద్ధిస్తాయి. వాస్తవానికి ఇక్కడ కూడా ఉత్తున కచ్చు పరమవుతునే ఉన్నది. అందువల్ల "కర్మ ధారయంబునందుత్తున కచ్చు పరంబగునపుడు టుగాగమంబగు (సంధి_) అని సూత్రీకరించవలసి వచ్చింది.

ఇదేవిధంగా పేరు, చిగురు, పొదరు మొదలైన ఉదంతాలైన పేర్వాదులకు అచ్చు పరమైనపుడు కూడా ఉత్వసంధి నిత్యంగా ప్రవర్తించడంలేదు. టుగాగమం వైభాషికంగా విధించబడింది గాబట్టి, టుగాగమం రానపుడు ఉత్వసంధి ప్రవర్తించి పేరురము, చిగురాకు వంటి రూపాలేర్పడుతున్నాయి. టుగాగమం వచ్చి పేరుటురము, చిగురుటాకు వంటి రూపాలు 'సరాసరి' ఉత్వసంధిని వారిస్తున్నాయి. సరాసరి అనడంలో ఉద్దేశ్యమేమిటంటే, టుగాగమం అంటే 'టు' వచ్చి పేరు+టు+ఉరము అని ఏర్పడి, ఆగమ టు తో ఉత్వసంధి జరుగుతున్నది గదా అనే ప్రశ్న రాకుండాననన్న మాట [1]

1. టుగాగమ, రుగాగమ సందర్భాలలో టు, రు లకు అచ్చు పరమై ఉత్వసంధే జరిగిందనే వాదన అంగీకార్యం కాదు. అక్కడ ఆగమంగా వచ్చేవి ట్, ర్ లు మాత్రమే. ఉచ్చారణ సౌకర్యం కోసం వాటిని ఉత్వవిశిష్టంగా పలకడం జరుగుతోంది. ద్రుతమైన 'ను' విషయం కూడా అటువంటిదే. కానీ కొందరు వ్యాఖ్యాతలు, చిన్నయసూరి పూచెను, నెగడెను ఇత్యాది రూపాలు పేర్కొన్నాడు గాబట్టి ఉత్వ విశిష్టమైన నకారమే ద్రుతమని అభిప్రాయపడుతున్నారు. కానీ, అది

చేయు — అతడు

చేసెడు — అతడు

మొదలైన పరిసరాలలో నుగాగమం నిత్యంగా జరిగి చేయునతడు, చేసెడునతడు అనే రూపాలు సిద్ధిస్తున్నాయి. ఇక్కడ కూడా ఉత్వసంధి నివారించబడింది. ఉత్వసంధి ప్రవర్తిస్తే చేయతడు, చేసెడతడు వంటి అనిష్ట రూపాలు ఏర్పడుతాయి. ఇక్కడ నుగాగమాన్ని విధిస్తున్న సూత్రం "ఉదంతంబగు తద్ధర్మార్థ విశేషణమున కచ్చు పరమగునపుడు నుగాగమంబగు (సంధి— )

ఇదేవిధంగా మరో సందర్భంలో కూడా నుగాగమం నిత్యంగా ప్రవర్తిస్తూ ఉత్వసంధిని నివారిస్తున్నది. ఆ సందర్భం ఏమిటంటే "షష్ఠీ సమాసమునం దుకార ఋకారముల కచ్చు పరమగునపుడు నుగాగమంబగు (సంధి—) ఇందుకు ఉత్తునకచ్చు పరమైన ఉదాహరణ రాజు — ఆజ్ఞ → రాజునాజ్ఞ. ఇక్కడ ఉత్వసంధి జరిగితే 'రాజాజ్ఞ' అవుతుంది. అపుడు అది రాజ+ఆజ్ఞ అనేవిధంగా సవర్ణదీర్ఘసంధి జరిగి ఏర్పడిన సిద్ధ సమాసం అవుతుందిగానీ రాజునాజ్ఞ వంటి సాధ్యసమాసం కాజాలదు.

ఇంతవరకు పేర్కొన్న టుగాగమ, రుగాగమ, నుగాగమ సందర్భాలలో సూత్రంలోగానీ, ఉదాహరణ లన్నిటిలోగానీ (విధాతృ — ఆజ్ఞలో తప్ప) ఉత్తునకు అచ్చు పరమైన గతి ఉన్నది. ఇంతేగాకుండా, ఇతర సందర్భాలలో కూడా ఉదంత శబ్దాలకు అచ్చు పరమైన సందర్భాలున్నాయి. 'ఎదురు' శబ్దం కడాదులలో చేరినది. "ఆమ్రేడితంబు పరంబగునపుడు కడాదుల తొలి యచ్చుమీది వర్ణంబులకెల్ల నదంతంబగు ద్విరుక్త టకారంబగు (సంధి — 40)"

ఎదురు + ఎదురు → ఎట్టయెదురు అవుతున్నది.

సమంజసం కాదు. ఇదంత నామానికి 'ను' పరమైనపుడు స్వరాకర్షణవల్ల 'ని'గా మారుతోంది. (హరి+ను→హరిని) అపుడు ఉత్వవిశిష్టమైన అనడంవల్ల అవ్యాప్తి కలిగి 'ని' ద్రుతం కాకుండా పోతుంది. 'ఏకదేశ వికృతమనన్యవత్' అనే పరిభాష ద్వారా సమర్థించుకోవచ్చు గానీ, ఉత్వవిశిష్ట నకారమే ద్రుతమని సూరి భావించినపుడు 'నకారంబు ద్రుతంబు' (సంజ్ఞా-11) అని చెప్పవలసిన అవసరమేముంది? 'కారము' చేర్చి చెప్పిన ఇతర హల్లుల విషయంలో వాటిని కేవలం ఉత్వవిశిష్టమైన హల్లులుగా సూరి ఉద్దేశించలేదు గదా! ఒక ద్రుతం విషయంలో అలా ఎందుకు భావించాలి?

వ్యవహారంలో ఎదురెదురు అని వినిపిస్తుంటుంది గానీ, సూరికి అది సమ్మతమై యుండకపోవచ్చు. అందుకే 'ఎట్టయెదురు' అని మాత్రం పేర్కొనడం జరిగింది.

ఇలాగే "పేదాదుల కాలు శబ్దంబు పరంబగునపుడు కర్మధారయంబు నందు రుగాగమంబగు (సంధి—30)" సందర్భంలో కూడా పేదాది గణంలో 'గొడ్డు' అనే ఉదంత శబ్దం ఉన్నది. గొడ్డు — ఆలు → గొడ్డురాలు అవుతున్నదిగానీ, ఉత్వసంధి జరిగి 'గొడ్డాలు' కావడంలేదు.

మరికొన్ని సందర్భాలలో ఉత్వసంధి జరిగినా, సూటిగా జరుగక, మువర్ణ లోపం వచ్చి, తరువాత ఉత్వసంధి ప్రవర్తిస్తున్నది. ఉదాహరణకు, "వ్యతిరేక మధ్యమ ము వర్ణకంబునకు ఎల్లయెడల లోపంబు విభాషనగు (సంధి—48).

ఇక్కడ నమ్మకుము — ఇట → నమ్మకిట, నమ్మకుమిట అనే రూపాలేర్పడుతున్నాయి. మొదటిది ము వర్ణక లోపం జరిగిన తరువాత ఉత్వసంధి వచ్చిన రూపం. అలాగే "ఆమ్రేడితంబు పరంబగునపుడు మధ్యమ ముడుజ్ఞులకు లోపంబు విభాషనగు (సంధి—49)" అనే సూత్రం క్రింద—

'ఉండుము — ఉండుము → ఉండుండుము, ఉండుముండుము'

అనే లక్ష్యాలు పేర్కొనబడ్డాయి. వీటిలో ఉండుండుము అనేది మువర్ణలోపం జరిగిన అనంతరం ఉత్వసంధి జరిగిన రూపమే. పై రెండు సందర్భాల్లోనూ, ఏదో మార్పు జరిగిన తర్వాతనే ఉత్వసంధి వచ్చిందిగానీ, సూటిగా రాలేదు.

ఇంకా చెప్పుకోవాలంటే అందదుకు ప్రభృతుల విషయంలో కూడ లోకవ్యవహారంలో అందదుకు, (అదుకు+అదుకు) ఇఱ్ఱింకులు (ఇంకు+ఇంకు), ఇల్లిగ్గులు (ఇగ్గు+ఇగ్గు)అనేవిధంగా ఉత్వసంధి జరగని రూపాలే ఉన్నాయి.

ఈ విధంగా నిత్యవిధిని మొదట పేర్కొని, తిరిగి ఇది భిన్నంగా ప్రవర్తించిన అనేక సూత్రాలను సూరి పేర్కొనవలసి వచ్చింది. వ్యవహారంలో స్థిరపడిన రూపాలకు వర్ణనాత్మక పద్ధతిలో సూత్రంద్వారా గతి కల్పించక తప్పదు. కానీ, ఉత్వసంధి విషయంలో ఇన్ని అపవాదాలున్నప్పుడు సూరి మొదటి సూత్రంలోనే సూచనప్రాయంగా, వార్తికప్రాయంగా 'కర్మధారయాది వక్ష్యమాణ విధులు నిరవకాశంబు గావున దీనిని బాధించెడిని' అనే విధంగానో, మరో పద్ధతిలోనో ఓ చిన్న మాట అనుంటే సబబుగా ఉండేది. కేవలం సూత్రసంక్షిప్తతను అపేక్షించి చిన్నయసూరి దీన్ని విస్మరించాడా?

—వై. రామకృష్ణారావు

# లేఖలు

## నాలికేరం

అయ్యా,

పూనాలోని దక్కను కాలేజీవారు 1952లో ప్రచురించిన శివదత్త మిశ్రకృత "శివకోశ" మందు నాలికేరం గురించి ప్రస్తావిస్తూ—

"కః ప్రార్థ్యతే మదన విహ్వలయా యువత్యా।
క్వ పుంశ్రకమపేతి కథం బతాయుః।
క్వానాదరో భవతి కేన విరాజతే అబ్జం।
వాహ్యస్థి కిం ఫలము దాహర నాలికేర" మితి

—విదగ్ధ ముఖమండనం

"నా అలికే అర" ఇతి చ్ఛేదః।
ప్రతిలోమేతు "రంకే అలినా" ఇతిచ్ఛేదః।

అని ఉన్నది. వీనికి అన్వయం తెలియరాకున్నది. పండితులు తెలియపరచుదురని ఆశిస్తున్నాను.

—వైద్య పమ్మి సత్యనారాయణశాస్త్రి
206, ఇ.టి.టి.ఎస్. కాంప్లెక్స్
రైల్వేకాలని, విజయవాడ-520 011

## పుస్తక దాతలకు విన్నపం

ఆంధ్ర భాషా సాహిత్యాల వికాసానికి అవన్యంగా సేవ చేసిన సి. పి. బ్రౌన్ కడపలో నివసించి సాహిత్య యజ్ఞం నిర్వహించిన స్థలంలో, బ్రౌన్ స్మృతిచిహ్నంగా గ్రంథాలయ భవనం, తెలుగు పరిశోధనా కేంద్ర నిర్మాణం త్వరలో పూర్తి కానున్నది. రాష్ట్ర ప్రభుత్వం యిప్పటికి $4\frac{1}{2}$ లక్షల రూపాయల ఆర్థిక సహాయం అందించింది. మరో లక్ష విరాళం అందగలదని ఆశిస్తున్నాము. వదాన్యులనుండి దాదాపు 3 లక్షలు సేకరింపగలిగాము.

ఈ గ్రంథాలయానికి వల్లూరు శ్రీ రాజాశ్రేష్ఠిగారు నాలుగు వేల విలువైన గ్రంథాలను ఉచితంగా యిచ్చినారు. మహాకవి డాక్టర్ పుట్టపర్తిగారు అమూల్య గ్రంథాలను యిచ్చినారు. ఈ గ్రంథాలయం సాహిత్య పరిశోధకులకు, సామాన్య పాఠకులకు ఉపయుక్తం కాగలదు. కవి, పండితులు, ప్రచురణకర్తలు తమ పుస్తకముల ప్రతులను విరాళంగా అందించి సహకరింప ప్రార్థన.

జానమద్ది హనుమచ్ఛాస్త్రి
కార్యదర్శి
సి. పి. బ్రౌన్ మెమోరియల్ ట్రస్టు
కడప - 4

## ద్వాదశాదిత్యాది పద సముచ్చయాలకు అర్థం ఏమిటి?

ఆర్యా!

మన పురాణ సాహిత్యంలో ఆదిత్యులు పన్నిద్దరని, అగ్నులు మూడని, మరుత్తులు ఏడుగురని చెప్పబడటం అందరికీ తెలుసు. తత్వాన్ని బట్టి చూస్తే సూర్యుడొక్కడే, గాలి ఒక్కటే, అగ్ని ఒక్కటే. తత్వవేత్తలైన మన మహర్షులకు ఇది స్పష్టంగా తెలుసుననటంలో విప్రతిపత్తి ఏమాత్రమూ లేదు. మరి ఈ ద్వాదశాది సంఖ్యలేమిటి? వాటి సంకేతితార్థమేమిటి? అన్న ప్రశ్నలు ఆధునికులకు (ముఖ్యంగా మాదృశులకు) కలగడం సహజం. పరిమితమైన సాధారణ వ్యుత్పన్నతతో ఆలోచించగా నాకు స్ఫురించిన విషయాలను తజ్ఞులకు నివేదించడం ఈ లేఖ ముఖోద్దేశం.

"అనేక కోటి బ్రహ్మాండానాయ్ ఏకతమే...."

ఇత్యాదిగా గల నిత్య సంకల్పంలో బ్రహ్మాండ శబ్దానికి ఆధునిక శాస్త్ర పరిభాషలో 'గెలాక్సీ' అని అర్థం చెప్పుకోవచ్చు. ఈ బ్రహ్మాండంలో పన్నెండుగురు సూర్యులు అంటే పన్నెండు సౌరకుటుంబాలు అని అర్థం చెప్పుకోవచ్చు. సప్తమరుత్తులు అంటే ఈ పన్నెండు సౌరకుటుంబాల్లోనూ ఏడుచోట్ల వాయు మండలం ఉందని అర్థం చెప్పుకోవచ్చు. అలాగే మూడగ్నులు అనడంలో మూడు సౌరకుటుంబాల్లో నిప్పు చేయడం తెలిసిన నాగరక జీవ జంతువులున్నట్లు సంభావించుకోవచ్చు. "సప్తద్వీపా వసుంధరా" అనటాన్ని బట్టి చూస్తే పై పన్నెండు సౌర కుటుంబాల్లోని వాయుమండలం ఉన్న ఏడు సౌరకుటుంబాల్లోనూ ఇలాంటి భూభాగమే ఉన్నదని కూడా ఊహించవచ్చు. ఆ లెక్కన చూస్తే మన సౌరకుటుంబాన్ని "జంబూ ద్వీపం"గా మనం భావించవచ్చు.

ఇదంతా వట్టి ఊహే అని కొట్టిపారేయడానికి అవకాశం లేకపోలేదు. ప్రయోగ ఫలితాలతో నిరూపితం కాని విషయాలుగా భావించవచ్చు. ఇక్కడ నేను ఇంకొక విషయం మనవి చేస్తాను. ఆధునికశాస్త్రంలో "భూమ్యాకర్షణ సిద్ధాంతం" కాని ఆర్కిమెడిస్ "ప్లవన సూత్రాలు" గాని, "ఫారడే విద్యుదయస్కాంత" సిద్ధాంతాలు గాని, జెనెటిక్సుకు సంబంధించిన 'మెండల్' సిద్ధాంతాలు గాని ముందు ఊహారేఖలుగానే తళుక్కుమని స్ఫురించిన తరువాతనే ప్రయోగ ఫలితాలుగా ఆవిష్కృతమయ్యాయి అంటేప శాస్త్రీయ సత్యమైన ముందు ఊహగానే సాక్షాత్కరిస్తుంది. తదేక ధ్యానంతో దీక్షతో ఒక సత్యాన్ని దర్శించటానికి

"తపస్సు" అనే ఒక ప్రత్యేకమయిన విలక్షణమయిన ఊహా పద్ధతిని ప్రాచీన మహర్షులు రూపొందించారని అనుకొంటే అలనాటి తత్త్వదృష్టుల తపశ్చర్యను నేటి 'రిసెర్చి' ప్రక్రియతో పోల్చుకోవచ్చు.

మన ప్రాచీన ఋషుల పరిశోధన ఫలితాల్నిబట్టి ఈ గెలాక్సీలో మన సౌరకుటుంబంకాక మరో 11 సౌరకుటుంబాలున్నాయని, ఇలాంటి భూమండలాలు మరో ఆరున్నాయని (వాయుమండలంతో సహా) నాగరకజాతులు మరో రెండుచోట్ల ఉన్నాయని భావించడానికి అవకాశం ఉంది.

ఆధునిక శాస్త్రవేత్తలు గూడా నక్షత్రమండలంలో మరి కొన్నిచోట్ల నాగరకజాతులు ఉండటానికి అవకాశం ఉన్నదని ఇప్పుడిప్పుడే భావించడం జరుగుతోంది. శాస్త్రజ్ఞుల ఈ భావన మన ప్రాచీన మహర్షుల భావనకు ఉపష్టంభకంగా ఉండటం గమనార్హం.

నా యీ ఊహలు ఎంతవరకు సమంజసమో అభిజ్ఞులైన పండితులు నిరూపింతురు గాక.

—గడియారం హిరణ్మయి
పాల్వంచ.

# అది అపచారమెలా అవుతుంది!

'శ్రీకృష్ణుడు కర్ణుని తనవైపు తిప్పుకొనుటకు చేసిన ప్రయత్నం' మహాభారతము నందలి ఉద్యోగ పర్వములోని మహోత్కృష్ట ఘట్టాలలో ఒకటి. ఇందలి వాక్యాలలో "షష్ఠే చత్వాం తథా కాలే ద్రౌపద్యుప గమిష్యతి" అనే వాక్యం అనౌచిత్యమని శ్రీ కాటూరి హనుమంతరావుగారు వ్రాశారు. కాని ఇది శ్రీకృష్ణుని రాజకీయ చతురతను, కర్ణుని యుదాత్తవర్తనమును చాటిచెప్పే వాక్యం. "మే 89 భారతి"లో పై విషయాన్ని శ్రీ కా. హ. ప్రస్తావిస్తూ గీతా ప్రెస్‌వారి మహాభారత ప్రతిలో ఆ పంక్తి లేదంటూనే, సుక్తంకర్‌వారి ప్రామాణిక ప్రతిలో వున్నట్లు తెలియజేశారు. ఒక విషయాన్ని (ప్రక్షిప్తమా? కాదా?) నిర్ధారించేటప్పుడు ఎక్కువ ప్రతులలో సమానంగా వున్నదాన్నే పరిశోధకులు ప్రామాణికంగా స్వీకరిస్తారు.

ఇక వాక్యంలోని అనౌచిత్యాన్ని గూర్చి శ్రీ కా. హ. చేసిన వాదన పరిశీలిద్దాం. వారు "హిరణ్మయాంశ్చ" "శ్లోకాల్లో అటూ ఇటూ అభిషేకం గురించి వివరిస్తూ మధ్యలో ద్రౌపది షష్ఠకాలంలో నీవద్దకు వస్తుందనడం సందర్భరహితం" అన్నారు. కాని లోకంలో దేన్ని గురించైనా చెప్పేటప్పుడు ఆ వ్యక్తికి లాభించేదాన్ని మధ్యలో జోడించి ఆశ చూపించడం కద్దు. అదే చమత్కారాన్ని భారతకర్త ఇక్కడ ప్రదర్శించాడు. ఇది సహజ సుందరం.

తిక్కన సోమయాజి తన భారతానువాదంలో

కం. "పాంచాల రాజపుత్త్రియు
నంచితముగ నిన్నుఁ బొందు నార్వుర వరుసన్
సంచిత పుణ్యుఁడ వీవా
యంచుకయును వేఱు సేయకే తెమ్మెలమిన్."
ఉద్యోగ. 4-31

వ॥ "ఇట్లైనఁ గుంతికి సమస్త బంధుమిత్రులకుఁ బ్రియంబగు" అని తెలియజేశాడు.

కవిబ్రహ్మ ఈ అసందర్భమైన వాక్యాన్ని ఎందుకు స్వీకరించాడో కా.హ.గారే ఆలోచించి చెప్పాలి.

"కృష్ణుడు సంధి చేయడానికి వెళ్ళాడా? లేక ద్రౌపదికి ఇంకొక మొగుణ్ణి కుదర్చడానికి వెళ్ళాడా? ఒకవేళ కర్ణుడు ఒప్పుకొంటే ఏ మొహం పెట్టుకొని-పాండవ సభలో-సంధి కుదర్చలేక పోయాను, ఇది కుదిర్చాను అని చెబుతాడు?" అన్నారు కా. హ. గారు—

కర్ణుడే కనుక వాసుదేవుని మాటల నాలించి పాండవ పక్షం వహిస్తే యుద్ధం జరుగుతుందని కా.హ.గారు ఎలా ఊహించారో?! కర్ణుడు పాండవపక్షం వహిస్తే యుద్ధం జరుగదని కృష్ణుడికి తెలుసు. యుద్ధాన్ని నివారించి శాంతిని సాధించడానికి ద్రౌపదిని ఆశగా చూపాడు. ఇది అపచారమెలా అవుతుందో? రాధేయుణ్ణి పాండవపక్షానికి తిప్పుకోవడానికి సాధ్యమైన ఆశలన్నీ చూపాడు. అంటే కాంతా, కనక, అధికారాల్ని ఇవ్వజూపాడు. అయినా కర్ణుడు నిరాకరించాడు. అదీ కర్ణుని వ్యక్తిత్వం. కృష్ణుడు రాయబారిగా తన కర్తవ్యాన్ని అద్వితీయంగా నిర్వహించాడు. తన రాయబారం సఫలం కావడానికి చేయవలసిన ప్రయత్నాలన్నిటినీ చేశాడు వాసుదేవుడు.

కనుక "షష్ఠే చత్వాం తథా కాలే ద్రౌపద్యుప గమిష్యతి" అన్న వాక్యం ఏ విధంగా చూచినా ఆ ఘట్టానికి వన్నె తెస్తుందే కాని అసందర్భం కానేరదు.

—మానాప్రగడ ప్రకాశం

# ‘ఏమండీ. ఆ భరించలేని నొప్పి ఏమైంది!’’

“పోయిందే!”




మేలుపరచబడిన **అమృతాంజన్** వాడడంతో,

కోమలమైన అమృతాంజన్‌ను చాలా సులభంగా రాసుకోవచ్చు.

మృదువైన **అమృతాంజన్‌తో** చాలా సులభంగా 'మర్దనా' వేయవచ్చు.

తలనొప్పులను, వొళ్ళు నొప్పులను, కీళ్ళ నొప్పులను, కండరాల నొప్పులను మరియు బెణుకులను మేలుపరచబడిన అమృతాంజన్ మునపటికంటే **అతి** త్వరితంగా వుపశమింపజేయగలదు !

## మేలుపరచబడిన
# అమృతాంజన్

మీ మోముపై చిరునగవులను శీఘ్రంగా- తిరిగి వికసింపజేయుగలదు!

Amrutanjan Limited 

OBM 149 TG R

# గ్రంథ విమర్శలు

## విప్లవయోగి - విశ్వకవి వేమన వేద శాస్త్రం

[రచయితలు: గుజ్జుం వెంకటరెడ్డి మరియు పోచన రామిరెడ్డి; ప్రతులకు : గుజ్జుం వెంకటరెడ్డి, స్వాతంత్ర్య సమర యోధుడు, వెలుగోడు (పోస్టు) 518 533; కర్నూలు జిల్లా, ఆం. ప్ర.; ముద్రణ : జనవరి 1988; పుటలు 592; వెల: రు. 90/- లు.]

గొప్ప సంఘ సంస్కర్తగా, తాత్త్వికునిగా; కవిగా వేమన సుప్రసిద్ధుడు. నేడు సాహితీలోకం తొలి ప్రజాకవి అంటున్నది. వేమన సాహితీలోకంలో ఆలస్యంగా గుర్తింపునకు వచ్చినా, ఆయనపై విశేషమైన గ్రంథాలే వచ్చినవి. వ్యాసాలకు లెక్కలేదు. ఆయనపై అభిమానం పెంచుకున్న పండితవర్గమూ తక్కువ లేదు. అభిమాన సంఘాలు ఏర్పడినవి. ఆ మార్గంలో మరియొక గ్రంథమిది.

కులాభిమానం ఉన్నా లేకపోయినా రాయలసీమ అన్నా, రాయలసీమ వాసియే అయిన వేమన అన్నా విపరీతమైన అభిమానం కనపడుతోంది ఈ రచయితల్లో.

ఇది పరిశోధనాత్మకమైన గ్రంథం కాదు; విమర్శనాత్మకమూ అనలేము. అయితే రచయితల పరిశ్రమ వృథా అనజాలము. వేమనపై విపరీతమైన అభిమానముతో నైతేనేమి, సంఘ సంస్కరణాభిలాష కలవారవడంతో నైతేనేమి ఇంచుమించు 12 సంవత్సరాలు శ్రమపడి ఒక ఉద్గ్రంథం వెలువరించారు.

అత్యంత నూతనం గాకపోయినా కొన్ని క్రొత్త విషయాలను ఈ గ్రంథంలో రచయితలు ప్రతిపాదించారు. మొదటిది వేమన దిగంబరుడు కాడనుట ముఖపత్రంపై వేమన వస్త్రభూషితుడై ప్రజలకు బోధ గావిస్తున్నట్లు చిత్రింపించినారు. అందుకేనేమో వీరి దృష్టిలో వేమన కేవలం యోగికాడు; విప్లవ యోగి. రెండవది వేమన భగ్నహృదయుడై యోగి అయినాడనే వాదాన్ని తిరస్కరించడం. మూడవది వేమన నారీ ద్వేషి కాడని, స్త్రీజనోద్ధరణకై కృషి చేసాడని ప్రతిపాదించడం, సమసమాజ స్థాపనయే వేమన ఉద్దేశమని తెలిపారు. ఇలాంటి నూతనాంశాలు మనకీ గ్రంథంలో ఎన్నో కనిపిస్తాయి.

ఈ గ్రంథంలో అయిదు విభాగాల్లో 53 శీర్షికలతో వేమన దర్శింపబడినాడు. మొదటి విభాగాన్ని ప్రవేశకము (ఇంట్రడక్షన్) అనవచ్చు. ఇందులో 9 శీర్షికలతో వ్యాసాలున్నవి. రచయితలు తమనుగూర్చి, ఈ గ్రంథం వ్రాయవలసిన ఆవశ్యకత గూర్చి, తమ రచనకుముందు వెలువడిన గ్రంథాలగూర్చి వివరించినారు. కొన్ని అనావశ్యకములైన విషయాలు చోటుజేసుకొన్నా ఈ విభాగంలో వేమన యోగి కావడానికి దోహదపడిన పరిస్థితులను గూర్చి, ఇప్పటివరకు ఉన్న భగ్నహృదయుడై యోగి అగుట అనెడి పుక్కిటి గాథలను నిరాకరించి, ఆనాటి సంఘ పరిస్థితుల వలన సంఘ సంస్కరణకు పూనుకొనియుండునని తెలిపినారు. వేమన చిత్రపటాలను గూర్చి పూర్వ గ్రంథ ముఖపత్రాలపై గలవానిని వివరించి ఆ విధంగా వేమన నగ్నమునిగా ఉండడానికి ఆధారమేదీ లేదని వివరించారు. (ఈ అంశం మరలా ప్రసక్తము)

రెండవ విభాగం సాంఘిక విషయానికి సంబంధించినది. ఇందులో 16 శీర్షికలున్నాయి. దీనిలో మకుటార్థం ఈ విధంగా వివరింపబడింది — "లోకమందలి ప్రజలకు ఆదర్శాలను, నీతులను అభిరామంగా = అనగా మనోహరంగా మనస్సుకు ఆకట్టుకొనునట్లు, దా=ఇచ్చుటకు లేదా బోధించుటకు నిర్ణయించుకున్న ప్రజాకవి కావడం ఈ మకుటాన్ని పెట్టుటకు ఒక కారణం కావచ్చు." (పు 83-84) తరువాత వర్ణ వ్యవస్థను గూర్చి, బ్రాహ్మణులు, అగ్రవర్ణాలవారు చేసే అన్యాయాలను గూర్చి వివరించబడింది. బ్రాహ్మణ శబ్దార్థం వివరింపబడింది. అదే విధంగా నాటి రాచరిక వ్యవస్థ ఏ విధంగా అస్తవ్యస్తంగా మారిందో చూపించారు (పు 96-104). 'విప్లవం' అనే పదాన్ని వేమన గ్రామీణ పరిభాషలో 'ఉప్పలం' అని వాడినట్లు తెలిపినారు (పు 101) అంటే విప్లవం వేమననాడే ఉందని ఉద్దేశం. దీన్నిగూర్చి మరల రెండు మూడుసార్లు చెప్పబడింది. (ఈ గ్రంథంలో ఒకసారి చెప్పిన అంశాన్నే మరల మరల చెప్పడం కనిపిస్తుంది. అందువల్ల కూడ గ్రంథం పెరిగింది.) పతిత జాతులను గూర్చి వేమన పడిన ఆరాటాన్ని ఆయన పద్యాలద్వార వివరించారు (పు 117-124). వేమన స్త్రీజన వ్యతిరేకి కాదనీ,

స్త్రీజనోద్ధరణయే ఆయన ఉద్దేశమని సుమారు 12, 13 పుటల్లో వివరంగా తెలిపినారు (పు 125-137). నాటి సంఘ పరిస్థితి ఆస్తులను, స్త్రీలను రక్షించుకోవడానికి పోరాడవలసిన స్థితి ఉండేదనీ, అందుకే సమష్టి కుటుంబానికే వేమన మొగ్గు జూపినాడని వివరించారు (పు 139). స్త్రీలు పురుషునికి దాసిగా పడి ఉండుట కంటె పురుషులతోపాటు పనిచేసి సమానత్వం (సహధర్మచారిణిగ) సాధించాలని వేమన 'ఒల్లమాలు మగువ ఓల మాడలు చేటు....' అనే పద్యం ద్వార తెలిపినాడన్నారు (పు 141). ఈ విభాగంలో స్త్రీజనోద్ధరణకై వేమన సూచించిన సంస్కరణలు ఈ విధంగా ఉన్నాయి—

1. వ్యభిచార వృత్తిని నిరసించడం.
2. కన్యాశుల్క, వరశుల్కాల ఖండన.
3. వృద్ధ వివాహాలను తూర్పారబట్టడం.
4. ఈడు, జోడు చూచి పెండ్లిండ్లు చెయ్యాలని ప్రతిపాదించడం.
5. స్త్రీల శీలరక్షణ విషయంలో పురుషులు ప్రాణాలైనా అర్పించాలని ప్రబోధించడం.
6. స్త్రీలు తమంత తామే దుష్టులను ప్రతిఘటించి వారి బారినుండి అవసరమైనప్పుడు ఆత్మరక్షణ చేసుకోవాలని చాటిచెప్పడం.
7. పెండ్లిండ్ల విషయంలో ధనికులు పేదలతో ఇచ్చి పుచ్చుకోవడాలు జరిపి, వారికి దారిద్ర్య నిర్మూలనలో తోడ్పడాలనడం.
8. స్త్రీని మాతృమూర్తిగా భావించి పూజించాలనడం.
9. సాహిత్యంలో తల్లి, చెల్లి వంటి స్త్రీలను అసభ్యంగా వర్ణించడం, వారిని కామకలాపాల ఆటవస్తువుగా మార్చడం, మానవజాతికే అపచారమని, కళంకమని ఎలిగెత్తి చాటడం.
10. స్త్రీలు గూడ అనవసర వయ్యారాలు ఒలకబోసే జారభామినులు కారాదని, శీలాన్ని పణంగాబెట్టి పొట్టబోసుకొనే దుర్దశకు దిగజారరాదని నీతిబోధలు చెయ్యడం.(పు 148-149)

ఈ విభాగంలో కాని తరువాతి విభాగాల్లో కాని పూర్వ విమర్శకులు తెలియజేసిన పలు అంశాలు చోటు జేసుకొన్నవి. కాబట్టి వాని వివరాలు తిరిగి ఇవ్వడం అనావశ్యకంగా భావించి క్రొత్తగా చెప్పిన అంశాలను మాత్రమే వివరించుటకు ప్రయత్నిస్తాను.

ఆస్తిపై వారసత్వపు హక్కును గూడ విరాకరించిన మొట్టమొదటి కవి వేమన యట - 'తల్లి దండ్రి సొమ్ము లూదింట కారాదు... ' అనే పద్య వ్యాఖ్యానమిది (పు 208). "ఆస్తి సమాజానిది. లేదా 'ప్రభువైన' దేవునిది - 'శ్రమ' మాత్రమే తనది అన్నది వేమన సిద్ధాంతం" అంటున్నారీ రచయితలు.

నాటి సమాజంలో ఉన్న ఎన్నో విషయాలను వీరు వేమన పద్యాలద్వార వివరించడానికి ప్రయత్నించారు. దానం చెయ్యని లోభులు, డబ్బున్న వారికే దానం చేసేవారు, దానం చేసే వారిని అడ్డుకునే దుష్టమంత్రులు, ధనవంతులకే పిల్ల నివ్వాలనుకునేవారు, వేశ్యావృత్తితో జీవించేవారు, వేశ్యలను ఉంచుకోవడం గర్వకారణంగా భావించేవారు - ఈ విధంగా సంఘంలో సమాజానికి రుగ్మతవంటి లక్షణాలు గలవారి చర్యలనన్నింటిని వేమన తీవ్రంగా ఖండించిన విషయాలను రచయితలు సోదాహరణంగా వివరించారు.

మూడవ విభాగం సాహిత్యమునకు సంబంధించినది. ఇందులో 12 శీర్షికలున్నాయి.

ఈ గ్రంథంలో నాటి సామాజిక పరిస్థితులనే గాక నేటి సమాజ స్థితిగతులు, ఈ సమాజాన్నుద్ధరించుటకు ప్రయత్నం చేసిన ఆధునిక సంస్కర్తలు మొదలగు విషయాలు అధికంగా చోటుజేసుకున్నాయి. ఇవి చదువుతుంటే ఒకొకసారి అనవసరంగా రచయితలు గ్రంథం పెంచుతున్నారేమో అని అనిపిస్తుంది.

వేమనను నన్నయాదులతో పోలుస్తూ, "పౌరాణిక ప్రథమ కవి నన్నయ అయితే, 'ప్రజల ప్రథమకవి'; "తిక్కన ఉభయ కవి మిత్రుడైతే, వేమన 'అభయకవి మిత్రుడు'. పోతన భక్తకవి అయితే, వేమన 'ప్రజాభక్తకవి'" (పు 301) "వేమన పుట్టు కవి గాని, పెట్టు కవిగాదు." (పు 309) ఈ విధంగా వేమనపై తమకుగల అభిమానాన్ని వెలువరించారు రచయితలు.

నన్నయ కాలంనుండి ప్రభు పండితాదరణ గల సంస్కృతం కనుసన్నల్లో తెలుగు భాషా సాహిత్యాలు, తెలుగు వృత్తాలు

మెలగవలసి వచ్చిందనీ, వేమన ఆటవెలది ప్రభావంతో తత్త్వాలు, వచనాలు, ఏలలు, కవులు మొదలగు ప్రజా ఛందోరీతులలో రచింపబడినవనీ, ఈ విధంగా తెలుగుభాష పండితుల ఛందో బందిఖానానుండి విడివడి తొలిసారిగా ఆరువందల ఏండ్ల తరువాత బ్రతికి బయటపడి స్వేచ్ఛావాయువులు పీల్చనారంభించిందనీ ఈ రచయితలు అభిప్రాయపడినారు (పు 318). ఇటువంటి విషయాలను వ్రాసేటప్పుడు రచయితలు జాగ్రత్తగ వ్యవహరించడం అవసరం. గేయ సాహిత్యం, యక్షగాన సాహిత్యం వేమన ప్రభావంచేత వెలువడిందా అనేది కూలంకషంగా నిరూపించి ఆ తరువాత ఇట్టి విషయాలను వ్రాస్తే బాగుంటుంది. వేమనపైగల విపరీతాభిమానాన్ని ప్రకటించడానికి ఇది మార్గంకాదు.

కొన్నిచోట్ల వేమన ఆధ్యాత్మిక దృష్టితో వ్రాసిన పద్యాలను మరొక విధంగా అన్వయించడం జరిగింది. ఉదాహరణకు "బాల చనుల పూల బంతుల బోల్తురు...." అనే పద్యం ప్రబంధ కవుల స్తన వర్ణనను నిరసించడానికి వ్రాసాడని వీరు పేర్కొన్నారు. (పు 328)

"కందుకూరి, గురజాడ లిరువురు ఏ కారణాలవల్లనో వేమన ప్రస్తావన ఎత్తకపోయినప్పటికి, వారి సంఘ సంస్కరణ-సాహిత్యోద్యమాలకు పూర్వరంగం మాత్రం వేమన పద్యాల్లో ఉందన్నది సత్యం." (పు 336) సంస్కరణాభిలాషులందరు పూర్వ సంస్కర్తలచేత ప్రభావితులైనారని చెప్పజాలము. కందుకూరివారికి రాజా రామ్మోహనరాయలు మొదలగువారు ఆదర్శప్రాయులు. రామ్మోహనరాయలకు వేమన ఏం తెలుసు?

కందుకూరి, గురజాడ లిరువురు వేమనపట్ల అపచారం చేసారని వీరంటున్నారు. సాంప్రదాయ నవీన విధానాలు కలగాపులగమే కందుకూరివారి భాషా, సంఘ సంస్కరణలైన కారణంగా - అనగా బ్రాహ్మణత్వంపై మోజు కారణంగా కందుకూరి వేమనను కవిగా గుర్తించలేదట (పు 348-9). గజపతులను వేమన నిరసించిన కారణంగా గురజాడ ఆయనను స్మరింపలేదట (పు 352). అదేవిధంగా లింగమతాన్ని, శ్రీశైల యాత్రను దుయ్యబట్టడం, భగవద్గీతపై విమర్శ సాగించడం కారణంగా విశ్వదాతకు వేమన కవిత్వం వెగటుగా తోచి 'పామర కవిత్వం'గా ఈసడించి ఉండవచ్చునని తెలిపినారు (పు 354).

వేమనపై వైష్ణవ కుతంత్రం అనే శీర్షికతో 'తొలి సమాజ కవులు' అనే గ్రంథంలో 'సామాజిక వైరుధ్యాల మధ్య వేమన' అన్న వ్యాసం వ్రాసిన జ్వాలాముఖి ఉరఫ్ రాఘవాచార్యులు, వారి నా వ్యాసాన్ని వ్రాయడానికి పురిగొల్పిన కె. కె. రంగనాథాచార్యులు ఒక ప్లాను ప్రకారం కుట్ర చేసినట్లుగా సుదీర్ఘ చర్చ చేసినారు. పాపం వేమన వారికి ఎటువంటి ద్రోహం చేసిఉన్నాడో ఆ విధంగా కుట్ర చేయడానికి. వేమనపై అభిమానం ఉండడం మంచిదే. దురభిమానం మంచిది కాదు. ఏ విషయానైనా సహేతుకంగా విమర్శించడం మంచిది. వేమనలో గల 'దూషణ' లక్షణం వీరిలో కూడ కొంత కనిపిస్తోంది.

'ప్రక్షిప్తాల పాపకూపాలు' అనే శీర్షికలో కొన్ని పద్యాలు తమ కనుకూలంగా తరువాతివారు ఏ విధంగా కల్పించారో వివరించారు. విశ్వబ్రాహ్మణులు వేమనకు గురువుగా అభిరామయ్యా అనే కంసాలి కథను ఏ విధంగా సృష్టించారో వివరించారు (పు 390). ఇక బ్రాహ్మణ పండితులు కూడ బ్రౌన్ వేమన పద్యాల సంకలనం రెండవది వెలువడకుండా ఏ విధంగా అణగద్రొక్కారో వివరించారు. (పు 390) "ఆలు మగని కడ్డంబు వచ్చెనా...." అన్న పద్యం కూడా ప్రక్షిప్తమే నంటున్నారు వీరు (పు 396) ఈ విభాగంలో ఇంకా ఎన్నో విలువైన విషయాలను వీరు తడివినారు.

నాలుగవ విభాగం తాత్త్వికము. ఇందులో అయిదు శీర్షికలున్నాయి. వేమన సజీవ సమాధి కాలేదని వీరంటున్నారు (పు 413) ఆనాడు సాధారణ సమాధులే లేవనీ, సజీవ సమాధి అన్న సమస్య లేదనీ, వీరబ్రహ్మం తర్వాత చాలా కాలానికి కటారు పల్లెలో సమాధి నిర్మింపబడిందనీ తెలిపినారు.

వేమన దిగంబరుడా? - అనే శీర్షికలో వేమన వేషమును గూర్చి మొదటినుండి నేటిదాక వచ్చిన వేమన పద్యాల ప్రతులు వాని ముఖపత్రాలు, విమర్శలు మొదలగువానిని వివరించి సుదీర్ఘమైన చర్చగావించి వేమన దిగంబరుడు కాడని నిరారించారు. వేమన భావాలు నచ్చని (ముఖ్యంగా ధర్మికవర్గం) అతనిని

అవమానించి గోచి ఊడదీసి అల్లరిచేసి ఉండవచ్చునని, ఆ సందర్భంలోనే 'అనువుగానిచోట నధికుల మనరాదు....' అనే పద్యం చెప్పి ఉంటాడనీ, నోరెత్తడానికి వీలులేని సందర్భంలో 'పదుగురాడు మాట పాటియై ధరజెల్లు....' అనే పద్యం చెప్పి ఉండవచ్చునని ఊహిస్తున్నారు వీరు (పు 451-52).

"కూడు గుడ్డలకు నోచుకొనని నిర్భాగ్యులను, తమ సుందర దుకూలాల ఆడంబరాన్ని ప్రదర్శించి ఈసడించే ధనిక వర్గాల దర్పాన్నీ, తాము వేదాధికారులమని, ఆధ్యాత్మికోన్నతుల మని, విర్రవీగే అగ్రవర్ణాల అహంకారాన్ని, పటాపంచలు చెయ్యడానికే ఫెల్లుమని చెంపపెట్టు పెట్టినట్లు 'తల్లి గర్భమందు బుట్టినప్పుడు' 'నెంగిలెంగిలనుచు నా నోటితోడనే, వేదములను మవు వెర్రులార' అన్న పద్యాలను చెప్పి ఉంటాడనేది ఎవరి కైనా తోచే సహేతుక సందర్భం." (పు 473). వేమన దిగంబరు డనడానికి ప్రధాన పద్యమైన 'తల్లి గర్భమందు....' దానికి రచయితల సమన్వయం చక్కగా ఉంది.

వేమన దిగంబరుడు కాడని కొందరు పూర్వ విమర్శకులు ఉన్నా కాని ఈ విధంగా సాధికారికంగా చర్చించి వివరించిన వారు కానరారు. వేమన దిగంబరుడా? కాడా? అనే విషయాన్ని మరలా ఒకసారి పండితులు పూర్వాపరాలు ఆలోచించి నిర్ణయించవలసిన అవసరం కల్పిస్తున్నారు వీరు. దిగంబరుడైనవాడు ప్రజల మధ్యకు వచ్చి ఏ విధంగా బోధ చేసాడు అనేదాన్ని కూడ మనం ఆలోచించాలి. అయితే అది అసాధ్యము కూడా కాదేమో? ఈ మధ్య పత్రికలలో ప్రముఖంగా చర్చలోకి వచ్చిన మంగమ్మవ్వ దిగంబరి కాదా? ఆమె ప్రజలమధ్య ఉన్నది కదా? ఒక స్త్రీ ఆ విధంగా పూజింపబడగా, వేమన దిగంబరుడుగా తిరుగలేడా? ఏమైనా ఆయన తాత్త్వికదృష్టిని నిర్ణయించి, సంస్కరణాభిలాషను జ్ఞప్తియందుంచుకొని వేమన దిగంబరుడా కాదా అనే విషయాన్ని నిర్ధారింపవలసి యున్నది.

అయిదవ విభాగంలో బుద్ధుడు మొదలగువారితో వేమనను తులనాత్మకంగా పరిశీలించడం జరిగింది. ఇందులో 10 శీర్షికలున్నాయి. బుద్ధుడు, తిరువళ్ళువరు, అవ్వయ్యార్, కబీరు, వీరబ్రహ్మం, సర్వజ్ఞుడు, వివేకానందుడు మొదలైనవారి బోధలతో వేమన సిద్ధాంతాలతో పోల్చి వేమనవి విలువైనవి గల చోట్ల వానిని ప్రశంసిస్తూ వేమనను 'విశ్వకవి' అని చెప్పడానికి ఈ విభాగంలో ప్రయత్నం జరిగింది.

మొత్తంపై ఈ ఉద్గ్రంథం విలువైనదే. వీరు వెలిబుచ్చిన అభిప్రాయాలు అన్నీ అంగీకారయోగ్యం కాకపోవచ్చును కాని ఆ దృష్టితోడ కూడ వేమనను దర్శించవలసిన అవసరాన్ని రచయితలు గుర్తు చేసినారనవచ్చును. కొన్నిచోట్ల అనవసర విషయ వివరణలతో గ్రంథాన్ని పెంచినా గ్రంథరచన అనావశ్యకమైనది ఎంతమాత్రం కాదు. వేమనపై వీరికి అణువణువునా అభిమానం పొంగివస్తున్నదని గ్రంథం చదివితే తెలుస్తుంది. అందుకే కొన్నిచోట్ల దురభిమానంతో చర్చలు గావించినట్లు తోస్తుంది. తాము రాయలసీమవారై, వేమన కూడ రాయలసీమ వాడైన కారణము కూడ అంటే ప్రాంతీయాభిమానము (ప్రారంభంలోనే ఈ విషయం ఉన్నది) చేత వేమనను ఆకాశాని కెత్తినట్లు కనిపిస్తుంది. అయితే కులాభిమానాన్ని మాత్రం వీరు కనపరచలేదు. అది సంతోషదాయకమైన విషయం.

చెప్పిన విషయాన్ని పలుమార్లు చెప్పినా, అనవసర విషయాలను జోడించినా, వేమనను బాగా అర్థం జేసుకున్న వారనీ, అభిమానం పెంచుకున్నవారనీ అవగతమవుతుంది. వేమన సమసమాజ భావాలు కలవాడని తమ దృష్టితో చూచి చెప్పిన అంశాలు అందరికి ఆమోదయోగ్యం కాకపోయినా జాతి ఉద్ధరణకు, సంఘ సంస్కరణకు వేమన చేసిన ప్రయత్నాలను మరొకసారి మన కన్నులకు కట్టినట్లు వివరించారు రచయితలు.

అయితే డాక్టర్ గోపిగారు అన్నట్లు వేమన పద్యనిర్ణయం ఒక గడ్డు సమస్య. దేశంలో ఉన్న వేమన పద్యాలన్నీ సేకరించాలి. పాఠాంతరాలను గుర్తించాలి. నాటి సమాజ స్థితిగతులను ఇతరత్రా కూడా నిర్ధారించాలి. పండితులీవరకే ఎన్నో పద్యాల విషయాల్లో ఒక నిర్ణయం చేయడం జరిగింది. అన్ని పద్యాలను అదేమాదిరిగా నిర్ధారించాలి. ప్రక్షిప్తాలు తొలగించాలి. అప్పుడుకాని వేమన మనకు సరిగ్గా అర్థంకాడు. అంతవరకు ఆయనపై ఎన్ని గ్రంథాలు వెలువడినా అంత ప్రయోజనకారి కాబోదు.

డాక్టర్ వి సత్యనారాయణ

# గ్రంథ స్వీకారాలు

## 1988 సంవత్సరం రాశిఫలాలు

[రచయిత: సూర్యశ్రీ, చిరునామా: సూర్యశ్రీ, తాడిపర్రు, తణుకు తాలూకా, ప. గో. జిల్లా, వెల: రూ. 4-00లు.]

దీనిలో సంవత్సర ఫలంతోపాటు కంధాయ ఫలాలు ప్రతి రాశికి సంవత్సరాంతంవరకు మాసఫలాలు ఇవ్వబడ్డాయి. ఏఏ మాసాలలో ఏఏ గ్రహాలు అధిపతులుగా ఉన్నారో వారికి శాంతి ఏమి చెయ్యాలో వివరించబడి ఉంటే పండితులకే కాకుండా సామాన్యులకు కూడా మంచిచెడులు తెలుసుకోడానికి చాలా వీలుగా ఉంది ఈ పుస్తకం.

ఈయనే శ్రీ వేంకటేశ్వర శతకం కూడా రచించారు. దీనిలో 100 పద్యాలు విశ్వజనపాల శ్రీనివాస వేంకటేశ అనే మకుటంతో సాగాయి. అక్షయ నామ సంవత్సరంలో వచ్చిన జలప్రళయం గురించి వేంకటేశ్వరుని పేరిట ఈ శతకం రాయబడింది. ఇందులో అంతా నేడు నడుస్తున్న చరిత్ర విపులంగా ఉంది. దీని వెల: 1 రూపాయి.

## జాతీయ విప్లవకారులు

[రచయిత: డాక్టరు జి. అధికారి, ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, 4-1-435, విజ్ఞాన్‌భవన్, బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాద్ 500 001, వెల: రూ. 1-50]

ఈ 24 పేజీల పుస్తకంలో భారతదేశపు స్వాతంత్ర్య సంగ్రామ తొలి అనుభవాలను పొందుపరిచారు. ఆనాడు ఎందరో యువకులు ఉద్యమంలోకి దూకారు. వారినందరినీ విప్లవకారులుగా టెర్రరిస్టులుగా చిత్రీకరించి తెల్ల ప్రభుత్వం కఠినంగా వ్యవహరించింది. నిజానికి వీరందరూ జాతీయ విప్లవవీరులు అని రచయిత వివరించారు.

భారతీయులను హింసించినవారిని చంపివేయడమే ఈ వీరులు ఉద్యమంగా పెట్టుకున్నారు.

డే అనే ఆంగ్ల అధికారిని గోపీనాథ్‌షా చంపాడు. అందువల్ల అతనికి మరణదండన విధించడం జరిగింది. అలాగే ఖుదీరామ్ బోస్ ఆత్మార్పణ చేసుకున్న విషయాన్ని కేసరి పత్రికలో తిలక్ సంపాదకీయం రాసినందుకు ఆయనకు ఆరు సంవత్సరాల కఠిన కారాగార శిక్ష విధించారు. ఇలాగే ఉత్సుకతను కలిగించే చారిత్రకాంశాలు ఎన్నో ఈ పుస్తకంలో ఉన్నాయి.

## తిరుమలేశుని ప్రశ్నోత్తర వినోదిని

[రచయిత : బయిరెడ్డి సుబ్రహ్మణ్యం, చిరునామా: రచయితపేర 4-49-20బి. శాంతినగరు, ముత్యాలరెడ్డిపల్లి రోడ్డు తిరుపతి-2]

దీనిలో నూట ఎనిమిది పద్యాలున్నాయి. ఈ పద్యాలన్నీ ప్రశ్నలే!

తిరుమలేశ మకుటంతో చదవడానికి ఇంపుగా ఉన్నా ఒక్కొక్క పద్యంలో ఒక్కొక్కరకంగా వర్ణించి ఒక్కొక మూర్తికి అన్వయించడం జరిగింది. కాస్తంత ఆలోచి చదువుకుంటే విజ్ఞానంతోపాటు వినోదం కూడా కలుగుతుంది.

గంగ దూకుచుండుగాని తీర్థము గాదు
కలవు ఫణులుగాని పుట్టకాదు
కలదు చంద్రరేఖగాని వ్యోమము కాదు
దీని భావమేమి తిరుమలేశ.

దీనికి అర్థం శివుడు. పదాలన్నీ సరళంగా అందరికీ అర్థం అవుతాయి. అన్నీ ఆటవెలది పద్యాలే.

## (1) శ్రీ సత్యనారాయణ శతకము

[రచయిత: తెలిదేవర వెంకట బాలకృష్ణరావు చిరు అచ్యుతాపురం పోస్టు, అంగర, ఆలమూరు తాలూకా, తూ గోదావరి జిల్లా - 533 315, వెల: రూ. 2-50లు.]

సత్యనారాయణ అనే మకుటంతో 111 పద్యాలు ఉన్నా అన్నీ కూడా భక్తి రసాత్మకమయినవే. 61వ పద్యం ద నుంచి 84 వరకు ఉన్న పద్యాలు కేశవనామాలు 24 ఉపయోగి చెప్పిన పద్యాలు బాగున్నాయి. ఈ పద్యాలు చదివితే నామ పాటంతట అవే పూర్తవుతాయి. అలాగే నవవిధ భక్తి షోడశోపచారాలు చక్కగా వర్ణించబడ్డాయి.

## (2) శ్రీ వేంకటేశ్వర శతకం

శ్రీ తెలిదేవర వెంకట బాలకృష్ణగారే శ్రీ వేంకటేశ్వ అనే మకుటంతో భక్తి వైరాగ్య ప్రధానంగా ఈ శత రచించారు. దీని వెల కూడా రు. 2-50లు.]

## చాళుక్య (సచిత్ర సాహిత్య మాసపత్రిక)

[సంపాదకుడు: పిల్లలమర్రి వెంకటరామయ్య, చాళు శోధన్ బిల్డింగ్స్, టి.నగర్, రాజమండ్రి-533 100, సంవత చందా రు. 20-00లు. విడి ప్రతి రు. 2-00]

ఈ పత్రికలో శ్వేతాశ్వతరోపనిషత్తు నుండి ఒక మంత్ర దాని తాత్పర్యంతోపాటు ఒక పెద్ద కథ తప్ప ఇందులో ప్ర కంగా విశేషాలు ఏమీ లేవు. ముఖచిత్రంగా చలంగారి బొ బాగుంది.

Printed & Published by S. Radhakrishna for Nageswara Rao Estates Ltd., at the Andhra Patrika Press. Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna, Vijayawada. Phones : 75667 & 61247